# పర్ణశాల

ఆంధ్రభూమి సచిత్ర వారపత్రికలో
ధారావాహికంగా వెలువడిన నవల.




# పర్ణశాల

(ఆంధ్రభూమి సీరియల్)

వాహినీ ప్రచురణ



ప్రథమ ముద్రణ
1978 నవంబరు.

ప్రింటర్స్
మోచన,
విజయవాడ-2.

వెల: రు. 9-0-0

వాహినీ ప్రచురణాలయం
విజయవాడ-2



యండమూరి వీరేంద్రనాథ్

# పర్ణశాల



# పర్ణశాల

ఉత్తుంగతరంగాల్ని సృష్టిస్తూ మహార్ణవం మీద నుంచి వస్తున్న ప్రళయకాల ఝంఝామారుతమే క్షణకాలం విస్తుబోయి వెనక్కి చూసేట్టు విన్నూ మిన్నూ ఫెటేలున విరిగిన చప్పుడు.

జగచ్ఛక్షువు వసుమతితో రమించటానికి పడమటి కొండల్లోకి జారి, కాసింత కన్నుమూయగానే - చలివాగు మీద మోయిలు తెరకప్పి తిమిరంతో ఆడుతున్న సరసాన్ని బెదిరి ఆపిన ఆకాశం....

నీరు తాలుపు సాయంతో తలంటు పోసుకున్న భూదేవి – విభావరి మేలిముసుగు.... తపో భంగం అయిన ఋషిలాంటి ప్రకృతి.... గుర్తు తెలియని చిత్రకారుని కుంచెలోంచి జారిన వంకరగీత– అమరత్వం పొందిన పాపం.... పర్వతాల్ని కరిగించటానికి పంతం పట్టిన గాలి–సృష్టి స్వాగతం చెప్పుకుంటున్నట్టు ఘోష

....చైతన్య చిన్నగా ఒణికేడు.

బలంగా వీస్తున్న గాలికి కొబ్బరిచెట్ల ఆకులు అటూ ఇటూ ఊగుతూ శబ్దం చేస్తున్నాయి. కిటికీ రెక్కలు కొట్టుకుంటున్నాయి. ఆగి ఆగి వీస్తున్న గాలితో సన్నటి జల్లు అలలు అలలుగా పడుతోంది.

ఏదో జరిగి మెలకువ వచ్చింది.

ఏదో కల!

భూమి కదలిపోతున్నట్టూ—— ఆకాశం కృంగిపోతున్నట్టూ.... అస్పష్టమైన పీడకల!

అతడికి చిన్నప్పటినుంచీ వర్షాన్ని చూస్తే ఎలర్జీ.

బయట మెరిసి గదంతా వెలుగుతో క్షణంపాటు నిండిపోయింది. అంత చలిలోనూ నుదుటిమీద చెమటపట్టింది

వెనీషియన్ బ్లైండ్స్ వెనుకనున్న చెట్లనీడలు గాజు అద్దాలమీద వికృతంగా నాట్యం చేస్తున్నాయి. కారిడార్ చివరనుంచి ధారగా క్రింద పడుతోన్న నీటి శబ్దం వినిపిస్తోంది అక్వేరియంలో చేపపిల్లలు బైటబీభత్సం తెలియకుండా నిద్రపోతున్నాయి. బయట మెరుపులు గదిలో ఆయిల్ పెయింట్స్ మీద రిఫ్లెక్ట్ అవుతున్నాయి. తడిసిన నైట్‌క్వీన్ వాసన గాలితోపాటు మత్తుగా వస్తూంది. పైవరకూ పాకిన మల్లెతీగ కిటికీలోంచి తొంగి చూస్తూంది.

నుదుటమీద పట్టిన చెమటని తుడుచుకుంటూ చైతన్య పక్కకి చూసేడు.

కాంతిమతి నిద్రలోనే బాబుని దగ్గరకు తీసుకొంది.

దూరంగా ఎక్కడో ఉరిమింది.

చైతన్యకి జ్యోతిష్యంమీద, శకునాలమీదా నమ్మకంలేదు. కానీ మనసు ఏవో సంకేతాల్ని ఆగకుండా మెదడుకు అందిస్తూంది.

———ఏం జరుగుతుంది?

పిడుగుపడి తను కుటుంబంతో సహా నాశనంఅయిపోతాడా? చావు అపశకునం కాదే!

రెండుగంటల క్రితం జరిగిన బిజినెస్ ఎగ్రిమెంట్‌లో నష్టం వస్తుందా? ఎంతొచ్చినా యాభైవేలకన్నా ఎక్కువరాదు. అదో పెద్దనష్టం కాదు.

మరి....?

తన కలవి పునశ్చరణ చేసుకోవటానికి ప్రయత్నించేడు. ఓ బికారి బట్టలు పీలికలై - గెడ్డం పెరిగి పిచ్చివాడిలా వున్నవాడు- చేతులుచాచి ఎలుగెత్తి ఏడుస్తున్నాడు. అంతలోనే ఏదో కాంతి పుంజం, కళ్ళు మిరిమిట్లు గొలుపుతూ ప్రచండమైన వేగంతో వచ్చి అతడి చేతులమధ్య— అతడిలో ఐక్యం అయిపోయింది.

తల విదిలించి, పక్కమీద నుంచిలేచి, తలుపు చప్పుడవకుండా బయటకొచ్చాడు. ఒక్కసారి చల్లగాలి చుట్టుముట్టింది. మనసుని ఆవరించుకుని వున్న అసంతృప్తి అంతా పోయినట్లు అనిపించింది.

విశాలమైన కారిడార్ భావకుడి మనసులో స్తబ్దతలా వుంది. మళ్ళీ మెరిసింది. రోడ్డుకి అటువైపున కొంచెం విసిరేసినట్లూ దూరంగా ఓ తాటాకు పాక— పర్ణశాలలా ఉంది. 'అంత చలిలో అందులో వారెలా పడుకుంటారో' అనుకున్నాడు. లోపలికొచ్చాడు. చలిగాలిని "కండిషన్" చేసి చల్లగాలిని లోపలికి పంపిస్తూంది ఎయిర్ కండిషనర్.

మెట్లుదిగి క్రిందికి వచ్చాడు.

రవి నిద్రపోతున్నాడు.

కౌసల్య గదిలో లైటు వెలుగుతోంది.

లైటుముందు కూర్చొని చదువుకుంటూ, అలాగే ముందుకువాలి టేబిల్‌మీద తలపెట్టి నిద్రపోతోంది. ఆమె పొడవాటి జడ నేలమీద జీరాడుతోంది. సరిగా పడుకోమని చెబ్దామనుకొని మళ్ళీ లేపితే "తెల్లవార్లూ

చదువుకుంటూ కూర్చుంటుందేమోనని, ఉద్దేశ్యం మార్చుకున్నాడు' నిజానికి రవికూడా మరుసటిరోజునుంచే పరీక్షలు. అయినా కౌసల్య పట్టుదల అతనిలో లేదు. అది అంత విచారించతగ్గ విషయంకాదు. ఏమీచదవకపోయినా అతను సెకండు క్లాసులో పాసవుతూనే వచ్చాడు—

చైతన్య మెట్లుఎక్కి పైకి వచ్చాడు.

నిద్రపట్టే సూచన్లు కనబడలేదు.

కిటికీదగ్గర నిలబడ్డాడు. వర్షంలో తడిసినరోడ్డు లైట్ల వెలుతుర్లో కడిగిన అద్దంలా మెరుస్తుంది.

అంతా నిర్మానుష్యంగా ఉంది. పల్లపువాలులోంచి నీరు ధారగా ప్రవహిస్తుంది.

అకస్మాత్తుగా అతడి కర్ణపుటాలకి ఎవరో దూరంగా దెబ్బలాడుకొంటున్న ధ్వని లీలగా వినిపించింది. క్షణంపాటు తను వింటున్నది నిజమేనా అని నిశ్చయం చేసుకోవడానికి ఆగాడు. అది భ్రమ కాదని అనిపించగానే కారిడార్‌లోకి వచ్చాడు.

బయట గేటు దగ్గర సన్నగాపడే తుంపర్లో— గేటు దగ్గర గూర్ఖాతో ఎవరో ఘర్షణపడుతున్నారు. ఆకారంకనబడుతోందిగాని పోలిక స్పష్టంగా తెలియటంలేదు అంత వర్షం కురుస్తున్న రాత్రి, దాదాపు మూడు గంటలవేళ— తన యింటిముందు నిలబడి గూర్ఖాతో దెబ్బలాడుతున్న ఆ వ్యక్తి ఎవరో అర్థంకాక చప్పున క్రిందికి దిగాడు.

ఆ అర్థరాత్రి తన యింటిలోకి ప్రవేశించబోతున్న ఆ అగంతకుడు తన జీవిత గతినే మార్చబోతున్నాడని తెలియని చైతన్య వడివడిగా గేటుదగ్గరకు నడిచాడు

o o o

పోనీ నన్ను వెళ్ళనివ్వకు. నువ్వువెళ్ళి చెప్పు—" హీనమైన కంఠంతో ప్రాధేయపడుతున్నాడు అతను.

"వా ఉద్యోగం వుండాలా? పోవాలా? పో పో అర్ధరాత్రి గొడవ చెయ్యకు రేప్రొద్దున్న రా పో" గూర్ఖావాడి మాటల్లో విసుగు కనపడ్తోంది.

చైతన్య గేటు దగ్గరకి వెళ్ళాడు. లైటు మసక వెల్తుర్లో ఆ వ్యక్తి ఆకారం అస్పష్టంగా తెలుస్తోంది. పంచె వంటికి అతుక్కుపోయి వుంది. చొక్కా అక్కడక్కడా పీలికలై వేలాడుతోంది. నీరు తల మీదనుంచి చుక్కలు చుక్కలుగా క్రిందికి జారుతోంది.

అస్థిపంజరానికి బట్టలు తొడిగినట్టు వున్నాడు. చలికి వణుకుతూ, ముందుకు తూలిపోకుండా వుండటానికి ప్రయత్నిస్తున్నాడు.

గూర్ఖా అతడి మెడమీద చెయ్యివేసి గెంటటానికి సిద్ధపడుతూ "మర్యాదగా వెళ్ళిపోతావా—గెంటాలా?" అన్నాడు.

"శంకర్‌లాల్ ....

యజమాని కంఠం విని, గూర్ఖా బిర్రబిగుసుకు పోయేడు. "సాబ్ ....యితను—అంటూ ఏదో చెప్పబోయేలోపులో ఆవ్యక్తి గాలిలా దగ్గరకు వచ్చేడు.

"కృష్ణా—నేన్రా శంకరం మాస్టార్ని"

తూలి పడబోతున్న అతన్ని పట్టుకోబోయి—షాక్ తగిలినట్టు చెయ్యి వెనక్కి తీసుకొన్నాడు చైతన్య. అంత చలిలోనూ అతడి వళ్ళు వెనంలా కాలిపోతోంది.

"బాబూ—ఒరేయ్ నాయనా—" ఆపై మాటలు పెగల్లేదు.

అతడి శరీరం ఎన్నో రోజుల్నించీ తిండి లేనట్టు శుష్కించి పోయింది. చెంపల మీద మాంసం కరిగి, చర్మం వ్రేలాడుతోంది. కళ్ళు జీవం కోల్పోయి, గాజు గోళాల్లా మెరుస్తున్నాయి. ఎండి, చిట్లిన పెదవుల మీద వర్షపు నీటి తడి మెరుస్తోంది. బాగానెరసి, తెల్ల బడ్డ జుట్టు నుదుటి మీదకు అసహ్యంగా జారివుంది.

"కృష్ణా నన్ను గుర్తు పట్టేవుట్రా—" ఆశా నిరాశల మధ్య కొట్టుకొంటోంది ఆస్వరం.

"మాస్టారూ-"

"కృష్ణా"

ఆయన్ని పొదివి పట్టుకొని, ఇంటివైపు నడిపిస్తూ "మిమ్మల్ని గుర్తుపట్టలేకపోతే నన్ను నేనే మర్చిపోయినట్టు మాస్టారూ"

"చాలు బాబూ చాలు ఇక విశ్రాంతగా...." గొంతులో ఏదో అడ్డుపడ్డట్టు ఆపై మాటలు రాలేదు.

అలాగే పట్టుకొని హాల్లోకి వచ్చేరు.

ఈ అలికిడికి కౌసల్య నిద్రలేచినట్టుంది గది తలుపులు తీసుకొని బైట కొచ్చింది.

తమవేపే కళ్ళప్పగించి చూస్తున్న చెల్లెలితో "ఆ తలుపు వెయ్యి, చలిగాలి వీస్తోంది" అన్నాడు. కలలోంచి తేరుకొన్నట్టు ఆమె చప్పున అటు వెళ్ళింది.

అప్పటివరకూ ప్రాణాల్ని బిగపెట్టి ప్రకృతి భీభత్సాన్ని ఎదుర్కొన్న శరీరం, ఇక శక్తి లేనట్టుగా సోఫాలో నిస్త్రాణగా పడిపోయింది. "-కౌసల్యా, కొంచెం హార్లిక్స్-"

ఈ లోపులో కాంతిమతి క్రిందికి వచ్చింది. రవి గదిలో లైటు వెలిగింది.

క్షణంలో వాతావరణం మారిపోయింది. అవుట్ హౌస్‌లోంచి నౌఖర్లు పరుగెత్తుకొచ్చేరు. అంతా హడావుడి—

ఇదేమీ పట్టనట్టు శంకరం మాస్టారి శరీరం అచేతనావస్థలోనే వుంది.

కౌసల్య హార్లిక్స్ తీసుకొచ్చింది.

తలవి వళ్ళోకి తీసుకొనినెమ్మదిగా పట్టించ సాగేడు చైతన్య. అందరూ నిలబడి దూరంనుంచిచూడసాగేరు. ఆ వచ్చిన దెవర్తో ఎవరికి

తెలీదు. కానీ వచ్చిన వ్యక్తిపట్ల చైతన్య చూపిస్తూన్న జాగ్రత్తలు చూస్తూంటే అతనికి కావల్సిన వాడని తెల్సిపోతోంది.

అతడు లేచి ఫోన్ దగ్గరకి నడిచేడు.

"....హల్లో"

"హల్లో"

"డాక్టర్ నాయుడూ"

"స్పీకింగ్." అవతలి కంఠంలో విసుగూ, చిరాకూ ధ్వనించేయి. "ఎవరూ-?"

"చైతన్య—కృష్ణ చైతన్య"

డాక్టర్ నిద్రమత్తు చప్పున ఎగిరిపోయింది. "హలో చైతన్యా"

"ఒకసారి మా యింటికి రాగలరా?"

"షూర్, షూర్" ఆగి, "ఎవరికన్నా సీరియస్సా" అడిగేడు.

"చెబుతాను. ప్లీజ్ కమ్ సూన్"

"వెంటనే వస్తున్నా"

ఫోన్ పెట్టేసి వెనక్కి తిరిగేడు. కౌసల్య తలగడ సరిగ్గా సర్దు తోంది.

అతడెవరో తెలీకపోయినా, కేవలం తనకు కావల్సిన వాడుగా భావించి, ఆమె చేస్తున్న సపర్యని చూడగానే చైతన్య మనసు చెల్లెలి పట్ల అప్యాయతతో నిండిపోయింది.

ఆయిదు నిముషాలల్లో డాక్టర్ కారు ఆ యింటిముందు ఆగింది. నాయుడు లోపలికి వచ్చేడు.

రోగిని పరీక్షిస్తున్నంతసేపూ చైతన్య పక్కనే వున్నాడు.

"ఎనీథింగ్ సీరియస్ డాక్టర్?"

"ఉహుఁ-నథింగ్-నథింగ్ టు వరీ ఎబౌట్" ఇంజక్షన్ యిస్తూ అన్నాడు. రవి రూమ్‌లో పక్క ఏర్పాటు చెయ్యబడింది.

నౌఖర్లిద్దర్నీ అక్కడే పడుకోమన్నాడు చైతన్య.

"ఏమాత్రం కంగారు పెట్టినా మళ్ళీ మీకు ట్రబుల్ యిస్తాను డాక్టర్–" కారు ఏక్కుతూ అన్నాడు చైతన్య.

"అబ్బే– ట్రబులేముంది తప్పకుండా." అన్నాడు డాక్టర్. అతడికి ఆశ్చర్యంగా వుంది. దేనికి చలించని, ఎక్కువగా మాట్లాడని చైతన్య ఇంత ఆతృత చూపించటం.
కారు కదిలింది

చైతన్య లోపలికి వచ్చేసరికి ఆయన రవి గదిలోకి మార్చబడ్డాడు. గది వెచ్చగా వుంది. రోగి ముఖంలో మునుపటి అలసటపోయి నిర్మలంగా వుంది.

నౌఖర్లవైపు తిరిగి, "జాగ్రత్తగా చూసుకోండి" అన్నాడు. ఇద్దరూ తలూపేరు.

"నేనుంటానుగా అన్నయ్యా" అన్నాడు రవి. తలూపి బైటకొచ్చేడు.

"అయ్యా"

చైతన్య వెనక్కి తిరిగేడు. నౌఖరు కవరొకటి అందిస్తూ "బట్టలు మారుస్తూ వుంటే దొరికిందయ్యా" అన్నాడు.

చిన్న ప్లాస్టిక్ కవరు. రెండువైపులా సీలు చేసి వుంది.

అది తీసుకొని పైకి నడిచేడు.

కాంతిమతి బాబుని జోకొడ్తూవుంది.

పక్కమీద పడుకొని, అలిసిపోయినట్టు నుదుటిమీద చెయ్యి వేసుకొని విశ్రాంతిగా కళ్ళు మూసుకున్నాడు.

ఆమె బాబుని జోకొడ్తూనే, "అయనెవరు?" అంది.

"శంకరం మాస్టారు" అన్నాడు. "పదమూడేళ్ళ వయసులో అమ్మా నాన్నల గారాబం, డబ్బు అన్నీ కలసి నన్ను పాడుచేస్తున్నప్పుడు ఆయన రక్షించేరు. నాకెవరిన్నా ఎప్పుడన్నా సాయంచేశారూ అంటే అది ఆయనే-"

అంతకన్నా ఎక్కువ మాట్లాడటం అతడికి అలవాటులేదు. కాంతిమతి పడుకొంది.

చైతన్య కళ్ళు మూసుకున్నాడు.

అస్పష్టమైన గతంతాలూకు ఆలోచనల్తో అతడికి నిద్రపట్టింది. తెల తెలవారుతూండగా, టెలిఫోన్ మ్రోగటంతో అతడికి మెలకువ వచ్చింది

బొంబాయినుంచి కాల్. అయిదు నిముషాలు మాట్లాడి పెట్టేసేడు. మరి నిద్రపట్టలేదు.

ఆరయింది బ్లాంకెట్ తొలిగిస్తూ పక్కమీద నుంచి లేచి, స్లిప్పర్స్ వేసుకొని, వాష్‌బేసిన్ దగ్గరకు వెళ్ళి మొహం కడుక్కున్నాడు.

చికటి తెరలు ఇంకా తొలగిపోలేదు. తూర్పు కొద్ది కొద్దిగా ఎర్రబారుతోంది. రాత్రి తాలూకు భీభత్సంపోయి వాతావరణం ప్రశాంతంగా ఉంది. గాలికి రాలిన ఆకులు కాంపౌండు నిండా పడిఉన్నాయి.

మెట్లు దిగి క్రిందికి వస్తుంటే మళ్ళీ ఫోను.

"హల్లో—"

"నేనూ— డాక్టర్ నాయుడు—"

"గుడ్‌మార్నింగ్ డాక్టర్"

"దట్స్ గుడ్. నేను ఎనిమిదింటికి వస్తాను."

"ఎవరూ? చైతన్యా?"

"ఆ__ నేనే__"

"ఎనిథింగ్ సీరియస్?" డాక్టర్ కంఠంలో ధ్వనించిన ఆత్రుతకి చైతన్యకి నవ్వొచ్చింది. డబ్బు కర్తవ్యాన్ని ఎ గాగుర్తుకు తెస్తుంది.

"నో__ నా పెటాల్"

యజమాని కంఠం విని నౌకరు పరుగెత్తుకు వచ్చాడు. అతణ్ని అడిగి, మౌత్ పీస్ మీదనుంచి చెయ్యితీసి "మధ్యరాత్రి మెలకువవచ్చిం దట. మీరిచ్చిన క్యాప్సూల్ వేసేరట. టెంపరేచర్ కూడా లేదట__" అన్నాడు.

"థాంక్యూ డాక్టర్__"

ఫోను పెట్టేశాడు.

వెనక్కి తిరిగేసరికి, కౌసల్య లోపల్నుంచి కప్పుతో కాఫీ తెస్తు ఉంది. తలంటుకోవటంవల్ల జుట్టు గాలికిఎగురుతోంది తెల్లచీరలో మంచు కడిగిన మల్లెలా స్వచ్ఛంగా ఉంది. నుదుటిమీద దోసగింజంత బొట్టు__ పెద్ద పెద్ద కళ్ళకి అందంగా అమిరింది. అమాయకత్వమూ, ఆహ్లాదమూ ఆమె మొహంలో ప్రతిబింబిస్తూ వుంటాయి ఎప్పుడూ. ఆ పవిత్రతకి ముగ్ధుడై "నా కొకటే ఆశ్చర్యం" అన్నాడు.

ఆమె నవ్వి "ఏమిటి" అంది కాఫీ అందిస్తూ.

నేను ఒక్కోసారి చాలా తొందరగా లేచా ననుకుంటాను. అప్పటి కేనువ్వు తయారై పోయి వుంటావు.... ఇంతకీ ఎప్పుడు లేస్తావు నువ్వు?"

కౌసల్య ఈ అభినందనకి కొద్దిగా సిగ్గుపడింది.

ఖాళీ కప్పు కౌసల్య చేతికిచ్చి, రవిరూంలోకి వచ్చాడు. కౌసల్య అతణ్ని అనుసరించింది.

రవి పక్కమీద అ స్తవ్య స్తంగా పడుకొని నిద్రపోతున్నాడు. ఇద్దరు నౌకర్లూ లేచి ఎప్పుడో వెళ్ళిపోయినట్లున్నారు. పక్కలుకూడాలేవు. శంకరం మాష్టారు ఇంకా నిద్రలేవలేదు.

మంచం పక్క స్టూల్‌మీద క్రితం రాత్రి డాక్టరిచ్చిన మాత్ర లున్నాయి. సగంతాగి వదిలేసిన నీళ్ళ గ్లాసుంది. కిటికీఅద్దాలలోంచి కొద్ది కొద్దిగా వెలుతురు రావటం ప్రారంభమైంది. ఫేన్ గాలికి దుప్పటిఅంచు నెమ్మదిగా కదులుతోంది.

వళ్ళు వేడిగా ఉందో లేదో చూడటంకోసం నుదుటిమీద చెయ్యి వేసిన చైతన్య— షాక్ తగిలినట్లు చేతిని వెనక్కి తీసుకున్నాడు.

ఆయన శరీరం చల్లగా ఉంది.

ఐస్‌కన్నా చల్లగా!

# 2

"ఈ రోజు మనకి తిండిలేదు" అంది కిరణ్మయి

శారద మాట్లాడలేదు.

"రేపు కూడా వుండదు. అంతేకాదు. ఇంకెప్పటికీ వుండదు"

శారద భయంగా అక్కవైపు చూసింది. మరునటి రోజు తిండి వుండదన్న భయంతోకాదు. రోజు రోజుకీ పర్వర్టెడ్‌గా మారుతున్న ఆమె మానసిక స్థితి తల్చుకొని.

"మాట్లాడ వేమే ?"

"ఏం మాట్లాడను ?"

శారదకీసారి నవ్వొచ్చింది. అది చూసిందంటే మళ్ళీ గొడవ అవుతుందని పెదవుల చాటునే దాచుకొంది.

"నువ్వా కామాక్షమ్మ యింటికి ఇక వెళ్ళకు –"

'ఏం అన్నట్టు చూసింది శారద.

"ప్రొద్దున నేను వెళ్ళేను. ఆవిడలేదు. సుపుత్రుడున్నాడు కొంచెం బియ్యం వుంటే యిమ్మని అడిగేను."

"అతణ్ణి అడిగేవా ?"

"ఏం అడక్కూడదా ? కావాల్సింది బియ్యమైనప్పుడు అడగటానికెవరైతేనేం ?"

శారదకి యీ తర్కం నచ్చలేదు. అయినా ఆమె మాట్లాడలేదు. కిరణ్మయే అంది—

"ఒంటరిగావున్న ఆడది సాయం కోరితే ఎక్కడలేని ధైర్యం వస్తుంది కాబోలు వెకిలిగా నవ్వి, 'ఇలా బియ్యం అడిగి తీసుకోవల్సిన ఖర్మెందుకు. ఒకసారి ఊఁ అంటే ఆజ్ఞాపించే హక్కు వస్తుందిగా'— అన్నాడు రోగ్. నేనేమన్నానో తెలుసా ?"

శారద అక్కవైపే చూస్తోంది.

"ఇలా 'ఊఁ' అనిపించకోవల్సిన ఖర్మ నీకెందుకు ? ఒకసారి మూడు ముళ్ళు వేస్తే నీకే ఆజ్ఞాపించే హక్కు వస్తుందిగా—అన్నాను. అట్లపెనం వుంటుంది చూడు – అలా మాడిపోయిందిలే మొహం. ఊఁ అనాల ఊఁ"

శారదకి ఏడుపొస్తోంది

"అసలిదంతాకాదు ట్విస్టెక్కడుందో తెలుసా ? ఏప్పుడొచ్చిందో తెలీదుకానీ. కామాక్షమ్మవచ్చి అంతా విన్నట్లుంది. కొడుకుని నాలుగు దులపాల్సింది పోయి నన్ను నానా మాటలంది. నాలాటివాళ్ళమూలానే స్త్రీ గౌరవం పోతోందట. పచ్చగావున్న కుటుంబాలు ఇందుకే పాడవు

తున్నాయిట....'' అని వర్ణించటానికి సిద్ధంగా వున్న చెల్లెలి కళ్ళవైపు చూసింది.

'' నువ్వెందుకే ఏడుస్తావు ! మనసులో అంత కుళ్ళున్నందుకూ వాళ్ళు — వాళ్ళేడ్చి చావాలి. మనంకాదు కడుపు ఖాళీగావున్నా, దేవుడు కనీసం ఈ వరమైనా యిచ్చినందుకు సంతోషించాలి మనం.''

''విన్నా చూస్తుందే భయంగా వుందే అక్కా—''

''భయమా''? అంది కిరణ్మయి. ''ఎర్రగా కాలిన యినుముమీద దెబ్బలు పడ్డట్టు మన బీదతనం మీద వీధి దెబ్బకొడ్తోంది. రాటు తేలు తున్నందుకు ఆనందించు ఇలా బెంబేలుపడిపోతే ముందు ముందు ఇంకా దెబ్బలు ఓదార్చుకోవటం కష్టం.''

''ఇంకానా ?''

క్షణంపాటు చెల్లెలన్నమాట అర్థంకాక పోవటంవల్ల కిరణ్మయి వాక్ప్రవాహం ఆగింది ఆ తర్వాత ఆమెబిగ్గరగా నవ్వుతూ ''ఇంకానా ఏమిటే ? అసలేమయిందని ఇపుటికి ? రేపో మాపో యిల్లుగలాయన వచ్చి మనని వెళ్ళగొడతాడు .... నడివీధిలో నిలబడ్డ మనని ఏ కరుణా మయుడో ఓ బ్రోతల్ హౌస్‌లో చేర్పిస్తాడు — కాలం పాములా కదు ల్తుంది వంటినిండా పొడలొస్తాయి — శరీరాన్ని రోగం రాహువులా తినేస్తుంది — మచ్చలు నల్లబడతాయి. వళ్ళు పచ్చబడ్తుంది — మన భవిష్యత్తు టెక్నికలర్‌లో కనబడ్తోందే శారదా — ఇంటర్వెల్ ముందు న్నాం మనం.''

o o o

కపాలం బ్రద్దలయ్యేవరకూ కాలుతున్న శవాన్నే చూస్తూ నిల బడ్డాడు చైతన్య మనసంతా వేసిలేటింగ్‌గా వుంది.

ఏదో ఎగోఛి !.

తల్లి కడుపులో చల్లగా విశ్రాంతి తీసుకొన్న జీవి మళ్ళీ స్మశానం చితిమీద వెచ్చగా ప్రశాంతతని పొందింది.

తలమీద నుంచి తీతువుపిట్ట అరుస్తూ వెళ్ళిపోయింది.

అస్పష్టమైన భావాల సంఘర్షణ.

ఆ అచేతనావస్థలోనే ఇంటికొచ్చేడు.

స్నానం చేసేసరికి పదకొండయింది.

స్మశాన వైరాగ్యం పోవటానికి ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో రెండు గంటలు చాలు.

పూర్తిగా రిలాక్సు అయ్యేసరికి మధ్యాహ్నం రెండయింది.

కాంతి టీ తీసుకొచ్చి చెప్పింది – "మేనేజర్ గారొచ్చారు." అని.

చైతన్య ఆఫీస్ రూమ్‌లోకి వచ్చేడు. "ఎంతకి సెటిల్ అయింది - ?"

"అరవై లక్షలు. రెండు తఫాలుగా పంపాలి. ఒకటి పదో తారీఖు, రెండోది రెండు నెలల తర్వాత"

చైతన్య గాఢంగా నిశ్వసించేడు.

పదో తారీఖు !

అంటే చాలా కష్టపడాలి అన్నివైపుల్నించీ డబ్బు సమకూర్చుకోవాలి, కోస్తా ప్రాంతపు ఫిషింగ్ ట్రాలర్ వాళ్ళందర్నీ కూడగట్టుకోవాలి. ఒక్క మాటలో చెప్పాలంటే పదో తారీఖువరకూ ఊపిరి పీల్చుకోవటానికి కూడా వీల్లేనంతగా కష్టపడాలి.

కానీ కష్టపడటం అతనికి కష్టంకాదు.

అతడి మనసంతా ఉద్వేగంతోనూ ఆనందంతోనూ నిండిపోయింది.

కాంట్రాక్టులో లాభం చాలా తక్కువే వుండొచ్చు. కానీ ప్రిస్టేజీకి సంబంధించిన కాంట్రాక్టు అది. ఇది పూర్తవ్వగానే దేశంలో వున్న చాలో కొద్దిమంది పెద్ద సీ ఫుడ్ ఎగుమతిదార్ల జాబితాలో చేరిపోవచ్చు.

"నే వెళ్ళొస్తాను సర్" అన్నాడు మేనేజరు.

చైతన్య ఆ మాటలతో యీ లోకంలోకి వస్తూ, "వెళ్ళు" అని, అంతలోనే జ్ఞాపకం వచ్చినట్టు "మన గుమస్తాగా రేవీ( చెప్పలేదా ?" అన్నాడు.

"ఏ విషయం సర్ ?"

"నిన్న రాత్రి మనింటికి—"

"ఆ(—ఆ(— చెప్పేరు సర్" అన్నాడుమేనేజర్. "కనుక్కోవటం కొంచెం కష్టం కావొచ్చు. పేపర్లో ప్రకటన వేయిద్దాం సర్"

"అలా అయితే కొంచెం ఆలస్యం కావచ్చు. చాలాకాలం క్రితం మావూరి స్కూల్లో టీచర్‌గా పనిచేసేవారు. దాదాపు ఇరవై ఏళ్ళ క్రిందటిమాట. రికార్డులు తిరిగేస్తే ఏమన్నా దొరుకుతుందేమో - అక్కణ్ణుంచి వాకబు చేయటం ప్రారంభించు. పేపర్లో ప్రకటనకూడా వేయిద్దామనుకో. కానీ దానికోసం ఇది ఆపక్కర్లేదు. రేపే నువ్వుబయల్దేరు—"

—తన యజమాని ఏ నిర్ణయం తీసుకొన్నా దాని గురించి అన్ని కోణాల్లొంచీ ఆలోచిస్తాడని మేనేజర్‌కి తెలుసు నిజానికి పేపర్లో వేయించటం ఒక్కటే సరిఅయిన పద్ధతి. పదేళ్ళక్రితం రిటైరయిన మనిషి యిప్పుడెక్కడ సెటిల్ అయ్యాడో కనుక్కోవటం జరిగే పనికాదు. అయినా అలా చెయ్యమంటున్నాడంటే ఏ ఒక్క ఛాన్సూ వదులుకోవడానికి ఇష్టపడటం లేదన్నమాట—

— అర్ధరాత్రి ఇంటికొచ్చి అకస్మాత్తుగా చచ్చిపోయిన ఓ అనామకుడికోసం ఇంత ఖర్చెందుకో ? ఎమ్. బి. ఏ. చదివిన అతడిమేధస్సు అర్థం చేసుకోలేకపోయింది. అయినా తలూపి, "రేపు సాయంత్రమే వెళ్తాను సర్." అన్నాడు.

"సాయంత్రం కాదు. ప్రొద్దునే వెళ్ళు. ఇంకేమన్నా పన్లున్నాయా ?"

"రొయ్యల లోకల్ సప్లయికి ప్లాస్టిక్ కవర్స్ గురించి ఎవరో వచ్చేరు-"

మిగతా మాటలు వినలేదు చైతన్య. కవరనగానే, క్రితం రాత్రి నౌకరు తన చేతికి మాస్టారి బటలలోంచి తీసియిచ్చిన -వర్ జ్ఞాపకం వచ్చింది. చటుక్కున లేచి తన గదిలోకి పరుగెత్తాడు.

ం ం ం

గదంతా కోలాహలంగా వుంది.

నాలుగు ఖాళీబాటిల్స్ నేలమీద దొర్లుతున్నాయి. బల్లమీద సగం మిగిలిన బాటిలుంది. పక్కనే కొంచెం నీతిమంతుడి తాలూకు బీరు సీసా వుంది-

కాగితంలో వుండాల్సిన కారబ్బూంది గచ్చుమీద దొర్లుతోంది. దట్టంగా పేరుకొన్న పొగ గదిలోంచి బైటికి పోవటానికి ప్రయత్నిస్తోంది,

మూత పడుతోన్న కనురెప్పల్ని బలవంతంగా తెరచి "ఏమిటీ" అన్నాడు సుబ్బయ్య.

"నీ గురించి కాదులే" అన్నాడు. సురేష్. అతడు వెనుక నుంచి ఆడదాన్లాగనూ. ముందునుంచి మధ్యస్థంగానూ వున్నాడు. "పందెంకడితే ప్రసాదు అర్ధరాత్రి స్మశానం వరకూ వెళ్ళి రాగలడట—"

సుబ్బయ్య బలవంతాన కళ్ళుతెరిచి – "ఇంకొంచెం మందుకొడితే సముద్రంలోకి కూడా వెళ్ళిరావొచ్చు-" అన్నాడు.

అదో పెద్ద జోక్లా అందరూ నవ్వేరు—సుబ్బయ్య హోస్ట్ కాబట్టి ప్రసాదు మాత్రం— "సముద్రం అక్కర్లేదు. ఏటి గట్టువరకూ వెళ్ళు— పదిరూపాయలు పందెం" అన్నాడు వెక్కిరిస్తున్నట్టు.

సుబ్బయ్య ధైర్యం సంగతి అక్కడ అందరికీ తెల్సు. అయినా అతణ్ని సపోర్టు చేస్తున్నట్లు "మరీ అంత మాటనకు గురూ–" అన్నారెవరో.

"అయినా యిద్దరాడపిల్లల దగ్గర మూడు నెలల నుంచి అద్దె వసూలు చేయలేని వాడు ధైర్యం గురించి మాట్లాడటం అనవసరం."

"వసూలు చెయ్యలేకపోవటానికి కారణం అదికాదులే"

"ఇంకొకటి వుంటుందని నేననుకోను...." అని "....మన సుబ్బయ్యదగ్గర" నొక్కి. పలికేవారెరో. గది నవ్వులతో ప్రతిధ్వనించింది.

చింతపండులా వల్లగా వున్న సుబ్బయ్య మొహం మరింత వల్లబడింది. ఆవేశంతో గాలిపీల్చటం వల్ల పొట్ట బెలూన్‌లా ఉబ్బింది.

"ఇదుగో యిప్పుడే వెళుతున్నాను" అని ఎవరికోసం ఆగకుండా గదిలోంచి విసురుగా బైటకొచ్చాడు.

గదిలోని మిత్ర బృందం తక్షణం ఆశ్చర్యపోయినా అంతలోనే ఉత్సాహం వుంజుకొంది. 'నా' అనేవాడు లేని ఇద్దరమ్మాయిల్ని నడివీధిలోకి గెంటటాన్ని ఆరాత్రివేళ చూడటంకోసం అందరూ గదిలోంచి బిలబిలా బయటకొచ్చేరు.

వీధంతా నిర్మానుష్యంగా వుంది.

సుబ్బయ్య వచ్చి మెట్లమీద నిలబడి తలుపులు దబదబా బాదే సమయానికి శారద పడుకోటానికి చాపలు పరుస్తోంది.

తలుపు చప్పుడు విని, ఆమె వచ్చి తలుపు తీసింది. ఎదురుగా సుబ్బయ్య. ఆమె వెనక్కి అడుగు వేసింది.

అతడికళ్ళు ఎర్రగా వున్నాయి. రెప్పలు మూత పడుతున్నాయి. ద్వారాన్ని ఆనుకొని నిలబడి, "....డబ్బు" అన్నాడు.

శారదకేమీ అర్థం కాలేదు. "ఏం డబ్బు?" అంది.

ఆమె మాటల్ని అతనింకో విధంలాగా అర్థం చేసుకొన్నాడు. దానికి తోడు స్నేహితులు అంతక్రితం మాట్లాడిన మాటలు లోపల తొలుస్తున్నాయి. దాంతో అతను పూర్తిగా రెచ్చిపోయి "ఏం? అద్దె సంగతే మర్చిపోయి ఇంట్లో కులుకుదామను కొంటున్నారా—?" అన్నాడు గొంతు పెద్దదిచేసి

ఆమెకి విషయం ఏమిటో లీలగా అర్థమైంది కానీ, ఏంచెయ్యాలో తోచలేదు. ఇమెది సున్నితమైన మన స్తత్వం. ఇటువంటి పరిస్థితిని ఎలా యెదుర్కొనాలో తెలీదు. తమస్థితితలుచు కొంటే కళ్ళనీరు తిరిగింది.

"ఏం మాట్లాడవేం" గద్దించాడు.

ఆమె ఏదో చెబుదామనుకొందికానీ గొంతులో ఏదో అడ్డుపడినట్లు మాటే బయటికి రాలేదు. ఏడుపు చెలియలికట్ట దాటటానికి సిద్ధంగా వున్నది.

"అవలిద్దామన్న వుద్దేశం వుందా" అన్న అతడి ప్రశ్నకి మాత్రం తల అస్పష్టంగా అడించింది. అతడు దాన్ని పట్టించుకోకుండా "లేక పోతే ఇంకోలా తీర్చుకొందామన్న వుద్దేశ్యం ఏమయినా వుంధా? అన్నాడు.

ఆమె తన స్వభావ సిద్ధమైన అమాయకత్వంతో "ఎలా?" అంది?

ఆ ప్రశ్నకి ఆతడి పెదవులమీద వంకర నవ్వు కదిలించి అడుగు ముందుకేసి "చెప్పనా" అన్నాడు వెకిలిగా ఆమెవైపు చూస్తూ ఆమెకి అతడివాలకం అర్థమయింది వదనం ప్లానమైంది. రెండడుగులు వెనక్కి వేసింది.

"ఎవరికి తెలియదు. ఊ" అన్నాడు.

"ఏమిటి ఎవరికి తెలియనిది?" అన్న కంఠం పక్క గుమ్మం దగ్గర్నుంచి వినిపించింది. ఆ మాటలు అన్నది కిరణ్మయి. ఆమె లోపల పని చేసుకొంటూ మాటలు వినిపించి బైట కొచ్చింది.

చీరెకొంగు నడుములో దోపి ఆమె నిల్చున్న తీరు చూసిసుబ్బయ్య కొద్దిగా బెదిరేడు. అంతలోనే అతని మిత్రబృందం అక్కడ చేరుకొంది. కిటికీలోంచి బయటవాళ్ళని చూడగానే అతడిలో ధైర్యం మళ్ళీ చోటు చేసుకొంది.

"ఇస్తే అద్దె యివ్వండి లేకపోతే ఇల్లు ఖాళీచేసిపొండి" అన్నాడు మాటమారుస్తూ.

"అద్దె యివ్వం అని ఎవరన్నారు?"

"ఎవరూ అనలేదు. కానీ యివ్వరు. మూణ్ణెల్ల అద్దె యివ్వాలి. ఇదేం సత్రం అనుకుకొన్నారా?" అతడి బొంగురు గొంతు గదిలో ప్రతి ధ్వనించింది.

"ఇంకో రెండ్రోజులలో—" అని ఏదో చెప్పబోతున్న ఆమెను మధ్యలోనే ఆపుచేస్తూ— "కుదర్దు" అన్నాడు అతను "ఈ రాత్రికి విష యం తేలిపోవల్సిందే. అద్దె యివ్వటమో ఖాళీచెయ్యటమో ...."

కిరణ్మయి కొంచెం విసుగుతో— "రాత్రికి రాత్రి ఖాళీచెయ్య మంటే యెలా?" అంది నిజానికి ఆమెకీ అతడి వాలకం భయంగానే వుంది. కానీ స్వతాహాగా ధైర్యం కలది కావటం వల్ల ఆమాత్రమైనా మాట్లాడ గల్గింది.

శారద బిత్తరపోయి నిలబడి వుంది.

"అదేం నాకు తెలీదు ఖాళీచేస్తారా — గెంట మంటారా ? అన్నాడు.

బయటవున్న గుంపులోంచి ఎవరో "గెంటు గురూ" అన్నారు.

అక్కా చెల్లెలిద్దరూ చప్పున కిటికీలోంచి బయటకి చూసేరు. బయట దృశ్యం చూసేసరికి ఇద్దరి ప్రాణాలు జారిపోయేయి.

అరుగుమీద వాసావికి ఆనుకొని యిద్దరు సిగరెట్లు కాలుస్తున్నారు. ముగ్గురు లోపలికి తొంగి చూస్తున్నారు. ఇంకో యిద్దరు అప్పుడే తలుపు దగ్గరకి చేరేరు.

కిరణ్మయి మోహంలో మారుతున్న రంగుల్ని చూడగానే సుబ్బయ్యకి ధైర్యం వచ్చింది.

'మీరు మాటలతో చెబితే వినరు—" అంటూ వడివడిగా ముందుకెళ్ళి చాప, బట్టలు మూటగా చుట్టి బయటకు విసిరాడు. బయట దాన్నెవరో బంతిలా పట్టుకున్నారు. కడుపులో ద్రవం మెదడులో ఆలోచనని చంపుతోంది.

అతడి చర్యకి ఇద్దరూ స్థాణువులయ్యేరు. ఇంత విపరీతాన్ని వాళ్ళు వూహించలేదు. అసలు ఈ పరిణామాన్ని ఎలా ఎదుర్కోవాలో కూడా వాళ్ళకి తెలియటంలేదు. వాళ్ళ విస్సహాయ స్థితిని చూస్తున్నకొద్దీ అతడిలో పైశాచిక ప్రవృత్తి మరింత ఉధృతమవుతోంది.

కిరణ్మయి అంతలోనే తేరుకొని "ఆగు ఏమిటిది?" అంది.

"పొండి. పోయి బయట ఎక్కడయినా పడుకోండి. ఇల్లుమాత్రం ఖాళీ చేయాల్సిందే " అన్నాడు కుర్చీని విసురుగా తోస్తూ. అది పెద్దచప్పుడుతో క్రింద పడింది.

"ఏమిటీ దౌర్జన్యం? ఇంత రాత్రప్పుడు ఎక్కడికి పోవాలి?" కిరణ్మయి అంటుంటే దొంతులో ఏడుపుజీర కదిలింది.

"మా యింటికి రాకూడదూ?" బయట్నుంచి ఎవరో అన్నారు. గొల్లున నవ్వులు వినిపించినయ్.

అప్పటివరకూ ఎలాగో బిగబట్టి ఆపుకున్న శారద వెక్కి వెక్కి ఏడవసాగింది.

ఆ విస్సహాయురాలయిన ఇద్దరాడపిల్లల దయనీయమైన పరిస్థితిని గమనించేవాళ్ళే అక్కడ లేకపోయారు. వీధిలో యింటి గుమ్మాల దగ్గర నిలబడి కొంతమంది ఆడవాళ్ళు కుతూహలంతో చోద్యం చూస్తున్నారు.

అప్పుడే అక్కడికి చేరుకొన్న ఒకరిద్దరు, "ఏమిటి సంగతి అని అడిగారు.

"ఇల్లు ఖాళీ చేయిస్తున్నారు." ఎవరో జవాబిచ్చారు.

ఇంతలో సుబ్బయ్య ఓ చిన్న ట్రంకు పెట్టె తీసుకొచ్చి అరుగు మీద పడేశాడు. కొక్కెం ఊడిపోయిన ఆ పెట్టె మూతని కాల్తో పైకెత్తాడు సురేష్. ఒకా జులపాల జుట్టువాడు వంగి లోపల బట్టల్ని కెలికి ఒక "బ్రా"ని పాముని పట్టుకున్నట్టు పట్టుకొని బయటికి తీశాడు. ఎవరో బిగ్గంగా విజిల్ వేశారు. వచ్చి వాళ్ళలో చేరిన ఇద్దరు పెద్దమనుషులు కూడా నవ్వారు.

శారద కిరణ్మయి చెయ్యి పట్టుకొని "అక్కా పోదావే" అంది బెక్కుతూ. కిరణ్మయి చెల్లెలివైపు అయోమయంగా చూసి, "ఎక్కడికే" అంది.

ఈ లోపులో బయట, పక్క యింటి తలుపు తెరుచుకొని రంగనాథంగారు వచ్చారు. ఆయన తాలూకాఫీసులో గుమాస్తాగా చేరి రిటైరయ్యాడు. పరిస్థితి చూసి ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి.

"అర్ధరాత్రి ఆడపిల్లలు ఎక్కడికి వెళ్తారు నాయనా?" అన్నాడు.

"ఎవడో వచ్చాడ్రోయ్ ధర్మాత్ముడు" అన్నారెవరో.

"తాతగారు పాత ఖాతా ఏమో"

ఘొల్లుమన్నారు అందరూ. నిస్సహాయంగా జరిగేది చూడటంతప్ప ఇంకేమీ చెయ్యలేననుకున్నాడు ఆయన. ప్రేక్షకులలో ఒకడవటం ఇష్టం లేక లోపలికి వెళ్ళిపోయాడు.

ఈ లోపులో సుబ్బయ్య గదంతా కలియజూసేడు. ఇంకేవీ సామాను దొరకలేదు విసిరెయ్యటానికి. అతడి దృష్టి గోడమీదున్న వృద్ధ దంపతుల ఫొటోమీద పడింది. నిజానికి ఆ యింట్లో సామాను లేమీ ఎక్కువ లేవు.

సుబ్బయ్య వడిగా అటు నడిచి ఫొటో చేతులలోకి తీసుకున్నాడు. కిరణ్మయి అది చూసి చప్పున అటు కదిలింది. కానీ ఆమె అతన్ని వారించే లోపులోనే అతడు దాన్ని బయటకి విసిరేశాడు. బయట నిలబడ్డ గుంపు తలమీదనుంచి అది వెళ్ళి రోడ్డుమధ్య పడి భళ్ళున బ్రద్దలయింది.

కోపంతోనూ నిస్సహాయతతోనూ. రోషంతోనూ ఆమె విసురుగా గుమ్మంవైపు పరుగెత్తింది. వాళ్ళ కలిదండ్రుల ఫొటోఅదొకటే ఉన్నది.

కిరణ్మయి బయటకొచ్చేసరికి ఎన్నో జతల కళ్ళు ఆమెను తినేసే టట్టు చూసేయి. నిజానికి అక్కడున్న వాళ్ళందరూ - అక్కాచెల్లెళ్ళిద్దరూ బయటకి ఎప్పుడొస్తారా అని వేచిఉన్నారు ఇంతసేపూ. అందులోఆమెది అద్భుతమైన సౌందర్యం. బాగాతాగి, సగంస్పృహలోఉన్న వాళ్ళమతులు ఆమెని చూడటంతో పూర్తిగా పోయాయి. తమ చర్యను అడ్డుకొనేవాళ్ళె వరూ లేకపోవటం మరింత హుషారు వచ్చింది.

కిరణ్మయి ఇదేమీ గమనించకుండా రోడ్డుమీద పడిఉన్న ఫొటో దగ్గరికి వెళ్ళింది. అద్దం పగిలి, కాగితం బయటకొచ్చిన ఫొటోని చేతు లలోకి తీసుకుంది.

ఈ లోపులో శారదకూడా బయటకొచ్చింది. అక్క ఫోటో తీసు కోవటంతో అంతమంది కళ్ళూ తమనే గమనిస్తూండడం చూసి లోపలికె ళ్ళిపోబోయింది బ్రంకుపెట్టెమీద కూర్చున్న రేష్ సర్దుకొని కూర్చుం టున్నట్లు కూర్చొంటూ కాలు ముందుకు చాపి ద్వారానికి అడ్డుపెట్టాడు. ఆమె నిలబడిపోక తప్పలేదు. అంతలో జులపాల జుట్టువాడు ఆమెభుజం మీదుగా వంగుతూ "పాపం కాలు తియ్యరా" అన్నాడు. వాసన గుప్పున కొట్టింది.

కిరణ్మయి లోపలికి వెళ్ళటంకోసం మెట్లెక్కింది. ఈ లోపులో సుబ్బయ్య లోపల్నుంచి బయటకొచ్చి ద్వారబంధానికే చేతులు అడ్డుపెట్టి నిలబడ్డాడు.

"లోపల ఇంక మీ వస్తువులు ఏమీ లేవు. చూసుకోనక్కర్లేదు" అన్నాడు.

శారద పని కర్రలాట అయింది. అంతమంది మగవాళ్ళు ఆమె చుట్టూ యమభటుల్లా కనబడుతున్నారు. కిటికీలోంచి హరికేన్ లాంతరు వెలుతురు మసకగా బయటపడుతోంది. ఆమె జాలిగా అందరివైపు చూసింది. కంటివెంబడి నీరు ధారగా కారుతోంది. భూమి విలువునా విచ్చుకొని అందులో కూరుకుపోతే బావుండునని మనసారా కోరుకుంటోంది. ఆమె సున్నితమైన మనస్తత్వం ఇంత ఘోరమైన పరిస్థితిని యిమిడ్చుకోలేకపోతోంది. ఇంత హేయమైన స్థితిని ఆమె కలలోకూడా ఊహించలేదు. ఇంత రాత్రిపూట ఎక్కడికి వెళ్ళాలి? ఎవర్నిఆశ్రయించాలి?

ఈ లోపులో కిరణ్మయి అతడితో ప్రాధేయపూర్వకంగా "కనీసం యీ రాత్రికి ఉండనియ్యి. ప్రొద్దున్నే ఖాళీ చేస్తాం" అంటూ లోపలికి వెళ్ళబోయింది. సుబ్బయ్య చెయ్యిఅడ్డుతీసిఏదో చెప్పబోయేలోపులోనేఆమె లోపలికి నిష్క్రమించింది. శారదకూడా అక్కని అనుసరించబోయింది.

వాళ్ళు తన మాట ఖాతరు చెయ్యకపోవటంతో సుబ్బయ్యకిరోషం వచ్చింది. లోపలికి పోబోతున్న శారద మెడదగ్గర జాకెట్టుని వెనుకనుంచి పట్టుకున్నాడు. తాగిన విసురులో ఆమెని బయటకి లాగబోవటంతో — అసలే పాతదయిన జాకెట్టు పర్రున చిరిగిపోయింది.

క్షణం అక్కడ సూది పడితే వినబడేటంత నిశ్శబ్దం ఆవరించింది. కానీ అది క్షణంసేపే.

ఎవరో సన్నగా విజిల్ వేశారు.

"హాయ్" అన్నారెవరో.

జరిగింది గ్రహించగానే శారదకి స్పృహతప్పినట్లయింది.

సంస్కారమూ, సౌశీల్యమూ జీర్ణించుకున్న కుటుంబంలో పుట్టిందిఆమె. వాళ్ళ ఆర్థిక పరిస్థితి బాగా లేకపోవచ్చుగాక, కానీ బీదతనం

ఇంత పచ్చిగా తమమీద కసి తీర్చుకుంటుందని ఆమె తలచలేదు. ఎన్నో జతల కళ్ళు తన నగ్నమయిన భుజాల్ని చూస్తున్నాయని గ్రహించికూడా పైటన్నా కప్పుకోలేనంత నీరసం ఆమెని ఒక్కసారిగా ఆవరించింది. దగ్గరకొచ్చిన అక్క భుజంమీద తలవాల్చి అలాగే నెమ్మదిగా కాళ్ళ ముందు కుప్పగా కూలిపోయింది.

కిరణ్మయి నిప్పులు కక్కుతున్న కళ్ళతో చేయి ఎత్తి అతణ్ని కొట్టబోయింది. అతడు ఆమె చేతిని మధ్యలోనే పట్టుకుని ఒసురుగా లాగాడు. ఆమె అతడిమీదకు తూలగానే భుజాలచుట్టూ చేయి వేశాడు. ఆమె అతడి చేతుల మధ్య గుంజుకొంటూ "ఛీ వదులు" అంది.

అంత దగ్గరగా ఆమె అందాన్ని చూసేక అతడికి మతిపోయింది. చుట్టూ ఉన్న పరిసరాల్నీ మనుష్యుల్నీ కూడా మర్చిపోయి ముందుకు వంగేడు. స్నేహితుల దగ్గర్నుంచి వస్తున్న ప్రోత్సాహం మరింత ఉత్సాహాన్ని యిస్తోంది. ఆమెని బయటకు లాగుతున్నట్లు నటిస్తూనే దగ్గరగా హత్తుకో సాగేడు.

ఇంతలో అతడి భుజంమీద చెయ్యి పడింది.

సుబ్బయ్య వెనుదిరిగి చూసేడు.

వెనక్కి తిరిగీ తిరగ్గానే అతని దవడ పేలిపోయింది. ఆ ఫోర్సుకి వెళ్ళి సింహద్వారంమీద పడ్డాడు.

ఊహించని ఈ పరిణామానికి క్షణం విస్తుపోయినా చటుక్కున లేచి నిలబడి "ఎవడ్రా నువ్వు" అన్నాడు.

ఆ యువకుడు అతడి మాటలు పట్టించుకోకుండా శారద దగ్గరగా వెళ్ళి మోకాళ్ళమీద కూర్చొని ఆమెని లేపేడు.

"వచ్చేడండీ ఎవరో హీరో" అన్నారు గుంపులోంచి.

సురేష్ ట్రంక్ పెట్టెమీదనుంచి లేచి అతడి దగ్గరగా వెళ్ళి కోటు వెనకనుంచి పట్టుకొని "మావాణ్ని కొట్టడానికి ఎంత ధైర్యం నీకు?"

అన్నాడు. చుట్టూ ఉన్న మిత్ర బృందాన్ని చూస్తుంటే ధైర్యం పొంగి వస్తోంది. అందులోనూ ప్రత్యర్థి ఒక్కడే అని తెలియటంతో అది మరింత ఎక్కువయింది వెనక్కి తిరిగిన ఆ యువకుడి పై పట్టుకొని గుంజి, "మా ఇల్లు. మేం ఏమైనా చేసుకుంటాం. నీకెందుకు?" అని ముందుకు తోసేడు.

"చూస్తారేం నాలుగు తన్నక?" అన్నారు ఎవరో.

అతడు ఈ మాటలు లెక్కచెయ్యకుండా, తాపీగా ప్యాంటుజేబు లోంచి కర్చీఫ్ తీసి కోటుమీద పడ్డ మరకల్ని తుడుచుకొంటూ, "యూ నవ్" అన్నాడు.

కారు ఫ్రంటు డోరు తలుపు చప్పుడవటంతో అందరి కళ్ళూ అటు తిరిగేయి. డ్రైవర్ సీటులోంచి ఓ ఆరడుగుల వ్యక్తి దిగేడు. పుట్టినప్పట్నుంచి బీపూ, వెన్నా తప్ప ఇంకొకటి తిన్నట్టులేడు అతడు.

దగ్గరకొచ్చి, "సార్" అన్నాడు.

"కొంచెం వీడి సంగతి చూడు"

నిజానికి ఆ డ్రైవర్ జరిగేదంతా చూస్తూ కేవలం యజమాని ఆజ్ఞకోసం వేచిఉన్నాడు అప్పటివరకూ. అది లభించగానే సురేష్ రెండు భుజాలూ పట్టుకొని బొమ్మని ఎత్తినట్లు గాలిలోకి లేవదీసాడు.

ఆ తరువాత అక్కడ వినిపించే "దబ్ దబ్" మన్న చప్పుళ్ళనీ, పన్నని మూలుగుల్నీ అతడు పట్టించుకోలేదు.

అప్పుడే స్పృహలోకి వచ్చిన శారద జరుగుతున్నది అర్థంకాక చుట్టూ చూసింది. ఆమెకు చేయి అందిస్తూ కిరణ్మయివైపు తిరిగి "ఇక్కణ్నుంచి తీసుకెళ్ళాల్సిన ముఖ్యమైన వస్తువులు ఏమైనా ఉన్నాయా?" అని అడిగేడు.

ఏదో లోకంలో ఉన్నట్లు స్థాణువైన కిరణ్మయి అప్రయత్నంగానే తల అడ్డంగా తిప్పింది.

5)

"అయితే వదండి—" అని, ఇక ఆమె జవాబుకోసం ఎదురుచూడ కుండానే. శారదని పొదివి పట్టుకొని కారు దగ్గరకి నడిచేడు.

మసక వెన్నెల్లో నల్లటి ప్లిమత్ హుందాగా నిలబడిఉంది.

డోరు తెరచి ఆమెని లోపల కూర్చోబెట్టాడు. చుట్టూ తిరిగివచ్చి, ఇవతలి డోరు తెరచి, "కూర్చోండి" అన్నాడు.

కిరణ్మయికి ఏమీ అర్ధంకావటంలేదు. ఆమె మెదడు మొద్దుబారిపో యింది. అతడి కంఠంలో ఏదో ఆజ్ఞాపించే స్వరానికి బద్ధురాలై ఆమె కూడా లోపలికి వెళ్ళింది. అతడూ కూర్చొని తలుపు బలంగా వేస్తూ "యూసఫ్" అన్నాడు.

పని ముగించుకొని యూసఫ్ వచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

కారు నెమ్మదిగా కదిలింది.

నిశ్చేష్టమైన గుంపులోంచి ముందుగా తేరుకున్నది సుబ్బయ్య. రక్తంలో జీర్ణించుకుపోయిన వ్యాపార నైజం అంత గొడవలోనూ జరి గిన నష్టాన్ని హెచ్చరించింది "నా డబ్బు అదే" అని అరిచాడు.

కదలబోయిన కారు వేగం తగ్గింది. వెనుక విండోలోంచి ఓ నోట్ల కట్టవచ్చి అతడి మొహానికితగిలింది....

నెమ్మదిగా వస్తోన్న గాలి తెరలకి ఆ అభాగినుల మనసులు సేద తీరాయి. ముందుగా తేరుకొన్నది కిరణ్మయి. ఆ వచ్చిందెవరో - ఎక్క డికి తీసుకువెళ్తున్నాడో ఏమీ తెలీదామెకు. ఆ పరిస్థితిలోంచి ఎలాగో ఒకలా బయటపడటం ఒక్కటే అప్పుడామెకి తెలిసింది. కాని తీరాబయ టకొచ్చేసరికి లక్ష అనుమానాలు ఆమెనుచుట్టుముట్టినయ్ అదీగాక తమ పెట్టె బట్టలు అక్కడే ఉండిపోయినయ్.

ఏమీ మాట్లాడకుండా కూర్చున్న అతడివైపు చూస్తూ— "మనం ఎక్కడికి వెళుతున్నాం?" అని అడిగింది.

"మా యింటికి" అన్నాడు అతడు ముక్తసరిగా.

"మీరెవరు?"

జేబులోంచి సిగరెట్ ప్యాకెట్ తీసి వెలిగించుకుంటూ "చైతన్య కృష్ణ చైతన్య" అన్నాడు.



వాళ్ళిద్దరికీ జరిగిందంతా ఏదో కలగాఉంది.

ఇంటికి రాగానే చైతన్య ఇంట్లో అందర్నీ పరిచయంచేశాడు. కాంతిమతి ... కౌసల్య.... రవీ....

వాళ్ళ కళ్ళల్లో కదుల్తున్న సంశయాన్ని ఇక ఎక్కువసేపు వుంచ దల్చుకోలేదు. తనకీ, మాస్టారికీ ఉన్న పరిచయాన్నీ, మాస్టారు అర్ధ రాత్రి తనింటికి రావటాన్నీ, ప్రొద్దున్నే ఆయన మరణించిన సంగతి చెప్పేడు.

ఆ విషయం వినగానే శారద కుప్పకూలిపోయి "నాన్నా- నాన్నా" అని రోదించసాగింది. కిరణ్మయికూడా పైటచెంగు నోట్లో కుక్కుకొని మౌనంగా ఏడుపు బిగబట్టింది.

చైతన్య నెమ్మదిగా అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

కాంతిమతి, కౌసల్య వాళ్ళని ఓదార్చసాగారు.

తండ్రి మరణం శారదనే ఎక్కువ బాధపెట్టింది. అమెతండ్రి ఆమెకు రెండుపూటలా కనీసం తిండికూడా సరిగా పెట్టిఉండకపోయి ఉండవచ్చుగాక — కానీ ఆమె మనోవికాసానికీ, విజ్ఞానార్జనకీ అతను తన

ద్రిగా ఎంతో తోడ్పడ్డాడు. పన్నెండేళ్ళ వయసులోనే ఆమె రామాయణ, భారతాల్ని అమూలాగ్రంగా కంఠతా పట్టింది. అంతేగాక, ఆమె వీణ వాయిస్తుఉంటే ఆయన గంటల తరబడి కళ్ళుమూసుకొని తన్మయత్వంతో వింటూవుండేవాడు. బీదతనమేగాని మబ్బులాగా ఆమెనిఅడుకొనకపోయి ఉంటే ఆమె తారలా ప్రకాశించిఉండేది. అందులోనూ అక్క-అంత అందంలేకపోవటం ఆమెలో అణుకువనూ, వినయాన్నీ నేర్పింది.

వాళ్ళిద్దరూ తండ్రి మరణంతాలూకు బాధనుంచి తేరుకోవటానికి రెండురోజులు పట్టింది ఈ విషయంలో కౌసల్య చాలా శ్రమపడింది. ఇరవై నాలుగ్గంటలూ వాళ్ళతోనే ఉంటూ వాళ్ళు నెమ్మదిగా మర్చిపోయేలా చేసింది. మొదటిరోజు కొంచెం రిజర్వ్‌డ్‌గాఉన్న తరువాత రవీ కూడా కలిసిపోయేడు బాబు ముద్దు ముద్దు పలుక్కులూ, కాంతిమతి ఆప్యాయతా వాళ్ళ బిడియాన్నికూడా పోగొట్టినయ్.

o o o

చైతన్యకెదురుగా బల్లమీద ప్లాస్టిక్ కవరుంది.

వాళ్ళని తనింటికి తీసుకొచ్చినరోజే దాన్ని ఇద్దామనుకున్నాడుగాని తండ్రి మరణం సంగతి వినగానే వాళ్ళు దుఃఖసాగరంలో మునిగిపోవటం చూసి మళ్ళీ ఈ లోకంలోపడేవాకా ఆగాడు.

ఆ రోజు శారద మాటల సందర్భంలో "మా అడ్రస్ ఎలాదొరికింది?" అని అడగటంతో అతడికి కవరుసంగతి జ్ఞాపకంవచ్చింది.

తన బట్టలు బీరువాలో భద్రంగా దాచినదాన్ని తెప్పించేడు.

అందరూ కుతూహలంగా చూస్తూవుంటే అతడు కవర్ విప్పేడు. అందులో మళ్ళీ రెండు చిన్న కవర్లున్నాయి ఒకదానిమీద కిరణ్మయి పేరూ, రెండోదాని మీద శారద పేరూ వ్రాసివున్నాయి. అడ్రసుతో సహా.

"నాన్నకి మరీ బాధ స్తం" అంది కిరణ్మయి. ఏవరూ మాట్లాడ లేదు.

అందరిలో ఉత్సుకత పెరుగుతోంది.

ఎవరి కవర్ వారికి యిచ్చేడు.

"లోపలికి తీసుకెళ్ళి విప్పుకోండి ఏ రహస్యం వుందో" అన్నాడు రవి నవ్వుతూ.

కిరణ్మయి కూడా నవ్వి తన కవర్ విప్పింది.

లోపలున్న కాగితాలు చూసి ఆమె మొహం అవమానంతో మాడి పోయింది.

తమ తండ్రి చచ్చిపోతూ తమకు ఆస్థిగా భద్రపరచి ప్రేమతో యిచ్చినవి రకరకాల లాటరీ టిక్కెట్లు!

ఒక క్షణం ఎవరూ మాట్లాడలేదు.

ఆ నిశ్శబ్దాన్ని ఎలా ఛేదించాలో ఏవరికి అర్థంకాలేదు.

అందరికన్నా ముందుగా తేరుకొన్నది చైతన్య. నవ్వుతూ "ఏమో ఎవరికి తెలుసు- అందులోనే లక్ష తగలొచ్చు" అన్నాడు.

"అవును. అలా ఏందుకు కాకూడదు?" అంటున్న రవి. తన కుర్చీలోంచి చప్పునలేచి "అరె—అదేమిటి?" అన్నాడు.

అప్పటికే టిక్కెట్లను చింపి పోగులు పెడ్తున్న శారద. ఆ ముక్కల్ని వేస్టుపేపర్ బాస్కెట్‌లో పడేస్తూ "వాటి తారీఖులయిపోయి నెల, రెండు నెలలు కావొస్తుంది రవిబాబూ. ఇంకా ఏందుకు అని—" అంది పేలవంగా నవ్వుతూ,

o o o o

"ట్రాలర్స్‌మీదా బెస్తలు సముద్రంలో వారం పదిరోజులు వుండి వీటిని పట్టుకొస్తారు." అంటూ గుట్టలు గుట్టలుగా పడివున్న రొయ్యల్ని చూపించాడు చైతన్య.

కిరణ్మయి, శారద వింటున్నారు.

బాబు బల్లమీద కూర్చోని తల్లిచేతి గాజులతో ఆడుకొంటు న్నాడు.

"వీటిలో పెద్దసైజుకి డిమాండ్ ఎక్కువ. కిలోకి ఆరేడుమాత్రమే తూగేటంత పెద్దవి కూడా వుంటాయి. అలాటివి దొరికితే వాళ్ళకా రోజు పండగే." అంటూ ముందుకు నడిచేడు.

దాదాపు వందమంది పనిచేస్తున్నారు అక్కడ వాళ్ళచేతులు ఎంతో కళాత్మకంగా తమ పని చేసుకొంటూ పోతున్నాయి.

"దాదాపు పదిహేను వ్యాన్లు వున్నాయి యీ కంపెనీకి, అవి తీరానికి వెళ్ళి వేలంపాటలో వీటిని కొని ఇక్కడికి తీసుకొస్తాయి. వెంటనే ఇక్కడ తల, పైపొట్టు తీసెయ్యబడుతుంది. తరువాత క్లోరిన్ నీటిలో శుభ్రంచేస్తారు. వీటిని"

పెద చాంబర్ తలుపు తీసేడు చైతన్య.

"దీన్ని కోల్డ్‌స్టోరేజి అంటారు" అని పక్కనే వున్న ఫ్రెస్సింగ్ మిషన్‌ని చూపిస్తూ

"ఇక్కడ రొయ్య ఐస్‌మధ్య ప్రెస్‌చెయ్యబడుతుంది. తరువాత యీ పాకెట్స్‌ని కోల్డ్ స్టోరేజిలో భద్రంచేస్తారు" అన్నాడు.

కోల్డ్ ఛాంబర్‌లోకి ప్రవేశించగానే చల్లటి గాలి వాళ్ళని చుట్టు ముట్టింది. చలి శరీరాన్ని వణికిస్తోంది. అరలలో ప్యాకెట్స్ వరుసగా పర్చబడి వున్నాయి. ఎక్కువసేపు లోపల వుండలేక కిరణ్మయి బయట కొచ్చేసింది.

"లోపల ఎవరన్నా వుండగా తలుపు పొరపాటున వేసేస్తే?" కౌసల్య అన్నయ్యని అడిగింది.

చైతన్య నవ్వేడు.

"అరగంటలో చచ్చిపోతాడు. కానీ శవం మాత్రం ఎన్నిరోజు లయినా పాడవదు."

శారద వళ్ళు జలదరించింది. మాట మారుస్తూ "ఈ రొయ్యల్ని ఏం చేస్తారు?" అని అడిగింది.

"ఎగుమతి—" అన్నాడు చైతన్య బయటికి నడుస్తూ "అమెరికా జపాన్‌లలో వీటికున్నంత డిమాండ్ మరివేటికిలేదు. అదీగాక మన సముద్రతీరాలలో తప్ప యింకెక్కడా ఈ రకం రొయ్యలు దొరకవు"

కారు నెమ్మదిగా కదిలింది.

"నీళ్ళలోంచి బయటకొచ్చిన రొయ్య చాలాతొందరగా చచ్చిపోతుంది. ఆ తరువాత అంత తొందరగానూ పాడయిపోతుంది. కొన్న వెంటనే వీటిని వేన్‌లో బస్‌లో పెడతారు,ఫ్యాక్టరీలో కూడా ఐస్‌మధ్యనే పనంతా జరుగుతూంది ష్రిమ్ప్స్ ఫాక్టరీనుంచి ఓడచేరేవరకూ, ఓడ లోనూ కూడా యీ వాతావరణంలోనే వుంటాయి. చివరికి అమెరికాలో కస్టమర్ కొనుక్కొన్నప్పుడు కూడా సూపర్‌బజార్ వాడు ఫ్రీజ్‌లోంచి తీసి యిస్తాడు వీటిని—"

కారు కాంపౌండ్‌లోకి ప్రవేశించింది. ఎర్రటి మట్టిరోడ్డు అందంగా నీరెండలో మెరుస్తోంది ఇరుప్రక్కలా తెల్లటిరాళ్ళు వరుసగా పేర్చి వున్నాయి. వాటి వెనుక గులాబితోట. మధ్యలో నీళ్ళ ఫౌంటెన్— దూరంగా బోగన్ విల్లా మొక్క గాలికి వూగుతోంది విశాలమయిన భవంతి లోపలి గోడల డిస్టెంపర్ పెయింట్ మీద సూర్యకిరణాలు పరివర్తనం చెందుతున్నాయి. రవి యింట్లో వున్నట్లున్నాడు పీల్ డయిమండ్ కంఠం గిటార్ ధ్వనులతో కలిసి వినిపిస్తోంది.

"సముద్రంలో వారం పదిరోజులు వుండి నిద్రాహారాలు మాని వీటినిపట్టే బెస్తవాడికి కిలోకి అయిదారు రూపాయలు దొరుకుతుంది. ఆ కిలో రొయ్యలకే అమెరికాలో నూట ఇరవై రూపాయలు ధర"

"ఏమవుతుంది యీ డబ్బంతా—"

"మధ్యలో చాలా కొద్దిమంది పంచు కొంటారు. కాపిటలిస్టిక్ వాతావరణం కదా" కారు పోర్టికోలోకి తీసుకొస్తూ అన్నాడు చైతన్య "మాకు యీ వ్యాపారం చెయ్యటానికి లక్షలకి లక్షలు ప్యాకింగ్ క్రెడిట్ యిచ్చే బ్యాంకు, బొస్తవాడికి ఇల్లుకట్టుకోవటానికి డబ్బివ్వాలంటే సంకోచిస్తుంది."

కారు ఆగింది.

"మీరే యిలా మాట్లాడుతున్నారేమిటి?" కిరణ్మయి కారుదిగుతూ అంది. "మీరూ కాపిటలిస్టే కదా"

"అయినా మనిషినే కదా" నవ్వేడు.

కాంతిమతి కూడా నవ్వి. "ఆయన కప్పుడప్పుడు అలాటి స్మశాన వైరాగ్యం వస్తూవుంటుందిలే" అంది.

చివరగా శారద దిగి డోర్ వేసింది. అప్పుడే డ్రైవింగ్ సీట్ లోంచి దిగిన చైతన్య డోర్ మళ్ళీతీసి బలంగా వేస్తూ "మీరు మరీసున్నితస్తుల్లా వున్నారే - కారు తలుపు ఫ్రిజ్ తలుపులా వేస్తున్నారు" అన్నాడు.

శారద సిగ్గుతో నవ్వింది.

బాబు బోసిగా నవ్వేడు.

కాంతిమతి స్నేహపూరస్వరంగా నవ్వింది.

కిరణ్మయి నవ్వలేదు.

ఆమెకి తెలుసు—తనకీ తన చెల్లెలికి అది రెండోసారె కారు ఎక్కడం అని.

0<sup>0</sup>0 0<sup>0</sup>0 0<sup>0</sup>0

రాత్రి తొమ్మిదయింది.

కిరణ్మయికి నిద్రరావటం లేదు.

ఆరోజు సాయంత్రం రవి అన్నమాటలే ఆమెకి జ్ఞాపకం వస్తున్నాయి మాటిమాటికి.

అంతకుముందు నాల్గయిదు రోజుల్నుంచీ ఆమెకి టేబిల్ టెన్నిస్ నేర్పుతున్నాడు అతడు. అతడు తనపట్ల చూపుతున్న ప్రత్యేకాభిమానాన్ని ఆమె ఎప్పుడో పసిగట్టింది.

కానీ అంత తొందరగా తన అభిప్రాయాన్ని వ్యక్తంచేస్తాడని అనుకోలేదు. ఒకవేళ అతడేగాని ఆ కోర్కెని వెళ్ళబుచ్చితే ఎలా ప్రవర్తించాలో - డబ్బూ, అందమూ, తెలివీ చూసుకొని ఏది కోరితే అది వస్తుందన్న ధీమాలో ఉన్న ఆ యువకుడికి ఎలా బుద్ధిచెప్పాలో ముందే ఊహించుకొని సిద్ధంగాఉంది. పేదతనంలో ఉన్న యువతులు కూడా శీలానికి ప్రాముఖ్యత ఇస్తారని గుణపాఠం చెప్పాలనుకొంది.
ఇంటి యజమాని చేసిన అల్లరిలో, మధ్య దేవుడిలావచ్చి చైతన్య ఆదుకోవటం ఆ క్షణంలో ఆమెకి అత్యంత సంతోషం కలగజేసినా, ఆ తరువాత ఆమె ఆ యింటి పరిస్థితులకి యిమడలేకపోయింది. అంతర్లీనంగా గుండెల్లో ఓ మూల ఏదో అర్థంకాని కాంప్లెక్స్ ఆమెని బాధిస్తోంది. నిజానికి ఆ యింట్లో అందరూ ఆ అక్కా చెల్లెళ్ళని అత్యంత ఆప్యాయతతో చూసుకొంటున్నారు. ఆమెకి అర్థంకానిది అదే. ఎందుకలా చూసుకొంటున్నారూ— అని! గది తలుపులు బిగించి మధ్యలోవుంచినట్టు వూపిరాడడంలేదు ఆమెకు.

ఈ పరిస్థితుల్లో రవి ప్రవర్తన ఆమెలో ఒకరికమైన ఆనందాన్నే కలుగజేసింది. ఎందుకంటే ఎవరికీ లేని ఆస్థి ఒకటి తనకుందని ఆమెకి తెలుసు. అది తన అందం!

అయితే ఇక్కడకూడా ఆమె ఘోరంగా దెబ్బతిన్నది.

అప్పటివరకూ ఆమెవున్న ప్రపంచంవేరు. అక్కడ యువకులు సంస్కారహీనులు. మిడిమిడి చదువులతో కాలరెత్తుకుని తిరిగేవారు. అక్కడ ప్రేమకి అర్థం చౌకబారుగా చెలామణి అయ్యేది. ద్వందార్థం

వచ్చేమాటలు, ఏదో మిషమీద స్పృశించటాలూ - ఇలా ప్రకటితమయ్యేది. ఆమెని దక్కించుకోవాలని ప్రయత్నించిన యువకులందరూ ఆమెపట్ల ఇలా ప్రవర్తించే, ఆమెకు ప్రేమంటే ఒక హీనమైన అభిప్రాయాన్ని కలుగజేసేరు.

.... .... ....

"మీరు.... మీరు.... ఈ చీరెలో చాలా అందంగా ఉన్నారు" అన్నాడు రవి.

కారిడార్‌లో టేబిల్ టెన్నిస్ ఆట మధ్యలో.

"అయితే?" అందామె మొహంలో ఏ భావమూ కనబడనీయకుండా.

తన ప్రేమను దాచుకొనే ప్రయత్నం ఏమీ చెయ్యలేదతడు "ఐ లవ్ యూ కిరణ్" అన్నాడు నెమ్మదిగా- కానీ స్ఫుటంగా.

ఆమె అతడివేపు సూటిగా చూసింది. ఈ మాట ఆమెకి క్రొత్త కాదు. పెళ్ళయినవాళ్ళు, వృద్ధులు -చాలామంది అన్నారామాట. కొంతమంది చెంపలు పగిలినయ్. కొంతమందిని సున్నితంగానే తిరస్కరించింది. ఈ ప్రేమ అనేది అందమైన స్త్రీని చూడగానే పురుషుడికి అసంకల్పితంగాపుట్టుకొస్తుందని ఆమె దృఢమైన అభిప్రాయం. స్త్రీ వప్పుకుంటే- దగ్గరకు తీసుకుంటాడు తియటి మాటలు చెబుతాడు. అంతా రహస్యంగా ఉంచుతాడు. హాయిగా అనుభవిస్తాడు. కొంతకాలంతరువాత మొహం మొత్తుతుంది, వదిలేస్తాడు.

పక్కింటి పంకజం- ఎదురింటి సుశీల, అందరూ ఇలామోసపోయినవాళ్ళే. తమ వీధి చివర్లోఉన్న కాకాహోటల్ బల్లమీద కూర్చొనే గిరజాలజుట్టు రమేష్, అడ్డపంచ నారాయణ — వీళ్ళా ఆ ప్రాంతపు హీరోలు.

ఈ వాతావరణంలో పెరిగినస్త్రీ తననుతను రక్షించుకొనే అలవాటు సహజంగానే వస్తుంది ఆ స్త్రీ హృదయంలో సున్నితపుభావానికి చోటు లేదుఅందుకే ఆ యువకుడు ప్రతిపాదించినకోర్కెకి విసురుగా, "అయితే ఏమిటట?" అంది.

"మీరు వప్పుకుంటే అన్నయ్యకు చెబుతాను. తనుకూడా కాదన డనే నా నమ్మకం."

నిజంగా ఇది ఆమె వూహించని జవాబు. ప్రేమకి పెళ్ళి పర్యవ సానం అనీ, మొగవాళ్ళు ఇంత నిజాయితీగా ఉంటారని ఆమెకి తెలీదు. ఇది ఆమెకి ఒక షాక్. తనని ఈ విధంగా అడుగుతున్న యువకుడు ఒక ఉన్నతమైన కుటుంబంలో పుట్టేడనీ. చిన్నతనంచించీ మంచి కట్టు బాట్లమధ్య పెరిగేడనీ ఆమెకి ఆ క్షణం తోచలేదు.

సహజంగా కాస్త పెళుసుగాఉండే ఆ అమ్మాయి అలా మౌనం వహించటాన్ని ఇంకోలా భావించాడు రవి. సున్నితంగా ఆమె చేతిని ముద్దుపెట్టుకొని, "థ్యాంక్స్" అన్నాడు.

మొట్టమొదట ఈ పురుష స్పర్శ ఆమె హృదయ తంతుల్ని ఎక్కడో మీటినది. కానీ అంతకన్నా బలమైన భావంఏదో ఆమెలోచోటు చేసుకొంది. ఆ భావానికి నిర్వచనంలేదు. ఏమిటో ఆమెకే అర్థంకావటం లేదు. ఆ అలజడితోనే నిద్రపట్టక ఆమె తనగదిలోంచి బయటకొచ్చింది.

కౌసల్య తన గదిలో చదువుకుంటోంది.

రవి యింట్లోలేడు.

ఆమె మెట్లుఎక్కి పైకి వెళ్ళింది. ఆ యింట్లో అన్నిగదులూ ఆమెకి పరిచయమే.

కారిడార్ నిశ్శబ్దంగా ఉంది.

గాజు అద్దాల తలుపుల్ని తోసుకొని బాల్కనీలోకి వెళ్ళటంకోసం అడ్డుగాఉన్న పరదాను తొలగించి అక్కడ కనబడిన దృశ్యాన్ని చూస్తూ అలాగే చాలాసేపు నిలబడిపోయింది.

చైతన్య ఈజీచైర్లో విశ్రాంతిగా పడుకునిఉన్నాడు. నెమ్మదిగావీచే పిల్లగాలికి అతడి తెల్లటి లాల్చీసుతారంగా కదులుతోంది. పక్కనేకుర్చీలో కాంతిమతి కూర్చొనిఉంది. అతడివళ్ళో ాబు కూర్చొని ఆడుకొంటు న్నాడు. కాంతిమతి స్టూలుమీదఉన్న ఆకులకి సున్నంరాసి అతడినోటికి అందిస్తోంది ట్రాన్సిస్టర్లోంచి సితార్ నెమ్మదిగా విన్పిస్తోంది. పిట్టగోడ మీదకు వాలిన కొబ్బరిచెట్టు ఆకులు నెమ్మదిగా కదులుతున్నాయి.

—ఆప్యాయతల్ని ఇంత అందంగా ప్రదర్శించుకో వచ్చునన్న సంగతి ఆమెకి అప్పుడే తెలిసింది. తన కుటుంబం, తల్లీ తండ్రీ జ్ఞాపకంవచ్చేరు. ఎంత అసహ్యకరమయిన వాతావరణం అది. లాటరీ టిక్కెట్ల పిచ్చితో జేబులు ఖాళీచేసుకొని ఆ విసుగుతో ఇంటికొచ్చి తింటూ తింటూ ఖాళీకంచాలు విసిరేసే తండ్రీ, మంచంమీద పడుకొనే నానాతిట్లు తిట్టే తల్లీ- ఎంత భయంకరమైనగతం....

మనుష్యులు ఇంత ఆనందంగా వుండగలరన్నమాట! ఎంత చక్కటి అహ్లాదకరమైన వాతావరణం!

అసలిలాటి ప్రపంచం ఒకటున్నదనీ. ఈ ప్రపంచంలో మను ష్యులు ఇంత సున్నితంగా, హాయిగా బ్రతికేస్తారనీ, తమలాటివాళ్ళకి తెలిసేఅవకాశమేలేదు.

ఇరవైనాలుగు సంవత్సరాలు ఎంతహేయమైన స్థితిలో బ్రతికింది తను!

తెలియనంతసేపూ ఫరవాలేదు. తెలిసేక....

చప్పున ఆమెకి ఓ విషయం అర్థమయింది.

ఈ యింటికి వచ్చినప్పటినుంచి తనమనసులో కదలాడే అస్పష్ట మయిన ఖేదానికి కారణం ఏమిటో?

'పోలిక'



పదిరోజుల్లో క్రిష్టమస్. ఆ రోజే బాబు పుట్టినరోజు. సాయంత్రం మనం పార్టీ ఇస్తాం. ఆ రోజునాలుగయిదు ఇళ్ళల్లో పార్టీలకి వెళ్ళవలసిఉంటుంది. మ్యూజిక్ డాన్సులతో కొత్తసంవత్సరానికి ఆహ్వానం పలుకుతారు" అన్నాడు రవి.

అందరూ మెయిన్ హాలులో కూర్చొనిఉన్నారు.

కౌసల్య మేనల్లుడికి స్వెటర్ కుడుకోంది. కాంతిమతిఒడిలో బాబు ఆడుకొంటున్నాడు.

"శారద వంటలో సిద్ధహస్తురాలు. ఎంతమందికయినా యిట్టేవండేస్తుంది'' అంది కిరణ్మయి. శారద సిగ్గుతో తలవంచుకుంది.

"అయితే తననే ఆ డిపార్టుమెంట్ ఇన్‌ఛార్జ్‌చేద్దాం" అంచికాంతి

"మరి మవ్వేం చేస్తావ్?" చైతన్య అడిగేడు.

"సూపర్‌విజన్"

''అది నాపని" నవ్వేడు.

''ఏదీ చేతకానివాడు తనపనికి పెట్టుకొనే ముద్దుపేరది" అంది కౌసల్య అన్నయ్యని వెక్కిరిస్తున్నట్టు.

అందరూ నవ్వేరు.

బాబుకి పాలుపట్టటానికి కాంతి లోపలికివెళ్ళింది.

"అన్నిచోట్లకీరానక్కర్లేదు. కాని, రాబర్టు యింటికి మాత్రంరండి అక్క పార్టీ నిజంగా చూడాల్సిందే" అన్నాడు చైతన్య ఇద్దరితో.

ఇంతలో ఫోన్ మ్రోగింది. రవి వెళ్ళాడు.

శారద కౌసల్య అల్లుతున్న స్వెట్టర్ని పరిశీలిస్తోంది.

బయట్నుంచి రవి అరిచేడు. "కౌసల్యా— ఫోన్ ఫ్రమ్ దీపక్"

కౌసల్య కొద్దిగా సిగ్గుతో అక్కడినుండి లేచివెళ్ళింది.

ఆమెవెళ్ళేక చైతన్య అన్నాడు. "దీపక్ అని కొట్టాయంలో ఉంటాడు. కౌసల్య కాలేజిమేట్. మంచి టెన్నిస్ ప్లేయరు. వచ్చేవేసవి తరువాత తన లైఫ్‌మేట్_"

కిరణ్మయి తన మనసులో సంశయాన్ని దాచుకొనే ప్రయత్నం ఏమీచేయక "మీలో ప్రేమించుకోవటాలూ, పెళ్ళిచేసుకోవటాలూ చాలా సులభంగా జరిగిపోతూ ఉంటాయనుకొంటానే-" అంది.

శారద చప్పున తలెత్తి అక్కవేపుచూసింది. ఈ సంస్కార రహితమైనప్రశ్న అతడిని ఎలా గాయపరుస్తుందో అన్న భయం ఆమె మొహంలో కనిపించింది.

చైతన్య మొహంలోమాత్రం అతడి స్వభావసిద్ధమైన చిరునవ్వు చెరిగిపోలేదు కిరణ్మయి ప్రవృత్తిని అతడు మొదటిరోజే అర్థంచేసుకున్నాడు.

నవ్వుతూనే_ "నేనైనా కౌసల్యకి అంతకన్నా మంచిసంబంధం తేగలనని అనుకోను-" అన్నాడు.

"మీకి ప్రేమలమీద నమ్మకం ఉందా?"

వూహించని ఈ ప్రశ్నకి అతడుకొంచెం విస్తుబోయినా, వెంటనే తేరుకొని, "ఎలాగో పెళ్ళవుతుందికదా. ఆప్యాయత అదేపుట్టుకొస్తుంది" అన్నాడు.

శారద అక్కయ్యని వారించబోయిందికానీ, కిరణ్మయి మొహం ఏదో చెప్పాలన్న ఆవేశంతో ఎర్రబడింది. ఎప్పట్నుంచో ఆమెలో పేరుకుపోయిన భావం అగ్నిపర్వతంలా బ్రద్దలయింది.

"లేదు. ఈ ప్రేమలూ, ఆప్యాయతలూ, డబ్బుతో ముడిపడ్డవి. కడుపు పూర్తిగా నిండితే ఎయిర్‌కండిషన్డ్ రూములో చల్లటిగాలి. చేదతీ

రుస్తూఉంటే- ప్రేమ, ఆప్యాయతా వద్దన్నా పుట్టుకొస్తాయి. ఒకవేపు కడుపుకాలినప్పుడు డబ్బే ముఖ్యసమస్య అయినప్పుడు ఈ ఆప్యాయత లన్నీ గుండెల్లో కనపడనిచోటుకు వెళ్ళిపోతాయి! అప్పుడు ఆ స్థానాన్ని విసుగూ, చిరాకూ భర్తీచేస్తాయి."

ఆమె భావావేశానికి అతడు విస్తుబోయాడు. బీదతనంవల్ల ఆమెలో కలిగిన పెర్వర్షన్‌కి విచారించాడు.

"లేదు కిరణ్మయి, నేను నీ భావంతో ఏకీభవించను. ఈ బంధు త్వాలూ, ఆప్యాయతలూ మనిషి తన సంస్కారంతో ఏర్పరచుకొన్నవి. కేవలం ఆకలివల్ల మనిషి మృగంగా మారటమే సంభవించిన పక్షంలో ఈ ప్రపంచంలో బీదవాళ్ళు తమ సంస్కారాలన్నింటినీ కూల ద్రోసుకోనేవారు."

కిరణ్మయి అతడిమాటల్ని మధ్యలోనే ఆపుజేస్తూ "ఏదో కనిఉం డాలి కాబట్టి వాళ్ళుఉంటున్నారు కానీ, మీకు తెలీదు ... ప్రతిరోజూఎంత బద్ధశత్రువుల్లా భార్యాభర్తలు, అన్నాచెల్లెళ్ళు పోట్లాడుకుంటారో మీకు తెలీదు. ఆ మురికికూపాలలో, ఆ చీకటిగుహలలో ఆప్యాయత అనేది వెదికిచూసినా కనబడదు."

"ఏదిఏమైనా— డబ్బేఆప్యాయత బయటపడటానికి కారణమైతే నే ఒప్పుకోను."

శారద యీ సంభాషణ ఆపుచెయ్యటానికి ప్రయత్నిస్తూ, "పోనీ లెండి ఇక ఆ విషయం ఒదిలిపెట్టండి—'' అంది.

ఇంతలో కౌసల్య అక్కడికి వచ్చింది. "ఏమిటంత గట్టిగా వాదించుకుంటున్నారు" అడిగింది.

కిరణ్మయి నవ్వి "బీదతనంమీద తన అభిప్రాయం తప్పని వేమా, ప్రేమమీద నా అభిప్రాయం తప్పూఅని తానూ వాదించుకొంటున్నాం" అంది. "ప్రేమాభిమానాలు డబ్బులేకపోతే కోపమూ విసుగులమధ్య కప్ప బడిపోతాయి."

కౌసల్య నవ్వి "అన్నయ్యకి తెలియని విషయం ఉంటుందని నేననుకోను. డబ్బుతో అన్నీ కొనుక్కోలేం" అంది.

"నా అభిప్రాయం తప్పనినేనూ అనుకోను." అంది కిరణ్మయి పట్టుదలగా.

చైతన్య ఇవేమీ వినటంలేదు.

కిటికీలోంచి బయటకుచూస్తున్నాడు.

దూరంగా సముద్రపు హోరు లీలగా వినిపిస్తూంది.

భవాన్ని నిరూపించటంకోసం అనుభవం అనివార్యం సంపూర్ణార్థం చూడకపోతే భవంఎప్పుడూ అనిశ్చితము, అవ్యక్తము అసిద్ధమూ అసంపూర్ణమే భవమే రియాలిటీ!

o o o

"ఎంతుంది స్టాకు?" చైతన్య అడిగేడు.

"ఆరులక్షల దాకావుంటుంది బాబూ."

"ఇంకో నాలుగు లక్షలు కావాలి నెలాఖరుకు. కొంచెం ధర ఎక్కువయినా కొనెయ్యమనండి. మొదటివారంలో పదిలక్షలకి కాంట్రాక్టుఉంది—"

రంగయ్య తలూపాడు.

ఇంక ఆ విషయం చూసుకోనక్కరలేదు. రంగయ్యకి ఏదైనా పనిఅప్పగిస్తే అది జరగదన్న ప్రసక్తేలేదని చైతన్యకి తెలుసు. పదిసంవత్సరాల్నుంచీ నమ్మకంగా పనిచేస్తున్న వర్కరు.

చైతన్యవచ్చి కారెక్కగానే రంగయ్య కోల్డు స్టోరేజిలోకి వెళ్ళాడు

ఐస్ అచ్చుల మధ్య రొయ్యలు దీర్ఘనిద్రలోవున్నాయి. దాదాపు రెండువేల ప్యాకెట్లు. ఆరులక్షల విలువచేసే ప్యాకెట్లు!

కంప్రెషర్ సరిగ్గా పనిచేస్తూందో లేదో చూసేడు.

తలుపుమూసి బయటకొచ్చేడు.

విశాలమైన మెయిన్‌హాలు, వరుసగా పెద్దపెద్ద ఖాళీ ట్రేలు. ట్రేల మధ్య సన్నటిదారి.

అంతా నిశ్శబ్దంగా ఉంది.

క్లోరిన్ వాసన.

ప్రెస్సింగ్‌మిషన్ దగ్గరకెళ్ళి స్ప్రింగ్‌లో ఆయిల్‌చుక్కలు వేసేడు, నిజానికి ఇవన్నీ చూసుకోవటానికి కుర్రవాళ్ళున్నారు. కానీ తను స్వయంగా చూసుకోందే అతడికి తృప్తిఉండదు.

చాలా పాతకాలం నౌఖరు అతడు.

చైతన్య తండ్రి కాలం నుంచి పనిచేస్తున్నాడు. పిల్లగా చేరి సూపర్ వైజర్ అయ్యేడు.

అతడికి నవ్వొచ్చింది.

ఇంత నిశ్శబ్దంగా వున్న ఈ హాలుని మరుసటిరోజు చూస్తేఅసలు పోలికవుండదు,

దాదాపు నూటయాభయి మంది యువతులు చురుగ్గా పనిచేసుకు పోతూవుంటారు.

రంగయ్య మెయిన్ హాల్లోనించి బయట రూమ్‌లోకి వచ్చేడు, చిన్నగదది.

బల్లమీద స్టాకు రిజిస్టర్ వుంది. తీసి చూశాడు.

నార్త్ కొచ్చిన్ నుంచి రావల్సిన 'మెకనైజ్‌డ్ బోట్స్' ఇంకా రానట్లుంది. అవేగాని రాకపోతే విశాఖపట్నం నుంచి తెప్పించాల్సి వస్తుంది.

దాదాపు మూడు సంవత్సరాలలో ఈ బోట్లు నాలుగు రెట్లవటంతో విపరీతమైన పోటీ ఎదుర్కోవలసి వస్తోంది. ఏమాత్రం రొయ్యల జాడ కనబడినా- ఒడ్డుకి చేరుకొన్న బోట్లుకూడా మళ్ళీ సముద్రంలోకి వెళ్ళిపోతు న్నాయి.

ఈ ఆలోచనలతోనే తలుపుతాళం వేసి బయటకి వచ్చేడు.

మెయిన్‌గేటు దగ్గర గూర్ఖాలేడు. రెండు పర్లాంగుల దూరంలో వున్న టీ కొట్టు దగ్గరకు వెళ్ళి వుంటాడు. యజమాని వెళ్ళిపోవటంచూ వాడూ వెళ్ళిపోయివుంటాడు.

ప్రహరీతలుపు దగ్గరగా వేసి గొళ్ళంపెట్టేడు.

నెమ్మదిగా వూరివైపు నడవసాగేడు.

చుట్టూ గడ్డిమొక్కలు ... దుబ్బుల్లా పెరిగిన పొదలు దూరంగా సముద్రం నుంచి వచ్చిన బ్యాక్‌వాటర్ ఉప్పుగాలి .... కీచురాళ్ళ చప్పుడు.

చిన్న కాలిబాటలో నడుస్తూవుంటే కాలిక్రింద నుంచి మెత్తగాపాకి 'బుస్' అన్న శబ్దం వినిపించింది.

మసక చీకట్లో పాము పొదల మధ్య అదృశ్యమయింది.

రంగయ్య దాన్ని అంతగా పట్టించుకోలేదు.

పారేసిన రొయ్యల తలల్ని తినటానికి నీటి పాములు ఫ్యాక్టరీ చుట్టూ చేరటం అక్కడి వారికి తెలిసిందే. రంగయ్య ముందుకి సాగి పోయేడు. పాములు స్టోరేజిలోపలికి రాలేవని, వచ్చినా వెంటనే చలికిచచ్చి పోతాయనీ తెలుసతనికి.

కానీ అది త్రాచుపామనీ - తనమీద పగ బట్టిందనీ మాత్రం తెలీదు.

o o o

విశాలమయిన రోడ్డుమీద పాములా జారిపోతోంది కారు. పది నిమిషాల ప్రయాణంచేసి కొండ ఎక్కటం ప్రారంభించింది.

"మీకు దేముడిమీద నమ్మకం వుందా?" కిరణ్మయి అడిగింది.

ముందు సీట్‌లో కూర్చొన్న చైతన్య మాట్లాడలేదు కాంతిమతి జవాబిచ్చింది. "సంవత్సరానికి ఓసారి కొండకొచ్చి దర్శనం చేసుకోక పోతే నా మనసు వూరుకోదు."

కాంతిమతి వళ్ళో కూర్చోన్న బాబు ఎత్తయిన కొండిల్ని — కొండలమధ్య మెలికలా తిరిగిన రోడ్డుని చూస్తున్నాడు.

కారు మంచి కండిషన్‌లో వున్నట్లు చప్పుడు చెయ్యకుండా ఘాటు రోడ్‌లో వెళ్తోంది.

"సాధారణంగా డబ్బున్నవాళ్ళకి దేముడిమీద నమ్మకంఎక్కువగా వుంటుంది" అన్నాడు చైతన్య.

"అది నేననాల్సిన మాట" అంది కిరణ్మయి.

శారద యిబ్బందిగా కదిలింది. అక్క అంత నిర్మొహమాటంగా మాట్లాడటం ఆమెకి నచ్చదు. కానీ చైతన్య వెనక్కి తిరిగి' "కాంతి, నాకు కిరణ్మయిలో నచ్చేగుణం అదే సుమా, మనసులో ఏదీ వుంచుకో కుండా మాట్లాడటం" అన్నాడు నవ్వుతూ.

"అలా మాట్లాడకూడదని, అలామాట్లాడటం గొప్పకాదనీ నాకు తెలుసు. కానీ ఆ విషయం నాకెప్పుడూ అలా మాట్లాడేసిన తరువాత జ్ఞాపకం వస్తూవుంటుంది." అంది కిరణ్మయి అమాయకంగా కారు నవ్వులతో ప్రతిధ్వనించింది.

"బిజినెస్ మెన్‌కి వుండకూడని గుణం అది"- అంది కౌసల్య.

చైతన్య చెల్లెలివైపు చూసి, "ఆమెకి బిజినెస్‌కి సంబంధంఏమిటీ? అన్నాడు.

"ఇప్పుడు ఆడవాళ్ళు కూడా బిజినెస్‌లో పైకొస్తున్నారు సాబ్" అన్నాడు డ్రయివర్ తన పరిజ్ఞానం చూపిస్తూ.

అప్పటివరకూ నవ్వుకొన్న చైతన్య మొహం ఎర్రబారింది.

మళ్ళీ కారు కాలేజిముందు ఆగేవరకూ అతడు మాట్లాడలేదు.

అక్కడే వాళ్ళకోసం ఎదురుచూస్తున్న నౌకరు పరుగెత్తుకొంటూ వచ్చాడు.

ఆడవాళ్ళు లోపలికి వెళ్ళేరు.

చైతన్య కారు దిగేరు "డ్రయివర్" కోటు సర్దుకొంటూ అన్నాడు.

"సర్___"

"కారుకి వెనకసీటూ, ముందు సీటూ ఎందుకుంటుందో తెలుసా?" అతడి మొహం సీరియస్‌గావుంది.

"ముందు డ్రయివర్ కూర్చుంటానికి — వెనుక యజమానులు కూర్చోవటానికి మైండిట్"

o o o

ఇసుక వేస్తె రాలనట్టు జనం. అందరి మొహాలలోనూ లోపలికి వెళ్ళాలనే ఆరాటం. ఏదోకంగారు. ఒకమూల ఓగుంపు "గోవిందా" అని అరుస్తున్నారు, వృద్ధులు, పసిపాపలెత్తుకున్న తల్లులు, రోగులు, నమ్మకముతో రోగం కుదుర్చుకున్నవాళ్ళు, కొత్తనంపతులు — రకరకాల మనుష్యులు.

కారొచ్చి ఆగింది.

ఇంత మంది జనాన్ని చూసి ఆడవాళ్ళు నీరుగారిపోయేరు. ఇక ఆరోజుకి దర్శనం దొరకటం దుర్లభం అనేది నిస్సంశయంగా తేలిపోయింది.

"ఈరోజు ఏదో పండగనుకొంటా" అంది కౌసల్య చుట్టూ చూస్తూ.

ఇంత పత్తిడిలో బాబుని తీసుకెళ్తె ఎలాగండీ" అంది కాంతిమతి. చైతన్య మాట్లాడలేదు.

స్పెషల్ దర్శనం దగ్గరకూడా జనం గుంపులు గుంపులుగా వున్నారు. గాలిలేక విపరీతంగా ఉక్కబోస్తోంది. ఆ వాతావరణం అలవాటులేని శల్య. కళ్ళు అప్పుడే అలసట సూచిస్తున్నాయి. జనం

మాత్రం ప్రవాహంలా వస్తూనే వున్నారు.

ఇంతలో డ్రయివర్ వచ్చేడు. అతడితోపాటూ పెద్దబొట్టుపెట్టుకొని ఒకతను వచ్చేడు. వస్తూనే నమస్కారంపెట్టి, తొందర తొందరగా క్షమా పణలు చెప్పుకొన్నాడు.

"రండిసార్ రండి జైన్‌సాబ్ ట్రంక్‌కాల్ చేసి చెప్పినారు. మీ గురించే చూస్తున్నాము కొంచెం ఆలస్యమయితే కాఫీ తాగటానికి పోయి వుంటిని" అంటూ దారి చూపించేడు.

చైతన్య తలాడించి ముందుకు నడిచేడు. అందరూ అతడిని అనుస రించారు.

జనం బయటకొచ్చే గేటులోంచి లోపలికి తీసుకెళ్ళాడు. దర్శనం చేసుకొన్నవాళ్ళు ఒక్కొక్కరే బయటకొస్తున్నారు. ఆ దారి ఖాళీగా ఉంది

రెండు నిముషాలలో దేవుడి దగ్గరకు చేరుకొన్నారు.

పూజారి నమస్కారంపెట్టి బొట్టువాడిని పలుకరించాడు.

"ఇదో" అన్నాడు బొట్టువాడు. "మనజైన్‌సాబ్ పంపినారు. స్పెషల్ గెస్టులు"

దాంతో మిగతా క్యూ ఆగిపోయింది.

పూజారి దేవుడ్ని వర్ణించి చెప్పసాగేడు'

ఇంకో తీర్థంపోయసాగేడు.

బాబుతో కాంతిమతి దణ్ణం పెట్టిస్తూంది.

కౌసల్య భక్తితో కళ్ళుమూసుకొనిఉంది. శారద మళ్ళీ చూడటం పడదేమో అన్నట్టు కళ్ళార చూస్తూంది. కాంతిమతి బాబు నుదుటిమీద బొట్టు పెడుతోంది.

దూరంగా ఎత్తుమీద నిలబడ్డ చైతన్యకి అంతా స్పష్టంగా కనిపిస్తోంది.

జేగురు రంగులో దేముడు వెలవెల బోతున్నాడు.

ముందు దీపాలు వెలగనూ - ఆరనూ అన్నట్లున్నాయి.

చుట్టూ గోడలు నల్లగా వున్నాయి. లోపలంతా చీకటిగా, క్రింద దంతా తేమగావుంది పైన ఏముందో తెలియడంలేదు.

పొగ వాసన ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. బైట క్యూలో ఎవరో ఊపిరి సలపకుండా దగ్గుతున్నారు.

ఇంకెవరో భక్తి పారవశ్యంతో అరుస్తున్నారు.

పూజారి బొట్టువాణ్ని 'పైమెంతయింద'ని అడుగుతున్నాడు. ఇంకో పూజారి దేముణ్ని యింకా వర్ణిస్తూనే వున్నాడు. అతడిని చూస్తూ వుంటే తన సరుకు చూపించి బేరంచేసే బిస్తవాడు జ్ఞాపకం వచ్చేడు తన్యకి.

అతడికెందుకో నవ్వొచ్చింది. ఎందుకో తెలీదు.... తెరలు తెరలుగా నవ్వాలనిపించింది. అతడి మనసులో ఏముందో అతడికే స్పష్టంగా తెలీదు. తను ఎత్తుమీద వున్నట్టూ, మిగతా వాళ్ళంతా క్రిందవున్నట్టూ భావన— రెండు చేతులు పట్టుకొని, పక్కకి జారబడి చూస్తున్నాడు.

ఇంతలో అతడి వెనుకగావున్న 'క్యూ'లో కలవరం మొదలైంది. సహావం చచ్చిపోయిన వాళ్ళని గైడ్లు సరిజేయ బూనటంతో గొడవ జరుగుతోంది.

చైతన్య అటు చూసేడు.

గైడ్ కొద్దిగా బలంగా తొయ్యటంతో ఓక ముసలతను పక్కకి పడిపోయి, బలహీనంగా లేస్తూ అరిచేడు — "రేయ్ ! నిన్న రాత్రి నుంచీ 'క్యూ'లో వున్నాన్రా నేను. ఇప్పటకి యిక్కడి వరకూ వచ్చేను. ఇప్పుడు దేముడ్ని చూడనివ్వకుండా తోసేస్తావా ? సర్వనాశనం అయి పోతావ్ —'"

చైతన్య చప్పున తల తిప్పేసుకొన్నాడు.

తన వాళ్ళందరూ అప్పటికే వెళ్ళిపోవటంచూసి, అతడూ బైటకి

పడివడిగా నడిచేడు.

o o o

"పరీక్షలు బాగా వ్రాసేవా ?" లోపలికి వస్తూన్నరవిని అడిగేడు చైతన్య.

టేబిల్‌కి ఇవతలి పక్కకుర్చీలో కూర్చొంటూ తలూపేడు రవి. "సెకండ్ క్లాస్ వస్తుందను కొంటాను" అన్నాడు.

"తరువాతేం చేస్తావు—?

"ఇంకా చదువుదామను కొంటున్నాను."

చైతన్య బారంగా శ్వాస వదుల్తూ, "సరే" అన్నాడు. నిజానికి అతడికి తమ్ముడు కూడా ఈ పన్లు చూసుకొంటే సగం పని తగ్గుతుం దన్న వుద్దేశ్యం వుంది.

"చదువుకోనా ?" చిన్నపిల్లవాడు అడుగుతున్నట్టు అడుగుతూన్న తమ్ముణ్ని చూస్తే అతడికి నవ్వొచ్చింది.

"అదేమిట్రా అలా అడుగుతున్నావు...." అన్నాడు నవ్వుతూనే.

"ఏంలేదు—నువ్వు సరేనని చాలా క్యాజువల్‌గాఅంటూంటే...."

చైతన్య కుర్చీలో వెనక్కివాలుతూ. "నవ్వూ యీ విషయాలు కొద్దిగా చూసుకొంటూవుంటే బావుంటుందని నా వుద్దేశ్యం. నాకూ శ్రమ తగ్గుతుంది నీకు పనీ తెలుస్తుంది" అన్నాడు.

రవి బెదిరినట్టు కుర్చీలోంచి లేచి. "బాబోయ్. యీ రొయ్యల బిజినెస్ నేను చెయ్య లేనన్నయ్యా.... ఆ మాటకొస్తె అసలు ఏ బిజి నెస్సూ చెయ్యలేను" అన్నాడు.

"ఏం ?"

"నేను శుద్ధ అమాయకుణ్ని. నా మొహం చూస్తుంటే ఆ సంగతి తెలియటం లేదూ—?"

చైతన్య నవ్వాపుకొని, "సర్లే" అన్నాడు.

ఇంతలో రంగయ్య వచ్చేడు, "నే వెళ్ళొస్తా" అన్నాడు రవిలేచి.

తలూపిని, రంగయ్య అందించిన స్టాక్ స్టేట్ మెంటు చూసేడు చైతన్య. దాదాపు ఎనిమిది లక్షల దాకా వుంది స్టాకు.

"ఈ రోజు యింకో యాభైవేల స్టాకు వస్తుంది బాబూ. నాల్గు రోజుల్లో పది లక్షలు పూర్తవుతూంది" అన్నాడు రంగయ్య.

"అవ్వాలి నెల ఖరుకల్లా పంపకపోతే కాంట్రాక్ట్ అనవసరంగా పోతుంది. కొంచెం ధర ఎక్కువైనా కొనెయ్యండి. మళ్ళీ క్రిస్టమస్ వచ్చిందంటే మూడురోజులు పనివాళ్ళు దొరకరు"

అతడు తలూపి వెనుదిరిగేడు.

"రంగయ్యగారూ—"

ఆగి "ఏం బాబూ" అన్నాడు.

"మీ పాపకెలోవుంది ?"

అతడి మొహం వాడిపోయింది. "అలాగే వుంది బాబూ. రాయ వెల్లూరు తీసు కెళ్ళా లన్నారు"

"మరి ఎప్పుడు తీసుకెళ్తున్నారు ? "

రంగయ్య మాట్లాడలేదు. చైతన్య అతడి దగ్గరగా వెళ్ళి భుజం మీద చెయ్యి వేసేడు. "డబ్బుకోసం బైట హెచ్చువడ్డీకి ప్రయత్నాలు చేస్తున్నారట కదూ—" అంటూ జేబులోంచి కొంత డబ్బుతీసి అతడి చేతిలో పెడ్తూ, రంగయ్యాగారూ : దాదాపు పది సంవత్సరాల్నుంచీ నాతో కలిసి పనిచేస్తున్నారు. ఈరోజు యీ బిజినెస్ ఇంతగా డెవలప్ అయిం దంటే. దాంట్లో సగం మీ భాగమూ వుంది. అటువంటప్పుడు నన్ను డబ్బడగటానికి ఎందుకు మొహ మాట పడ్తున్నారో అర్థం కావటంలేదు"

రంగయ్య కళ్ళవెంబడి నీళ్ళు తిరిగేయి. కృతజ్ఞతతో నోటమాట రాలేదు. ఏదో అందామనుకొనే లోపులోనే చైతన్య అక్కడి నుండి వెళ్ళిపోయేడు.

అతడు తేరుకొని, నెమ్మదిగా లోపలికి వెళ్ళేడు. పనివాళ్ళు రొయ్యల్ని మధ్య ప్రెస్‌చేస్తున్నారు ఆ అచ్చుల్ని కొందరు కోల్డ్ స్టోరేజిలో భద్రరుస్తున్నారు.

సాయంత్రం అయిదయింది.

రంగయ్య ఫ్యాక్టరీలోంచి బైటకొచ్చి నడవసాగేడు. అతడిమనసు ఆనందంతో నిండిపోయింది. పావకిపూర్తిగా యమైపోయినట్లేనవి భావిస్తున్నాడు. యజమానికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు.

రోడ్డు సముద్రం పక్కగా సాగిపోతోంది.

దూరంనుంచి తీరంవేపు వస్తున్న బోట్లు కాగితం పడవల్లా వున్నాయి.

మనుష్యుడి అస్తిత్వాన్ని ప్రశ్నిస్తున్నట్లు నిండుగా, వ్యధన్నిదాచు కొన్న సామాన్యుడి మనసులా గంభీరంగా ఉంది సముద్రం.

సూర్యుడు పశ్చిమం వైపు కృంగిపోతున్నాడు. చీకటి త్రాచు పాములా పాక్కుంటూ వస్తోంది.



ఆ మరునటి రోజు దీపక్ వచ్చేడు.

ఎర్రగా పొడుగ్గా వున్నాడు. పయరరవయిఅరయినా మొహంలో యింకా అమాయికత్వంపోలేదు ఫర్గూసన్ కంపెనీలో చీఫ్అకౌంటెంట్ గా పని చేస్తున్నాడు

అతని పూర్వీకులు చాలా కాలం క్రితమే కొట్టాయంలో స్థిరపడి పోయేరు. వాళ్ళకి మలబారు ప్రాంతంలో తేయాకు తోటలున్నాయి. తల్లి దండ్రులకి ఒక్కడే కొడుకు.

అతడికీ కౌశల్యకీ పరిచయం చాలా గమ్మత్తుగా జరిగింది.

కౌశల్యకి టెన్నిస్ ఆట గురించి ఏమీ తెలీదు.

అయినా బలవంతం మీద ఒకరోజు చెల్లెల్ని టెన్నిస్ మ్యాచ్‌కి తీసుకెళ్ళేడు రవి అందులో దీపక్ పాల్గొంటున్నాడు.

ఆట అయిపోయేక రవి అతడికి పరిచయం చేసేడు.

ఇద్దరికీ చొరవతీసుకొని మాట్లాడటం అలవాటు లేకపోవటంతో విష్ చేసుకొని వూరు కొన్నారు.

ఇద్దరూ ఒకే కాలేజీలో చదివే వారవటంచేత ఆ తరువాత ఎప్పు డయినా కనబడితే నవ్వుతో పలకరించుకొనేవారు.

——ప్రేమ ఒక సంఘటనతో ఉద్భవిస్తుంది. అనటం అనౌచిత్యం కేవలం ఒక్క సంఘటనతో — గొప్ప వంశంలో పుట్టి చదువూ సంస్కారం వున్న యువతి ప్రభావితం, కాదు. ఆ సంఘటనలో యువ కుడు ఎంత గొప్పధీరోదాత్తుడయినా సరే ! ధీరోదాత్తత కథానాయకుని లక్షణం కాబట్టి నవలాకారులు సంఘటనలతో మాల అల్లి సంయమనాన్ని చిత్రీకరిస్తారు. కానీ అటువంటి సంఘటనలేవీ లేకుండానే వారు దగ్గర యేరు.

ప్రేమ పట్ల యింత బిడియం చూపించిన దీపక్ పెళ్ళి విషయం వచ్చేసరికి చాలా ధైర్యం చూపించేడు. కౌసల్య ఇంట్లో చెప్పటానికి భయపడింది.

ఆమె చెప్పి వుంటుందనుకొని దీపక్ తల్లి దండ్రులతో దిగే సమయానికి, చైతన్యకి అసలివిషయం ఏమీ తెలీదు.

వీళ్ళని చూసి ముందు ఆశ్చర్యపోయినా. సంగతంతా తెలుసుకొని సంతోషించేడు.

కౌసల్యనీ, చైతన్య కుటుంబాన్ని చూసేక దీపక్ తలిదండ్రులకి కూడా అభ్యంతరం ఏమీ కనబడలేదు.

ఆ తరువాత అతడు కూడా ఈ కుటుంబంలో ఒకడయ్యేడు.

అతడిరాకతో ఆయింట్లో కొత్త సందడొచ్చింది.

అసలే మిత భాషిణి అయిన కౌసల్య అతడి రాకతో పూర్తిగా మౌనవ్రతం పట్టింది. రవికిమాత్రం చెల్లెల్ని ఏడిపించటానికి మంచి సమయం దొరికింది. కిరణ్మయి మొదటిరోజు వూరుకొన్నా దీపక్ అమాయకత్వమూ వెమ్మది చూసి. రవితో కలిసి వాళ్ళన ఆట పట్టించ సాగింది.

ఈ అల్లరిలో పాల్గొననిది శారద ఒక్కతే. ఆమె చాలా లోతైన మనిషి అని చైతన్య మొదటిరోజేగుర్తించాడు. తన పనేదో తనుచేసుకు పోవటం ఎపనీ లేకపోతే పుస్తకాలు చదువుకోవటం. ఇదీ ఆమె దిన చర్య.

ఒకరోజు ఆమె కౌసల్య గదిలోకి వెళ్ళే సరికి కౌసల్య వీణ మీద సాధన చేస్తోంది.

"నీకు వీణ బాగా వచ్చా?" అడిగింది శారద.

కౌసల్య కొద్ది సిగ్గుతో, ఉహూ—రాదు. ఎదో కాలక్షేపంకోసంనేర్చు కొంటున్నాను." అంది. శారదపరీక్షగా వీణ వంక చూడటం గమనించి, "నీకు వచ్చా" అంది కౌసల్య.

"ఏదో కొద్దిగా"

ఆమె మొహమాటం సంగతి తెలిసిన చైతన్య మాట మారుస్తూ "అంత బాగా వీణ వాయించటం ఎక్కడ నేర్చుకున్నావు?" అన్నాడు.

"నాన్నగారి దగ్గర" అంది. క్షణం నిశ్శబ్దంగా గడిచింది. తండ్రి జ్ఞాపకంరావడంతో ఆమె కళ్ళలో నీరు గిర్రున తిరిగింది. చైతన్య గమనించి, "ఇంత సున్నిత హృదయురాలు ఈ ప్రపంచంలో ఎలా బ్రతుకుతుందో" అనుకొన్నాడు. ఆ భావంతోనే అతడు ఆమెని "ఇక్కడ మీకు అంతా సవ్యంగానే జరుగుతూఉంది కదా" అన్నాడు.

ఊహించని ఈ ప్రశ్నకి ఆమె విచలితురాలయింది. తనకృతజ్ఞత ఎలా చెప్పాలో మాటలురాక క్షణం తడువుకొని "నిజంగా ఆ రోజుమీరు రక్షించకపోయివుంటే మేం ఎక్కడ ఉండేవాళ్ళమో తల్చుకోవటానికే భయంగాఉంది" అంది.

"ఆ సంగతికాదు. ఇక్కడ బాగానేఉందికదా—"

శారద కంఠంలో ఎప్పుడూ కనపడని ఉద్వేగం కనబడింది "నిజంగా ఇంత ప్రేమాభిమానాల్ని మా జీవితంలో మేం ఎరగం. మీ అందర్నీ చూస్తుంటేనే మనసు నిండిపోతోంది...."

చైతన్య నవ్వి, "కానీ కిరణ్మయి ఇదంతా డబ్బుతో వచ్చిందంటుంది." అన్నాడు.

తన మనసులో ఎప్పట్నుంచో చెప్పాలనుకొంటున్న మాటనిచెప్పే అవకాశం వచ్చినందుకు, ఆమె తన స్వభావసిద్ధమైన కవచాన్ని తొలిగించుకొని, "అక్కమాటలు పట్టించుకోకండి దయచేసి—" అంది.

"నేనసలా అర్థమెంటే ఒప్పుకోను డబ్బువల్లే ఆప్యాయతలు రావటం ఏమిటీ?" అన్నాడు చైతన్య.

శారద మాట్లాడలేదు.

ఆమె తయారై ఉండటం చూసి, "బయటకి వెళదామనా?" అన్నాడు మాటమారుస్తూ.

శారద మొహమాటంతో, "విన్న రాత్రి వీణతీగ ఒకటి తెగిపో యింది." అంది.

చైతన్య కుర్చీలోంచి లేస్తూ, "దానికేముంది వెళ్ళు" అని, బెల్ కొట్టబోయి ఆగి, "ఈరోజు డ్రైవర్ రాలేదనుకొంటా వదనేనొస్తాను" అన్నాడు.

ఆమె కంగారుగా "మీ రెందుకు?" అంది.

"వర్లేదు" కుర్చీలోంచి లేచేడు.

"మీరు పనిచేసుకొంటూఉంటే మధ్యలో వచ్చి దాన్ని పాడుచేశా నేమో"

"ఒక విషయం తెలుసా?" బయటకి నడుస్తూ అన్నాడు.

"ఏమిటి?"

"ఈ యింటికి వచ్చిన యిన్నాళ్ళకి నీ అంతట నువ్వు నోరువిప్పి ఒక కోర్కె కోరావు" అంటూ కారు స్టార్టు చేసేడు. శారద తలవంచు కొంది బిడియంతో.

కారు నెమ్మదిగా కదిలింది.

చల్లటిగాలి అలలు అలలుగా వీస్తోంది.

టేబిల్ పైన కాగితాల కట్టమీద ఇన్సూరెన్స్ కాగితం గాలికిఊగు తోంది.

o o o

ఆ మరునటిరోజు చైతన్యకి అనుకోని ప్రోగ్రాం తగిలింది.

జపాన్‌నుంచి హమాఫో తోషిమా సేల్స్‌చీఫ్ రావటంతో అతడితో కలిసి కొచ్చిన్ వెళ్ళవలసివచ్చింది

అక్కడినుంచి కారులో సైట్ సీయింగ్‌కి 'తేక్డి' వెళ్ళారు.

చుట్టూ ఎత్తయిన కొండలు....

పచ్చగా నేలమీద పరిచినట్టు కొండవాలులలో తేయాకుతోటలు.

రోడ్డు కొండల్ని చుట్టుకొని వెళుతోంది.

దూరంగా కొండలమధ్య సన్నటి దారం జారినట్టు జలపాతాలు—

అయిదారు మైళ్ళకి ఒక చిన్న తేయాకు ఎస్టేటు, ఓ వందయిళ్ళు మళ్ళీ నిర్మానుష్యమైనదారి.

ఇలా సాగింది ప్రయాణం.

"ఈ తేయాకు లాభదాయకంగా వుంటుందా?" అడిగేడు జపాన్ నుంచి వచ్చిన చీఫ్.

"ఈ కొండలమీద పండేది మంచి క్వాలిటీ" జవాబిచ్చేడుచైతన్య "ఒకో ఎస్టేటు ఓనరుకీ లక్షలమీద ఉంటుంది లాభం. ఈ రాష్ట్రంలోలాభ పాటి వ్యాపారాలు రెండే. తేయాకు, రొయ్యలు —"

"మీ దేశంలో టాక్సేషన్ ఎక్కువటకదూ?" తలూపేడు చైతన్య

"ఏదో మాగజైన్‌లో చదివేను. ప్రభుత్వం ఎంత ఎక్కువగా పన్నులు వేస్తుందో — దాన్ని ఎగగొట్టటానికి అన్ని కొత్త మార్గాలు అన్వేషిస్తారట"

చైతన్య నవ్వి ఊరుకున్నాడు.

"మిస్టర్ చైతన్యా-" అన్నాడు చీఫ్.

"దేవుడిమీద చాలా భక్తిఉన్న ప్రజలుమీరు. ఇలా ప్రభుత్వాన్ని మోసం చెయ్యటం పాపం అనుకోరా.... దయచేసి నేనిలా అడుగుతు న్నందుకు ఏమీ అనుకోకండి—"

"నో_ నో ఫరవాలేదు" అని కొంచెంసేపు ఆలోచిస్తూ ఊరుకొని తర్వాత అన్నాడు— "అతి త్వరగా పారిశ్రామికం అవుతున్న దేశం ఇది. అందువల్ల యిక్కడ మనిషి పాత సాంప్రదాయాన్ని వదిలిపెట్టనూ లేక కొత్తగా అంటే "యాంత్రికంగా" మారనూలేక సతమతమవుతు న్నాడు. అందువలనే ద్వంద్వ ప్రవృత్తి పెంపొందించుకొంటున్నాడు-అని నా ఉద్దేశ్యం"

"ద్వంద ప్రవృత్తి....? అంటే....??"

కౌసల్య పక్కకి జరిగి, "ఏదీ చూపించు ఎంతవరకు వచ్చో" అంది.

శారద కొద్ది మొహమాటంతో "ఇప్పుడు కాదు" అని అంటున్నా వినిపించుకోకుండా చెయ్యి పట్టి కూర్చోపెట్టింది. ఇక తప్పలేదు. ఆమెకు. వీణ ముందు కూర్చోన్న మరుక్షణం అమెకి తండ్రి జ్ఞాపకం వచ్చేడు. ఏదో వ్యధ, ఒకసారి తీవెల్ని మీటి శృతి చూసుకొంది. ఆ తరువాత అమె వ్రేళ్ళు తీవెలపై కదలసాగేయి. మరుక్షణం ఆ పెద్ద భవనపు ఎత్తయిన గోడలమధ్య ధ్వని తరంగాలు అలల్లా వ్యాపించాయి.

అప్పటి వరకూ నవ్వుతూన్న కౌసల్య పెదవులమీద అప్రయత్నముగా నవ్వు మాయమైంది. ఏదో అద్భుతం చూస్తున్నట్లు అమె అలాగే విశ్చష్టురాలై కూర్చుండి పోయింది.

కారిడార్‌లో కూర్చొన్న చైతన్య కర్ణపుటాలకి ఈ వీణానాదం వినిపించగానే చదువు తున్నపుస్తకం పక్కన పడేసి కుర్చీలోంచి లేవకుండానే, కళ్ళమీద చెయ్యి వేసుకొని ఆలాగే మరో ప్రపంచంలోకి వెళ్ళిపోయాడు.

రకరకాల వ్యాపార విషయాలలో అలసట చెందిన అతడి మనసు ఈ అపురూపమైన వీణానాదానికి సేదతీరసాగింది.

కీర్తన పూర్తిచేసి శారద తలెత్తేసరికి గదిలో రవి, కాంతిమతి ఆమె వంకేచూస్తూ నిలబడటం కనపడింది.

"సూపర్బ్" అని రవి చప్పట్లు కొడుతూ. చెల్లెల్నిచూసి "కౌసల్య వాయిస్తూవుంటే విరిచి పొయ్యిలో పెట్టేద్దామనిపించేది. వీణ యింతబావుంటుందని మాకు తెలీదు." అన్నాడు. కౌసల్య నాలుక బయటపెట్టి అన్నది వెక్కిరించింది. ఇంతమంది పొగడటం చూసేసరికిశారదసిగ్గుతో తల వంచుకొంది.

అప్పుడే అటుగావచ్చిన కిరణ్మయిని చైతన్య అడిగేడు— "ఎవరు యిప్పటి వరకూ వీణ వాయించింది...—"

"శారద—"

అతడి మొహంలో క్షణంపాటు ఆశ్చర్యం కనిపించింది.

"ఓ —"అని "నీకూ వచ్చా?" అని అడిగేడు.

కిరణ్మయి నవ్వి "నాకెలాంటి కళలోనూ ప్రవేశంలేదు" అనివెళ్ళిపోయింది అక్కణ్నుంచి.

చైతన్య కళ్ళు మూసుకుంటూ అనుకున్నాడు.

"అక్కాచెల్లెళ్ళలో ఒకరు సౌందర్యాన్ని పుణికి తెచ్చుకుంటే రెండో వారు తప్పక ఏదో ఒక విద్యలో ఆరితేరుతారు. వాళ్ళలో వున్న కాంప్లెక్సే దానికి తోడ్పడుతుంది కాబోలు...."

చాలా సేపటి వరకూ ఆ వీణానాదమే అతడి చెవులలో మ్రోగ సాగింది.

ం ం ం ం

ఆ మరుసటి రోజు చైతన్య ఆఫీస్‌రూమ్‌లో కూర్చొని కాగితాలు చూసుకుంటూ వుండగా శారద అక్కడికి వచ్చింది ఆమె అక్కడికి రావటం అదే మొదటిసారి, కిరణ్మయి అయితే ఆఫీసులో కూడాయింట్లో తిరిగినట్లే తిరుగుతూ వుంటుంది.

చైతన్య తలెత్తిచూసి సంభ్రమంగా కుర్చీలోంచి లేస్తూ "రా శారదా" అన్నాడు ఆప్యాయంగా.

ఆమె కుర్చీలో కూర్చొంటూ చుట్టూ చూసింది. పార్టీషన్ చెక్కలు అందంగా మెరుస్తున్నాయి. ఎయిర్ కండిషనర్ చప్పుడుచిన్నగా వినిపిస్తోంది.

"చెప్పు. ఏం కావాలి" అన్నాడు చైతన్య వెనక్కివాలి. శారద తత్తరపడి "ఏంలేదు" అంది.

"దేని దారి దానిదే అన్నమన స్తత్వం. చేసిన తప్పులన్నీ ఒక్క-సారి గుడికీ వెళితే పోతాయనుకోవటం— దేముడున్నాడూ అన్నభావాన్ని గుడ్డిగానమ్మి దాంతో పుణ్యాన్ని మూటకట్టుకోవాలని చూడటం—"

"మీరు దేవుడున్నాడని నమ్మటంలేదా?"

ఈ ప్రశ్నకి వెంటనే సమాధానం చెప్పలేదు చైతన్య నవ్వి. కొంచెం ఆలోచించేడు "ఈ ప్రశ్న నాకెప్పుడూ రాలేదు. అవసరంరాలేదూ అంటే బావుంటుందేమో........" నా పనేదో నేను చేసుకుపోతున్నాను. ఎవరికీ అపకారం చెయ్యటంలేదు. నాకు దేవుడితో అవసరం ఏముంది?"

"ఉన్నదీ అనుకోవటంలో మనిషికి ఒక అలౌకికానందం దొరుకుతుంది—"

చైతన్య "మీరది నమ్ముతున్నారా?" అని అడిగేడు నవ్వుతూ.

చీఫ్ నవ్వలేదు "నమ్ముతున్నాను" అన్నాడు.

"మీ దేశంలో దేవుడిపట్ల ఎటువంటి భావంఉంది?"

"మీకు తెలిసే ఉంటుంది. బౌద్ధులెక్కువ మాలో 'జెన్' అన్న సంప్రదాయం.... దీన్ని బుద్ధుడే ప్రారంభించేడని మా విశ్వాసం." మెలికలు తిరుగుతున్న రోడ్డు మీదనుంచి శూన్యంలోకి చూస్తూ అన్నాడు.

"సర్వ జనీన బుద్ధ స్వభావం — అంటే— ప్రతి వ్యక్తి తన జీవితమందే బుద్ధుడు అవుతాడన్న సిద్ధాంతం దాని పునాది. బుద్ధత్వ ప్రాప్తికి ముఖ్యసాధనం 'ధ్యానం' ఎన్నో సంవత్సరాల మెడిటేషన్ ద్వారా మా బుద్ధుడు తెల్సుకున్న గొప్పసత్యం అది. దుఃఖం ఉన్నది. దానికి హేతువున్నది. నిరోధమున్నది. దానికి మార్గమున్నది అని."

ప్రపంచంలో అన్నింటికన్నా పెద్దదయిన సీఫుడ్ కంపెనీ చీఫ్ బిజినెస్ ఎగ్జిక్యూటివ్ ఇంత లోతయిన వేదాంతం మాట్లాడటం ఆశ్చర్యంగాఉంది" అన్నాడు చైతన్య.

చీఫ్ నవ్వేడు— వేదాంతం మనిషిని అంటిపెట్టుకునే ఉంటుంది"

కారు 'అరణ్య నివాస్' హోటల్ ముందు ఆగింది. చుట్టూ ఎత్తయిన చెట్లు, పక్షుల కిలకిలా రావాలు, కొండమీద హోటలు, పక్కనే నది. నది కవతలి వేపున కొండలు, అద్భుతమైన దృశ్యం.

"కానీ ఇక్కడి వేదాంతం అంటే మా మతపు ఉద్దేశ్యం వేరు" కారు దిగుతూ ఓఫ్ అన్నాడు. "సుఖాలలో తేలటం, అనశనాదులతో శరీరాన్ని పీడించుకోవటంలాంటి ఎక్స్ట్రీమిటీస్ వదిలి శాంతిని అన్వేషించమని మా మతం బోధిస్తుంది"

ముందు ముందు తనజీవితం ఆ మార్గంలోనే నడవబోతూఉందని తలచనిచైతన్య రూమ్ రిజర్వేషన్ ఎంక్వయిరీకోసం రిస్ప్షన్ వేపు నడిచాడు.

○ ○ ○

"రియల్లీ మార్వలెస్" అన్నాడు చీఫ్.

చుట్టూ కొండలూ, కొండలమధ్య నది. నది ఎగువకి బోటుప్రయాణం రెండు వేపులా చిట్టడవి.

"ఇక్కడ ఎంతలోతు ఉంటుంది?" అడిగేడు.

"నూటయాభైనుంచి రెండువందల అడుగులవరకూ."

ఊపిరి వదలటంకూడా మరిచి, "రెండువందల అడుగులు....!" అన్నాడు ఆశ్చర్యంగా నీటవేపు చూస్తూ.

నీరు అమాయకంగా ప్రవహిస్తోంది.

"ఇక్కడ ఆనకట్ట వేయటంలో నీటిమట్టం అకస్మాత్తుగా పెరిగింది. నిజానికి ఇదంతా అడవిమధ్యలోలోయ. అందుకే ఇంతలోతు ఇక్కడ"

బోటునడిపేవాడు తలతిప్పి, "అటు చూడండి" అన్నాడు.

అందరూ అటు చూసేరు.

ఒడ్డునే నిలబడి చిన్న ఏనుగులగుంపు జలకాలాడుతోంది. పెద్ద ఏనుగు తొండంతో నీళ్ళుఎత్తి పిల్లఏనుగుమీద పోస్తోంది. ఇంకో ఏనుగు గడ్డిపీకి వళ్ళు రాసుకొంటోంది.

"బ్యూటిఫుల్" అన్నాడు చీఫ్.

"ఇది నాచురల్ బ్యూటీ" అన్నాడు చైతన్య.

"మనం "బోను"లో ఉండి మృగాలమధ్య విహరిస్తున్నామన్న మాట. దట్టమయిన అడవిమధ్యలో వున్నాం మనం"

దగ్గరగా వెళ్ళిచూద్దాం" అన్నాడు చీఫ్.

చైతన్య తలఅడ్డంగా వూపి "లాభంలేదు" అన్నాడు.

"ఏం?"

నీళ్ళమధ్య చిన్నపుల్లల్లా బయటకొచ్చినవాటిని చూపిస్తూ "అవే మిటో ఊహించగలరా?" అన్నాడు.

"ఉహూఁ"

"అవి చెట్లు. నదిమధ్య చెట్లు. పైకి అలా పుల్లల్లా కనబడుతున్నా దాదాపు వందఅడుగుల ఎత్తున చెట్లు. బోటు ఏ మాత్రం వాటికి తగిలినా మనందం మునిగిపోతాం" అన్నాడు చైతన్య. "కొన్ని చెట్లని కొట్టేసేరు. కానీ ప్రమాదమే. అందుకే చెట్లు పుల్లలున్నచోటల్లా పైకి కనబడేలా కట్టారు."

"మరి మన బోటుఎలా నడుస్తూంది?"

చైతన్యనవ్వి "వీళ్ళందరికీ పదీ పదకొండు సంవత్సరాల అనుభ వం ఉంటుంది. ఒకే దారిలో ప్రయాణంకదా"

బోటు నీటిమధ్య మెలికలు తిరుగుతూ, ముందుకు సాగిపోతోంది బోటువాడు దృష్టిమరల్చకుండా ఏకాగ్రతతో నడుపుతున్నాడు.

చెట్లమధ్య నీరు సుడులు తిరుగుతూ ప్రవహిస్తుఉంది.

వందగజాల దూరంలో ఇంకో ఏనుగులగుంపు నీరు త్రాగుతోంది.

ఒకసారి ఇలాగే ఓక పడవలోవాళ్ళు ఏనుగుల్ని దగ్గరగా చూద్దా మన్న ఆశతో ఒడ్డుకు కొద్దిగా దగ్గరకు తీసుకెళ్ళారు. అక్కడ చెట్లమధ్య చిక్కుబడిపోయింది. అందరూ భయంతో కేకలుపెట్టసాగారట. అదే వాళ్ళు చేసినతప్పు. దాంతో ఒకఏనుగు ఉధృతంగా ఘీంకరిస్తువచ్చి పడ వని తలక్రిందులుచేసింది "

"థ్రిల్లింగ్. రియల్లీ థ్రిల్లింగ్' అన్నాడు చీ పైప్ పీలుస్తూ. అతడికి యాట్రిక్స్ ఏంతగానో నచ్చింది.

చైతన్యకి మాత్రం అది నూట యాభయ్యో సా - యిలా రావటం ప్రతిసారీ మొదటిసారి లాగే వుత్సాహంగా వుంటాడు.

అదే బిజినెస్.



జపాన్ నుంచి ఓఫ్‌ని పంపి ఎయిర్‌పోర్ట్ నుంచి చైతన్య వచ్చే సరికి ఇంటిదగ్గరి ఎరేంజిమెంట్స్ అన్నీ పెద్ద ఎత్తున జరుగుతున్నాయి.

ఆ మరునటి రోజే బాబు పుట్టినరోజు.

క్రిస్టమస్ కూడా.

ఎక్కడ చూచినా ఇళ్ళకి వేలాడదీసిన నక్షత్రాలు, రంగురంగుల కాగితాలు అంటించిన యిళ్ళు - అంతా కోలాహలంగా వుంది.

బాబుకి రెండో ఏడు దాటి మూడు వస్తుంది క్రిస్టమస్‌కి.

రవి పిలవవలసిన అతిధుల లిస్ట్ యిచ్చేడు. చైతన్య అందులో ఇంకొన్ని పేర్లు చేర్చి ఫైనలైజ్ చేసేడు.

ఒక కార్లో కౌసల్యా, కిరణ్మయి, ఇంకోకార్లో చైతన్య ఆహ్వానించటానికి వెళ్ళేరు.

అది పూర్తయ్యేసరికి మధ్యాహ్నం రెండయింది.

లంచ్ పూర్తిచేసుకొని చైతన్య ఫ్యాక్టరీకి బయలుదేరాడు.

వరుసగా మూడు రోజులు శలవులివ్వడం వల్ల ఫ్యాక్టరీ అంత నిర్మానుష్యంగా వుంది.

గేటు దగ్గర కారు ఆపి హారన్ గట్టిగా మ్రోగించేడు.

నిముషంపాటు ఎవరూ రాలేదు. అతడు కారు దిగబోతూవుంటే రంగయ్య లోపల్నుంచి పరుగెత్తుకు వచ్చేడు.

"గుర్ఖా ఏడీ—"

"పది నిమిషాల క్రితం వరకూ ఇక్కడే వుండాలండయ్యా. టీకి వెళ్ళినట్టున్నాడు"

చైతన్య సిగరెట్ వెలిగించాడు. "ఫ్యాక్టరీలో అందరూ వున్న వ్వుడు గూర్ఖా అవసరంలేదు రంగయ్యగారూ. ఎవరూ లేనప్పుడే కావాలి. తన పనిమీద తనకి గౌరవం లేనివాడు నాకొద్దు. ఈ రోజే అతడిని తీసెయ్యండి. రెండు నెలల జీతం ఇవ్వండి"

రంగయ్య మాట్లాడలేదు యజమాని తొందరగా ఓ నిర్ణయానికి రాడనీ, వస్తే యిక దానికి తిరుగుండదని అతడికి తెలుసు.

ఇద్దరూ లోపలికి నడిచేరు.

ఎత్తైన ఫ్యాక్టరీ గోడలమధ్య నిశ్శబ్దం మందంగా నిద్రపోతూ వుంది.

"ఎలావుంది కొనుగోలు ?"

"బావుందయ్యా, సిక్స్‌టీన్ - ట్వంటీ (రొయ్యల సైజుకి ఇదో కొలమానం) ఈ సారి ఎక్కువగా దొంకినయ్"

"దట్స్‌గుడ్" సంతృప్తిగా తల ఆడించేడు. "మీరు రాయ వెల్లూరు ఎప్పుడు వెళ్తున్నారు ?"

"వచ్చేనెల మొదటివారంలో."

బైటకి వస్తూ అన్నాడు "రేపూ ఎల్లుండీ శలవే. మీరు యిక్కడుండి చేసేదేముంది ? ఇంటికి వెళ్ళిపోండి అవతలెల్లుండి షిప్‌మెంటుకి పని మొదలు పెడ్దాం."

రంగయ్య తల అడ్డంగా వూపుతూ. "నేనుంటాన్లే అయ్యా" అన్నాడు.

ఇక అతడు చెప్పినా వినడని చైతన్యకి తెలుసు.

"నేను వెళ్తున్నాను" కారు స్టార్ట్ చేస్తూ అన్నాడు.

రంగయ్య నమస్కారం పెట్టేడు....

చైతన్య యింటికొచ్చేసరికి నాలుగయింది.

డిసెంబర్ నెల అవటంవల్ల అప్పుడే కొద్దిగా చలి మొదలైంది.

బాబుకి కొత్తబట్టలేసి తీసుకొచ్చి అందించింది కాంతిమతి. వళ్ళో కూర్చోబెట్టుకున్నాడు కొడుక్కి తండ్రి పోలికలే వచ్చేయంటుందికాంతి. అల్లరి చేయడు. ఒంటరితనం యిష్ట పడతాడు.

ముందు గార్డెన్‌లో కుర్చీలు వేస్తున్నాడు నౌకర్. రవి స్పీకర్‌ని తోటలోకి ఏర్పాటు చేసేడు. 'సీల్ డైమండ్' పాట గిటార్ ధ్వనుల మధ్య వినిపిస్తోంది.

కౌసల్య టేబిల్‌మీద కేక్ అరేంజి చేస్తోంది. శారద లోపల వంటదగ్గర వుంది.

బైట కారుశబ్దం వినిపించి కుర్చీలోంచి లేచి బైటకి వచ్చేరు చైతన్య

ఒక్కొ గెస్టూ రావటం మొదలైంరి.

"రండి" చైతన్య కారు తలుపు తెరిచేడు—

రంగయ్య కోల్డ్ స్టోరేజి తలుపు తెరిచేడు— లోపలికి వెళ్ళి తలుపుమూసి, ప్యాకెట్స్ లెక్కపెట్టటం మొదలు పెట్టేడు. పదిలక్షలు జపాన్ కన్‌సైన్‌మెంట్. నాలుగు లక్షలు మామూలు స్టాకు దూరంగా చ్ఛరీలో ఆరుకోట్లరు ఆరు.

ఆరయ్యేసరికి అతిథులందరూ వచ్చేసేరు. ముందు గార్డెన్‌లో రకరకాల రంగు రంగు బల్బుల కాంతి పరచుకొంది. కాంతి, బాబుతో కేకు కోయించింది. అంతా చప్పట్లు కొట్టారు. చిన్నముక్క తీసి,బాబుతో నోటికి అందించేడు చైతన్య. స్పీకర్‌లోంచి పాప్ మ్యూజికు గట్టిగా వినబడ్తోంది. దీన్నిమించి నవ్వులశబ్దం.

ఏదో శబ్దం వినబడి, రంగయ్య కోల్డ్ స్టోరేజిలోంచిబయటకి వచ్చేడు విశాలమైన ట్రేల మధ్య దారి శూన్యంగా వుంది ట్రేలఅవతల ఏముందో కనబడటంలేదు "ఎవరదీ" అన్నాడు గొంతు పెద్దది చేసి

గొంతు పెద్దది చేసి మాట్లాడుకొంటున్నారు ఆతిథులు. అయినా ఒకరిమాట ఒకరికి వినబడటంలేదు. క్రొత్త పరిచయాలు జరుగుతున్నాయి ఎవరో రవిని "పెళ్ళెప్పుడు చేసుకొంటావోయ్" అని అడుగుతున్నారు. రవి నవ్వి, ఓరగా కిరణ్మయిని చూస్తున్నాడు ఎప్పుడూ లేనిది ఈ మధ్య కిరణ్మయి బుగ్గలమీద సిగ్గుదొంతరలు కదుల్తున్నాయి. చైతన్య చెల్లెలితో "దీపక్ కూడా వుంటే బాగుణ్ణుకదూ" అన్నాడు. కౌసల్య నునుసిగ్గుతో తలవంచుకుని నేలవైపు చూసింది.

తలవంచి నేలమీద చూసేడు రంగయ్య. తలక్రింద ఏమీలేదు. మూల చప్పుడైంది ఈసారి రెండడుగుల వ్యాసార్ధంగల పెద్దపెద్ద ప్లేట్లున్నాయి, రొయ్యల్ని కడిగేసి, రంగయ్య ప్లేట్లు దగ్గరకి నడిచేడు.

చైతన్య ప్లేట్ల వద్దకు నడిగాడు. రెండు ప్లేట్లు ఫార్మల్‌గా గెస్ట్సకి అందించి డిన్నర్ ప్రారంభించేడు. అందరికీ అన్నీ అందు తున్నాయాని చుట్టూ చూస్తున్నాడు చైతన్య. చుట్టూ చూసేడు రంగయ్య. ఎవరూ కనబడ లేదు సంతృప్తిపడి లోపలికి వెళ్ళబోతూంవుంటే మళ్ళీ చప్పుడైంది. చప్పున వెనుదిరిగి చూవేడు చప్పుడికి కారణం తెలిసింది. కానీ అప్పటికే సమయం మించిపోయింది, పడగెత్తిన పాము ఊహించని వేగంతో అతడి కాలు మీద కాటువేసి క్షణంలో అదృశ్యమైంది కాలుపట్టుకొని కుప్పలా కూర్చుండిపోయేడు.

కూర్చొంటూ, "అబ్బ—ఇంత మంచి డిన్నర్ తిని చాలాకాల మైందోయ్" అన్నాడు జైన్ తృప్తిగా. చైతన్య మనస్సులో శారద వంటలకి కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. స్పీకర్ లోంచి రాహుల్ దేవ్ బర్మన్ గొంతు చించుకొని అరుస్తున్నాడు.

అరిచినా ఎవరికీ వినిపించదని తెలుసు, అరవటానికి కూడా ఓపికలేదు. నోటినించి నురుగువస్తోంది. వళ్ళంతా చెమట్లు పట్టేసినయ్. శరీరం నల్లగా మారిపోతోంది విషం శరీరమంతా పాకేసింది లేనిచోట, ఎవరూ సహాయానికి రానిచోట—నిస్సహాయంగా పడివున్నాడు అతడు

ఎంతో దయనీయమైన స్థితితో ఒక్కొ ప్రాణం పోతూవుంటే—మూత బడ్తున్నకళ్ళనీ బలవ్వతంగా తెరిచాడు. ఎదురుగా కోల్డ్‌స్టోరేజి. తెరిచి వున్న తలుపు మూసేసరికి—అంతబాధలోనూ వులిక్కిపడ్డాడు అది మూసెయ్యకపోతే.................... మూసేయ్య....క... పో....తే.... రొయ్యలు పాడయితే వచ్చేనష్టాన్ని తలుచుకొంటే. వళ్ళు కంపించింది. బాధకీ, స్వామి భక్తికీ మధ్య వూగిపోతూ . బాధని పళ్ళబిగువున నొక్కిపట్టెడు. చేతులమీద లేవటానికి ప్రయత్నించేడు. ఓపిక సరిపోలేదు. నెమ్మదిగా అటువైపు దేకసాగేడు ఒక్కో. అడుగూ ముందుకు వేస్తోంటే బాధప్రాణాల్ని తోడేస్తోంది. ఇంకో రెండడుగులు వేస్తే తలుపు అందుతుంది. ఒక్కసారి తోస్తేచాలు లాక్ పడుతుంది. తరువాత తనేమయి పోయినా ఫర్వాలేదు! బలంఅంతా కాళ్ళల్లోకి తెచ్చుకొన్నాడు. అంతలో తలతిరిగినట్లు నిపించింది. తూలిపోయేడు— ఒక్కఅడుగుముందుకుకి ....ఇంకొక్క అడుగు వెళ్తేచాలు తలుపు అందుతుంది. ఇంకొక్క అడుగు....అందకపోతే—లోపల ఐస్ కరిగిపోతే—....

ఐస్‌క్రీం అందరికీ అందిదోలేదో స్వయంగా చూస్తున్నాడు చైతన్య అతడి కీసారిపార్టీచాలా సంతృప్తినిచ్చింది, ఒక్కరొక్కరే వచ్చి థ్యాంక్స్ చెప్పి వెళ్ళిపోసాగేరు నెమ్మదిగా. ప్రొద్దున్నించీ చేసిన కారు ప్రయాణం వల్లా, ఆరేంజి మెంట్స్ వల్లా అతడి కళ్ళు అలసటతో మూతపడసాగినయి.

మూపపడ్డ కళ్ళని బలవంతాన తెరిచేడు రంగయ్య. ఒక్క అడుగు దూరంలో వుంది తలుపు. సర్వశక్తుల్నీ కూడదీసుని లేచేడు. చేయిసాచేడు. గుండెల్లో కలుక్కుమంది ఒక్కసారి నిస్సత్తువ అవరించింది. ఉన్న ఒక్క ప్రాణమూ శరీరాన్నివదిలేసింది. పెద్ద మూలుగు ఫ్యాక్టరీ గోడలమధ్య నస్పహాయంగా ప్రతి ధ్వనించింది. నిలువునా ముందుకు పడిపోయేడు.

o o o

అతిధులు వెళ్ళిపోయిన తోటలోనూ జీవి వెళ్ళిపోయిన కట్టెలోనూ విశ్శబ్దం మిగిలింది.

ం ం ం

కొల్ స్టోరేజిలో వాతావరణం నెమందిగా వేడెకకుసాగింది.
ఐస్ కరిగి, బొట్లుబొట్లుగా నీరు క్రిందికి పడుతోంది
రొయ్యలు క్రవ క్రమంగా సల్లబడ్తున్నాయి.

ం ం ల

హోరున కురుస్తోంది వర్షం.
అద్దాల్లోంచి బేటకి చూస్తూ కూర్చునాడు చైతన్య.
అతడికి వర్షం అచే ఎలర్జీ. మారుమూల గుండెంలో ఎక్కడో భయంకూడా.

ప్రొద్దున్నుంచీ ఎడతెరిపిలేకుండా కురుస్తోంది.

'నిన్నే యిలా జరిగివుంటే ప్రోగ్రాం అంతా అప్ సెట్ అయి వుండేది. అనుకొన్నాడు.

అతడి మనసంతా సంతృప్తిగా వుంది. ఎంతో రిలీఫ్‌గా ఫీలవు తున్నాడు. కాంట్రాక్ట్ పూర్తవుతున్నందుకు కాదు. క్రితం రోజు ఏర్పాట్లు బాగా జరిగినందుకూ కాదు. కిరణ్మయి, రవిల మధ్య పెరుగు తున్న అనుబంధాన్ని అతడు క్రితం రోజు పార్టీలో గుర్తించేడు. శారద, కిరణ్మయిలని తీసుకొచ్చేదన్న మాటేగానీ, అప్పటి వరకూ వాళ్ళిద్దరి భవిష్యత్తూ అతడికి ఒక సమస్యగానే వుంది. అది ఇంత సులభంగా తీరి బంధుత్వంగా మారుతుందని అనుకోలేదు అతడు.

రవికి కూడా పరీక్షలయిపోయేయి. తప్పక ప్యాసవుతాడు. తరువాత ఈ విషయాల్లో సగం బాధ్యతలు అతడు తీసుకొంటే అంతకన్నా కావల్సిందేముంది?

అతని సంతోషానికి ఇంకో కారణం కూడా వుంది.

అంతకు నాల్గురోజుల క్రితమే వచ్చి వెళ్ళిన దీపక్ కూడా వచ్చే వేసవిలోనే పెళ్ళికి సుముఖత వ్యక్తపరిచేడు. రెండు పెళ్ళిళ్ళూ ఒకేసారి చేసేయ్యొచ్చు

చైతన్య ఆలోచనల్లో వుండగానే కాంతివచ్చి వైజాగ్ నుంచి ట్రంకాల్ వచ్చిందని చెప్పింది.

"ఏమిటి విశేషాలు?" అడిగేడు ఫోన్లో.

పదిరోజుల్నించీ ష్రింప్స్ జాడేలేదనీ, బెస్తలు ఖాళీ చేతుల్తో తిరిగొస్తున్నారనీ అవతల్నుంచీ జవాబొచ్చింది.

"నెవర్ మైండ్, వేన్ తీసుకొని కాకినాడ వచ్చెయ్యండి. అక్కడ పరిస్థితి చూసుకొని డైరెక్ట్‌గా ఇక్కడికి వచ్చేయ్యండి."

బిజినెస్ మేన్‌గా అతడికి ఈ వార్త సంతోషాన్నే యిచ్చింది. ఎందుకంటే అంతకు రెండు రోజుల క్రితమే అతడు జపాన్ నుంచి వచ్చిన ప్రతినిధుల్తో 'టెక్డీ' వెళ్ళినప్పుడు తెలిసింది_కొచ్చిన్ ప్రాంతపు సముద్రతీరాల్లో వలవేసిన వాడిది ఆలస్యం, నేల యీనినట్లు రొయ్యలు దొరుకుతున్నాయని!

ఈ దెబ్బతో చాలా మంది మధ్యతరగతి పారిశ్రామిక వేత్తలు విపరీతంగా నష్టపోతారు.

సముద్రంలో అంత లీనంగా వుండే జల ప్రవాహాలతో పాటు రొయ్యలు కూడా ఒం తీర ప్రదేశాన్నుంచీ మరో ప్రదేశానికి వలసపోతూ వుంటాయి, కాల ప్రవాహంలో మనుష్యుల్లాగా!

మొట్ట మొదట వచ్చిన బెస్తవాడి సరుకుని గమనించి రాబోయే వాళ్ళ క్వాలిటి నిర్ణయించ గలిగిన వాడే ఈ బిజినెస్‌లో పైకొస్తాడు.

చైతన్య ఇంకో ఫోన్ చేసి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పేడు మేనేజర్‌కి.

బైట కారిడార్‌లో టేబిల్ టెన్నిస్ బాల్ శబ్దం లయబద్దంగా విని పిస్తోంది వర్షం తగ్గింది.

కాంతి టీ తీసుకొచ్చి యిచ్చింది.

తాగి బట్టలు వేసుకొని బయల్దేరబోతూ వుంటే "ఎక్కడికి?" అడిగింది.

"ఫ్యాక్టరీకి వెళ్ళొస్తాను."

"ఇంత రాత్రప్పుడు దేనికి. రేప్పొద్దున్నే వెళ్ళవచ్చుగా."

చైతన్య తల అడ్డంగా వూపి, "ఫ్యాక్టరీలో పనివాళ్ళందరూ వున్నప్పుడు యజమాని అప్రమత్తతగా ఉన్నా ఫర్వాలేదు. తన వ్యాపారాన్ని స్వయంగా తను చూసుకోలేనివాడు యజమానిగా పనికిరాడు.—" అని కారు గరాజీ వైపు నడిచాడు.

వర్షానికి తడిసిన మట్టిరోడ్డుమీంచి అదోలాటి మత్తువాసన వస్తోంది. రోడ్డు నిర్మానుష్యంగా ఉంది.

రోడ్డుకిరువేపులా వున్న పిచ్చిమొక్కలు గాలికి నెమ్మదిగా ఊగుతున్నాయి. ఫ్యాక్టరీ ఎత్తయిన గోడలు చీకటిలో అస్పష్టంగా కన్పిస్తున్నాయి.

దూరంగా సముద్రపు హోరు వినిపిస్తోంది. ఎక్కడో కీచురాయి ఆగిఆగి అరుస్తోంది,

మెయిన్‌గేటు తీసేఉంది. కారు లోపలికివెళ్ళి ఆగింది. దిగి డోర్ వేసేడు.

తీతువుపిట్ట ఒకటి వికృతంగా అరుచుకుంటూ తలమీదనుంచి పోయింది మళ్ళీ అంతా నిశ్శబ్దం.

చుట్టూ చూసేడు.

పాడయి ఎంతోకాలం నుంచీమూలపడివున్న వేన్‌దూరంగా, ప్రహరీగోడదగ్గరగాఉంది. కిటికీపక్కనే మల్లెతీగ వర్షానికి క్రిందపడిపోయింది. శత్రురాజుల తాకిడికి పూర్వపువైభవాన్ని కోల్పోయిన కోటలాగా శిథిలంలా ఉంది ఫ్యాక్టరీ.

రెండుజేబుల్లో చేతులుపెట్టుకుని మెట్లుఎక్కాడు.

ఆ చప్పుడికి తపోభంగమైన ఋషిలా మెట్లమీదనుంచి ఓ కప్ప క్రిందికిదూకింది.

విశాలమైనగదిలో ట్రేలు వరుసగా వున్నాయి. ఆ పెద్దపెద్ద ట్రేల మధ్య ఇరుకుదారిలోంచి నడిచేడు.

ఆ నిశ్శబ్దమూ ఆ వాతావరణమూ ఏదో దారుణం జరిగిందని అతడి సిక్స్త్ సెన్స్‌కి చెబుతున్నాయి.

ట్రేలమధ్యనుంచి మలుపుతిరిగిన చైతన్య ఒక్కసారిగా నిశ్చేష్టుడయ్యాడు.

చిన్న కేక గొంతులోనే ఆగిపోయింది....

కోల్డుస్టోరేజి గదికి అడ్డంగా.... తలుపుకుసగం అటు— సగం యిటుగా రంగయ్య పడిఉన్నాడు.

ఆ నిశ్చేష్టతనుంచి తేరుకోవటానికి అరక్షణంపట్టింది.

ఒక్కగెంతులో దగ్గరగావెళ్ళి వంగి మీదచేయివేసి చూసేడు. ప్రాణంపోయి చాలాసేపయినట్లు చల్లగా తగిలింది శరీరం చప్పున చేయి వెనక్కి తీసుకున్నాడు.

చైతన్య మనసంతా ఒక్కసారి శూన్యమయినట్లయింది. రంగయ్యతో అనుబంధం ఈనాటిదికాదు. అంతాతనదయినట్టు ప్రతిపనీస్వయంగాచూసుకొనేవాడు అతడు. చివరికి ప్రాణంకూడా పనిచేస్తూనే వదిలేడు.

మరణం అనేది ఎంత విచిత్రమయింది?

చైతన్య ఆ అచేతనమైన శరీరంవేపే చూస్తున్నాడు. అతడిలోనూ కదలికలేదు. మెదడులో అస్పష్టంగా— చేపల కదలికవలె ఆలోచనలు, భావంమాత్రం శూన్యం. మనసు మొద్దుబారింది

నెమ్మదిగావంగి అతడితలను చేతులమధ్యకు తీసుకున్నాడు. రెండోచెయ్యి కాళ్ళక్రింద వేసి ఎత్తి సరిగా పడుకోబెట్టేడు. ఫోన్‌దగ్గరకువెళ్ళి ఆఫీసుకు ఫోన్‌చేసేడు.... తరువాత ఇంకో ఇద్దరుముగ్గురికి— మళ్ళీవెనక్కువెళ్ళాడు.

నిశ్శబ్దం మందంగా పరుచుకొనిఉంది.

ఫ్యాక్టరీగోడలు వెలవెలబోతున్నట్లున్నాయి.

కోల్డుస్టోరేజి తలుపు వేయబోతూ లోపలికిచూసి ఒక్కసారిగా లక్షవోల్టుల షాక్ తగిలినట్లు అలాగే నిలబడిపోయాడు.

ఐస్ పూర్తిగా కరిగి నీరు వెళ్ళిపోయినట్లుంది. రొయ్యలుపూర్తిగా వల్లబడిపోయి వున్నాయి. పై అరలలోంచి ఇంకాఒక్కోచుక్కా క్రిందకి పడుతోంది.

అతడికి తనుచూస్తున్నది కలో నిజమో అర్థంకాలేదు

అడుగు ముందుకు వేసేడు.

భరించలేని దుర్గంధం ఉక్కిరిబిక్కిరి చేసింది.

చుట్టూచూసేడు.

నాలుగువేపులా ప్యాకెట్లు వెక్కిరిస్తున్నట్టున్నాయి. మొత్తంపది హేనులక్షల రూపాయల విలువగల ప్యాకెట్లు. ఇప్పుడమ్మితే ప్లాస్టిక్ కవర్ల విలువకూడా రానిప్యాకెట్లు.

చైతన్య రేక్స్దగరగా నడిచేడు. ర్యాండమ్ శాంపిల్ లాతీసి పరీక్ష చేసేడు. ఉహుం— లాభంలేదు ఒక్కటికూడా పనికిరాదు.

పాడయిన సరుకు గురించి, ఆలోచించటంలేదు అతడు.

"ఓ పెద్దఫర్మ్ కి — అనుకున్న సమయానికి సరుకుసప్లయిచేయ లేకపోయానే అన్న బాధ, అంతే.

నెమ్మదిగా బయటకి నడిచేడు.

తలుపువెయ్యలేదు.

వేసే అవసరంకూడా లేదు.

ఖాళీ క్రేటలమధ్యనుంచి నడుస్తూ బయటకొచ్చాడు.

ముందు మెట్లమీద శక్తంతా కోల్పోయిన ట్టుకూలపడ్డాడు.

అతడి ఒంటరితనాన్ని నిశ్శబ్దంతోనూ సానుభూతితోనూ పరిశీలి స్తున్నట్టు మౌనంగాఉంది ప్రకృతి.

విశాలమయిన కాంపౌండులో అతడికారు తప్ప ఇంకేమీలేదు. కారు

అద్దంలోంచి "టాక్సీటోకెన్" కనబడుతోంది.

అది చూడగానే అతడి మెదడులో ఏదో మెరిసినట్లయింది.

ఒక్కసారిగా అతడి మొహంలో మార్పువచ్చింది.

చిన్న అనుమానం, క్షణంలో పెనుభూతమయింది.

ఒక్కగెంతులో కారులో కూర్చొని, ఇగ్నిషన్ ఆన్‌చేసి రివర్సు లోకి మార్చేడు శరీరం కంపిస్తున్నది. దవడ కండరాలు అప్రయత్నంగా బిగుసుకొన్నాయి. స్టీరింగును పట్టుకున్న చేతులు చెమటతో తడిసిపో యేయి.

వేటకాడి వింటినుంచి వెలువడిన బాణంలా సాగిపోతోందికారు. అతడికేమీ కనబడటంలేదు. ఒకటే ఆలోచన. ఒకటే అనుమానం. టర్నిం గ్సులోకూడా స్లో చేయకుండా పోనిస్తున్నాడు కారు.

గేట్లోంచి బుల్లెట్‌లా దూసుకుపోయింది కారు. కీచుమన్నశబ్దంతో బ్రేకులుపడ్డాయి. తలుపు విసురుగా తీసుకొని బయటకు గెంతేడు.

వడివడిగా ఆఫీసుగదిలోకి నడిచేడు.

నుదుటిమీద చెమట ధారాపాతంగా కారుతోంది.

టేబిల్‌మీదున్న కాగితాల్ని చిందరవందరచేస్తూ తొందర తొందర గావెతికేడు.

కావల్సిన కాగితం దొరికింది.

ఆతృతగా పరిశీలించి చూసేడు.

రక్తం పూర్తిగా ఇంకిపోయినట్లు అతడి మొహం తెల్లబడింది.

చేతుల్లోంచి కాగితం జారిపోయింది.

అతడు తన స్టాకుమీద చేసిన ఇన్సూరెన్సుకి ఆఖరితేదీ అయి పోయి అప్పటికి వారంరోజులు కావొస్తుంది.

తలుపువేసి ఉంచటానికి తీసిఉంచటానికి తేడా పదిహేనులక్షల రూపాయలు।

o o o

ఒక్కసారిగా తుఫాన్‌లా దూసుకొచ్చిన కారునీ, అందులోంచి

ఆఫీసులోకి వెళ్ళిన చైతన్యనీ చూస్తూ "అబ్బ అంతస్పీడ్‌గా డ్రైవ్‌చేయడం ఎందుకుబాబూ" అంది కాంతిమతి.

పక్కనేఉన్న కౌసల్య మాట్లాడలేదు.

ఇద్దరూ బాల్కనీలో నిలబడిఉన్నారు. కాంతిమతి మళ్ళీఏదో అన బోయేటంతలో చైతన్య బయటకి రావడం కనిపించింది. వెళ్ళేటప్పటికీ వచ్చేటప్పటికీ అతడిలో చాలా మార్పు కనిపిస్తున్నది. ఒక్కసారిగా పది సంవత్సరాలు వయసు పైబడినట్లు కనిపిస్తున్నాడతడు.

ఏదో కలలో నడుస్తున్నవాడిలా వచ్చికారులో కూర్చున్నాడు కారు కదిలింది.

"అరె- అదేమిటి. ఇంట్లోకి రాకుండావెళ్ళిపోతున్నారు?" అంది తనలోతను అనుకొంటున్నట్లు కాంతిమతి.

o o o o

తుఫానువచ్చి వెళ్ళిపోయినతరువాత ప్రశాంతత.

ఆ ప్రశాంతతలో ఏమీ మిగలలేదనే నిశ్చింత.

ఒకొక్కక్క కెరటమేవచ్చి సముద్రాన్నితాకి వెనక్కివెళ్ళిపోతోంది. ఒడ్డున కూర్చొనిఉన్నాడు చైతన్య. రాత్రి ఒంటిగంటఅయింది.

మేఘాలు విచ్చుకోవటంవల్ల వెన్నెల సముద్రంమీద ఆరేసినట్లు పడుతోంది. దూరంనుంచి ఈదురుగాలి శబ్దం శంఖంలోఊదినట్లు వినిపిసోంది.

అతడికిసమయం తెలియటంలేదు. ఎంతసేపటినుంచీ అలాకూర్చొనిఉన్నాడో అతడికేతెలియదు. అతడి మెదడులో ఆలోచనలకీ, సముద్రంలోకెరటాలకీ తేడాలేదు. అతడి కాళ్ళని కెరటాలు తడిపి వెళుతున్నాయి.

ఎదుట విశాలమైనసముద్రం. చుట్టూ ఇసుకతీరం. మధ్యలోఆవడు .... పిపీలికం లాటిమనిషి. ఎదురుగా పెద్ద ప్రహేళిక. సీమితము, సావధికము, సాంతము అయిన దేదయినా నిత్యమూ పరమమూకాద్దు,కాద్దు.

పుణ్యంమంచికూడా విడుదల కానిదే ముక్తిలేదు.

వాదనవల్ల అభిప్రాయాలు మారవు. మారేది అనుభవాలవలనే.

ప్రతివాడూ తన పూర్ణత్వంగురించి అనభిజ్ఞుడే, అందుకే ఈ అన్వేషణ.

కాంట్రడిక్షన్, ఇన్‌కొహరెన్స్— ఇవే అవిద్యాస్వరూపాలు.

అవిద్యానిరాకరణమే ముక్తి:

ముక్తి చిదానంద ప్రాప్తి::

నిష్కామ కర్మచే చిత్తము శుద్ధమైనప్పుడు ఉపనిషత్సత్యము బోధపడుతుంది.

అదే అనుభవం!

దానిభావం అమరం ::



ఏదోచప్పుడవటంతో కళ్ళువిప్పి చూసింది కాంతిమతి.

చైతన్య లోపలికి వచ్చేడు.

అతని కళ్ళు ఎర్రగాఉన్నాయి. జుట్టు నుదుటిమీదకు పడుతోంది. బట్టలు నలిగిపోయి ఉన్నాయి. మొహంవాడిపోయి పదిలంఖణాలు చేసిన వాడిలాఉన్నాడు.

కాంతిమతి కంగారుగా పక్కమీదనుంచి లేచి, "ఏమయిందండీ" అంది భర్తచెయ్యి పట్టుకొని.

చైతన్య మాట్లాడలేదు.

గదిలో చీకటిని బెడ్‌లైట్ పారద్రోలటానికి ప్రయత్నిస్తూంది. గడియారం రెండుచూపిస్తూంది.

కాంతిమతి జగ్‌లోంచి వాటర్, గాసులోపోసి అతడికి యిచ్చింది. అందుకోలేదు అతడు. ఒకటేమాట అన్నాడు. ఒకేఒక్క మాట.

"—కాంతీ.... మనంవెళ్ళిపోతున్నాం ఇక్కణ్నుంచి"

ఆమెకి అర్ధంకాలేదు. "ఎక్కడికండీ?"

అతడు తలూపుతూ "ఉహూ— నాకుతెలీదు" అన్నాడు.

ఆమె అతడివేపు అయోమయంగా చూసింది సాయంత్రమవగా బయటకువెళ్ళిన భర్త అర్ధరాత్రి దాటినతరునాత వచ్చి ఎక్కడికి వెళ్ళిపోదామంటున్నాడో ఆమెవూహకి అందటంలేదు. మాటమారుస్తూ పడుకొని కొంతసేపు విశ్రాంతి తీసుకోండి" అంది లాలనగా.

"విశ్రాంకి" జీవంలేని నవ్వునవ్వాడు. "ఇంక అంతా విశ్రాంతే కాంతీ. అందుకెపద వెళ్ళిపోదాం"

ఈసారి ఎక్కడికీ అనిఅడగలేదామె. భర్తఏదో మానసికాందో" వలో ఉన్నాడని గ్రహించి "సర్లెండి. అలాగే వెళ్ళిపోదాం రేపొద్దున్నేక అంది.

"రేపొద్దున్నా—" మళ్ళీ నవ్వేడు. "రేపొద్దున్నకల్లా మనంలేవగానే కనబడే దృశ్యంఏమిటో తెలుసాకాంతీ" అతడికంఠంలో కొద్దిగా ఆవేశం ధ్వనించింది. "మెయిన్‌హాలులో కొంతమంది అప్పులవాళ్ళు కూర్చొనిఉంటారు. కొంతమందిమొహాలు మనకెందుకు అప్పిచ్చేమా అన్నట్లు వాడిపోయిఉంటాయి. మరికొంతమంది పైకే తిడుతూఉంటారు. కొంతమంది ఇంటిని అమ్మితే ఎంతొస్తుందా అని పరీక్షగా చూస్తుంటారు.

ఇదికాంతి మనం రేపటివరకూఉంటే చూడవలసిన దృశ్యం"
అమె చప్పున దగ్గరకొచ్చి "ఏమిటండీ ఏంజరిగింది?" అంది ఆందోళనగా.

అతడు క్షణం మాట్లాడలేదు. కిటికీవూచల్ని పట్టుకొని బయటచీకట్లోకి చూస్తూ చాలాసేపు నిలబడిపోయాడు. అతడికంఠం మందంగా వినిపించసాగింది.

"ప్రతిమనిషి జీవితంలోనూ కొన్ని వీక్ మూమెంట్స్ ఉంటాయి కాంతి; అ బలహీనమైన క్షణంలో నేనుకొద్దిగా నిర్లక్ష్యంగా ప్రవర్తించేను కానీ ఆ ఒక్కక్షణపు నిర్లక్ష్యానికి నేను చెల్లించినమూల్యం ఎంతో తెలుసా కాంతి— పదిహేనులక్షలు !!

క్షణంఆగి చెప్పసాగాడు.

"ఇంకో పదిసంవత్సరాలు పోయినతరువాత ఈ సంఘటన జరిగివుంటే నిలదొక్కుకొనేవాణ్నేమోకానీ ఇప్పుడుమాత్రం లాభంలేదు— స్థిరాస్థి, చరాస్థి అన్నీ కలిపినాఆరేడులక్షలకన్నా ఎక్కువలేవే—ఎలా— ఎలా— కాంతి రేప్రొద్దున్న అందరికీ మొహంచూపించటం?"

వెనక్కితిరిగేడు. అతడిమొహంలో ఏదో రిలీఫ్‌కనపడుతోంది ఒకనిర్ణయానికి వచ్చేసిన రిలీఫ్. ఏమీ మిగలలేదని తెలిసినతరువాత రిలీఫ్

అందుకే వెళ్ళిపోదాం కాంతీ! పూలమ్మినచోట కట్టెలమ్మలేను. ఇన్సాల్వెన్సీపెట్టినా కొంతడబ్బు మిగలవచ్చు మనకి. కాని కేవలం నా మీద నమ్మకంతో నాకప్పిచ్చినవాళ్ళని నేను ద్రోహంచేయలేను. నా ఆఖరి పైసాకూడా వాళ్ళవి ఉంచుకోనీ. నా దురదృష్టానికి వాళ్ళు ఎందుకుబాధ్యులుకావాలి? ఈ వార్త దావాలనంలా వ్యాపించకముందే మనం ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి— పద "

ఆమెకి కొద్దికొద్దిగా ఏదో అర్థమయింది. కానీ అదికూడా అస్పష్టంగానేవుండటంతో "అసలేం జరిగిందండీ" అనిఅడిగింది. అతడు జరి

గిందంతా చెప్పేడు. రంగయ్య మరణంగురించి ఆమెకి రాత్రేతెలిసింది. కానీ, ఆ మరణం తనజీవితగతినే మార్చేస్తుందని ఆమె పూహించలేదు. అంతా పూర్తిగా అర్థమయ్యేసరికి ఆమెకి కాళ్లూ చేతులూ ఆడలేదు. అవ ఉతను విన్నదంతా కలా నిజమా? అన్నభ్రాంతిలో పడిపోయింది.

ఆమె తెప్పరిల్లి పక్కకి తిరిగేసరికి చైతన్య బాబుని ఎత్తుకొని భుజానవేసుకొన్నాడు. ఆమె చప్పున అతడిచేయి పట్టుకుని "ఈ అర్ధ రాత్రిపూటా?" అంది!

"రేప్రొద్దున్న అయినా కట్టుబట్టలతో ఇలా వెళ్ళిపోవలసినవాళ్ళ మేగా కాంతీ"

ఆమె దుఃఖం కట్టలుతెంచుకొనేలా వుంది. ఆ అర్ధరాత్రిపూట ఆమెకు నిద్రాభంగం కలిగించిన ఇంతపెద్ద చేదు నిజాన్నిఅమె అంత తొందరగా జీర్ణించుకోలేకపోతోంది. ఎండ కన్నెరగనిబాబు, కష్టంఅంటే ఏమిటో తెలియని తమ- నలుగురికి ఆజ్ఞలిచ్చి పనిచేయించగల భర్త- ఎక్కడికి వెళ్తారు? ఈ అర్ధరాత్రి తుఫానులో ఏ నీడని నమ్ముకొని బయ టకు అడుగుపెడతారు?

అతణ్ని వారించుతూ, "ఏమయితే అదవుతుంది. ఇక్కడేవుండిపో దామండీ" అంది అభ్యర్ధనగా.

చైతన్య భార్యవేపు సూటిగా చూసేడు. అతడికళ్ళలో ఏదోచిత్ర మైన భావం అరక్షణంపాటు లీలగ కదిలింది. "నువ్వు— నువ్వు నామా టకి ఎదురుచెప్పటం ఇదే మొదటిసారి కదూ?" అన్నాడు.

ఆమె దెబ్బతిన్నట్లు చూసి తలవంచుకొని, హీనమైన స్వరంతో "అబ్బే- లేదండీ.... ఎదురుచెప్పటంకాదు.... మీ ఇష్టప్రకారమే కానివ్వండి" అంది.

అన్నాక లోపలికెళ్ళి అరనిముషంలో బయటకివచ్చి, "పదండి" అంది. అతడు అప్పటికే బాబునుఎత్తుకుని వున్నాడు. ఇద్దరూ బయటికొచ్చేరు.

అతడు ఏదో జ్ఞాపకం వచ్చినవాడిరా ఆగేడు. చేతికున్న రిస్టువాచీ తీసేస్తూ భార్యకిస్తూ "లోపల పెట్టేసిరా కాంతీ, మనకి అప్పిచ్చినవాడికి ఓ వంద ఎక్కువొచ్చినా సంతోషమే" అన్నాడు. ఆమె లోపలికివెళ్ళి పెట్టేసివచ్చింది.

ఇద్దరూ మెట్లుదిగేరు.

డ్రాయింగ్‌రూమ్ నిశ్శబ్దంగాఉంది.

తలుపు చప్పుడుకాకుండా బయటకొచ్చేరు.

దారికి ఇరువేపులావున్న మొక్కలు జాలిగా వీడ్కోలుచెబుతున్నట్లుగా వూగుతున్నాయి.

కాంతిమతి నోట్లో పైటచెంగు దోపకొని ఏడుపుఆపుకొంటూ,భర్త వెనకే నెమ్మదిగానడుస్తోంది. చైతన్య భుజంమీద బాబు- జరుగుతున్నదానికి బంధంలేనట్లు నిద్రపోతున్నాడు.

దూరంగా మెరుస్తోంది.

గాలికి ఆకులుగదిలినప్పుడల్లా అశోకవృక్షం మీదనుంచి నీటి చుక్కలు పడి శబ్దం అవుతోంది.

దూరపు స్ట్రీట్‌లైట్ల కాంతిలో ఆ భవనపు గోడలమీద నిల్చినవర్షపునీటి మరకలు, ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లిన స్త్రీ చెక్కిళ్ళమీద ఆరిన కన్నీటిచారల్లా వున్నాయి.

తాముపెంచిన గులాబీల్నీ, తానంతట పెరిగిన నిద్రగన్నేరునీ దాటేరు. నిర్మించుకున్న హర్మ్యాన్ని వదిలి, పర్ణశాల నిర్మించుకోవటం కోసం అతను పయనిస్తున్నాడు.

రోడ్డుకిరువేపులా పాతిన సున్నపురాళ్ళు, శవం వెళుతున్నప్పుడు నిలబడ్డ సైనికుల్లా వున్నాయి,

ఆగి ఆఖరిసారిగా తన భవంతిని చూసుకొన్నాడు అతడు. చిక్కటిచీకట్లో శిథిలమైనకోటలా నిశ్శబ్దంగా వుందది. యుద్ధంలో సామ్రాజ్యం

కోల్పోయి తమనివీడి వెళ్ళిపోతున్న రాజునుచూసి ముక్తకంఠంతో ఆర్త గీతం ఆలపిస్తున్న ప్రజల్లా చెట్లు తలలూపుతున్నాయి.

అతడు చప్పున వెనుదిరిగి, మళ్ళీ తన ప్రయాణం కొనసాగించేడు. కొడుకు భుజంమీద ఉన్నాడు. భార్య అనుసరిస్తూంది.

చీకటి నెమ్మదిగా వాళ్ళని తనలో కలిపేసుకొంది.



ఆరున్నర అయింది.

కిచెన్‌లో కాఫీనీళ్ళు మరుగుతున్న శబ్దంవినిపిస్తూంది. మేడమీద అలికిడిలేదు.

కౌసల్య ఇక వుండబట్టలేక మేడమీదకు వెళ్ళింది.

తలుపులు బార్లా తెరిచివున్నాయి. ఎక్కడి సామాన్లు అక్కడే ఉన్నాయి. మనుష్యుల జాడమాత్రంలేదు. కంగారుగా క్రిందికి దిగివచ్చి రవికి చెప్పింది.

రవి మొదటిసారి నమ్మలేదు. కానీ స్వయంగాచూచేక అతడికి నమ్మక తప్పలేదు. అసలేంజరిగిందో అతడికీ అర్థంకాలేదు.

అంతలో గూర్ఖావచ్చి రాత్రి వాళ్ళుబయటకి వెళ్ళినసంగతి చెప్పేడు.

దాంతో అందరిలోనూ కలవరం మొదలయింది.

అంత అర్ధరాత్రి ఎవరినీ లేపకుండా, ఎవరికిచెప్పకుండా వెళ్లాల్సిన అవసరంఏముంది? అసలెక్కడికి వెళ్ళింది?

ఆరోజు ప్రొద్దున్నే రంగయ్య అంత్యక్రియలు! దానికికూడా హాజరవడా అన్నయ్య?

ఆప్రశ్నలకి సమాధానం అరగంటతర్వాత తెలిసింది అతడికి.

దాదాపు పదిహేనులక్షల విలువగల స్టాకు పూర్తిగానాశనమైపోయిందనీ, లక్షాధికారయిన అన్నయ్య ఒక్కరాత్రిలో కట్టుబట్టలతో బయటకు వెళ్ళిపోవలసిన స్థితి ఏర్పడిందనీ.

వణికిపోయేడు.

ఇంతచేదు నగ్నసత్యాల్ని జీవితంలో ఎప్పుడూ ఎదుర్కోలేదతడు అన్నయ్యపరిచిన గొడుగులోనే పెరిగిపెద్దవాడయ్యేడు యిప్పటివరకూ.

ఇప్పుడేం చెయ్యాలో తోచలేదు.

ఆస్థిలాక్కుపోవటానికి అందరూ వస్తారని అతడికి తెలుసు.

అయినా ఏమయితే అదవుతుందని ఓ నిశ్చయానికి వచ్చేడు. అంతవరకూవస్తే అప్పుడు చూసుకొందామనుకొన్నాడు. ఈలోపులో అన్నయ్యని వెదకాలి. డబ్బూ, ఆస్థీ లేకపోయినా అన్నయ్య తోడుగా ఉంటే అదో ధైర్యం. అయినా ఉన్న ఈ ఒక్కఆధారాన్నీ వదిలేసి వెళ్ళిపోతే ఎలా? ఎక్కడ తలదాచుకోనేది? ఎప్పుడో పోయేదాన్ని ఇప్పుడేవదులుకోవటం దేనికి? అంతవరకూ వచ్చేకే చూసుకొందాం.

రవి తీసుకున్న ఈనిర్ణయం అతికొద్దిరోజులలోనే గొప్పఫలితాన్ని ఇచ్చింది.

o o o

చీకటిలో రైలు దూసుకుపోతోంది.

కంపార్టుమెంటు జనంతో కిక్కిరిసివుంది కదలటానికికూడాచోటు లేదు. లావెట్రీకి పక్క, జనం నడిచేదారిలో ఓ మూలఒదిగికూర్చున్నాడు

చైతన్య. అతడి ఒడిలో బాబు నిద్రపోతున్నాడు. కాంతి అతడి భుజం మీద వాలి పడుకొంది.

అతడికి నిద్రరావటంలేదు. ముడుచుకొని కూర్చోవటంవల్ల మోకాళ్ళదగ్గర నొప్పిగాఉంది. అతడికి కొద్దిదూరంలో ఓ రైతుకూర్చొని చుట్ట కాలుస్తున్నాడు. ఆ పొగకి అతడి కడుపులో తిప్పుతోంది. ఇంకోపక్క ఓ కూరగాయలమ్మి తట్టలు పేర్చి కూర్చొంది.

కంపార్టుమెంట్ లొంచి లోపలికిగానీ బయటకుగానీ వెళ్ళటానికి దారిలేదు.

సీట్లమీద కూర్చున్నవారు నిద్రలోకి జోగుతున్నారు.

రైలుమాత్రం ముందుకు సాగిపోతూనేఉంది.

కొద్దిదూరంలో కలకల వినిపించితే చూచేడు చైతన్య. టికెట్టు కలెక్టర్ చెకింగ్‌చేసుకొంటూ వస్తున్నాడు.

"టికెట్ ప్లీజ్"

చైతన్య తన సహజస్వరంతో "లేదు" అన్నాడు. ఆ కంఠంలో కనబడిన 'కమెండ్' టికెట్ కలెక్టరుకి ఒళ్ళు మండించింది.

అతడిభుజాన్ని నొక్కిపెట్టి "ఎంతధీమాగా చెబుతున్నాడులేదని. అడుగుతున్నది నీ నౌకరు అనుకున్నావా?" అంటూ విసురుగాతోసేడు. చైతన్య వెనక్కిపడి తల తలుపుకు కొట్టుకుంది. విసురుగా లేస్తూ యూ బాస్టర్—" అకిబోయేడు. కానీ ఆ మాట బయటకిరాలేదు. దానికిముందే

"దొంగనాయాళ్ళందరూ టికెట్టు లేకుండా ఎక్కబట్టే మాలాటి వోళ్ళకి కూసునేటందుకు చోటుదొరకటంలేదు—" అంది కూరగాయలమ్మి

అతడు సిగ్గుతో కుదించుకుపోయేడు.

ఎవరికయినా ఆ అభిప్రాయం కలగటంలో తప్పులేదు. అతడిబట్ట రష్‌లో ఎక్కటంవల్లచిరిగేయి. గెడ్డంమాసిఉంది. రైలుమసికిచొక్కా నల్లగామారి వికృతంగా తయారయింది. నిద్రలేమివల్ల కళ్ళుఎర్రగా వున్నాయి.

పక్కస్టేషన్‌లో దిగిపోవాలి. తెలిసిందా-" అంటూ టికెట్టుకలెక్టర్ ముందుకు సాగిపోయాడు. మొహంలో ఏ భావమూ లేకుండా చైతన్య కూర్చొనివున్నాడు.

అతడికిది మొదటిదెబ్బ, అంతస్తుమారినవిషయం అతడికి మొదటి అనుభవాన్ని ఇచ్చింది. పాత అలవాట్లన్నీ, పాత పద్ధతుల్ని మర్చిపోవాలి ఇక.

అతడా ఆలోచనల్లో వుండగానే కాంతి"ఏమండీ" అంది. అతడు వులిక్కిపడి భార్యవైపు తిరిగేడు. ఆమె నిద్రలోంచి లేచి చాలా సేపయి నట్టుంది.

ఆమె వెంట తెచ్చుకొన్న చిన్న గుడ్డ సంచి తడుపుతూ మొహం వాడిపోగా, "అయ్యో" అంది.

"ఏమయింది" అడిగేడు.

మ్లానమైన తన వదనం అతనికి కనిపించ నివ్వకుండ తలదించుకొని "కొంచెం డబ్బూ కొన్ని నగలూ అందులో పెట్టేనండి. రష్‌లో జారి పోయినట్టున్నాయి." అంది. ఆమె ఈ మాటలంటున్నప్పుడు చైతన్య వెనక్కి జారబడి కళ్ళు మూసుకొని వున్నాడు. ఈ మాటలకి అతడి మొహంలో ఏ భావమూ కనబడలేదు. అలా కళ్ళు మూసుకొనే, "మన 'కేడీ' దక్కదని నాలుగ్గంటల క్రితమే తెలిసినా. ఇంకా దేనికోసమో పాకులాడతావేంకాంతీ?" అన్నాడు. నిర్లిప్తంగా.

"అలా మాట్లాడకండీ" అందామె రుద్ధమైన కంఠంతో.

"తప్పేముంది కాంతీ ఈ జన్మలో ఋణం వున్నవాళ్ళకోసం నేను కొంత వదిలేస్తె, క్రితం జన్మలో ఋణం వున్నవాళ్ళ కోసం నువ్వు కొంత పారేసుకొన్నావ్. అంతేగా అన్నాడు.

రైలు బిగ్గరగా కూస్తూ ఆగింది.

ఏదో చిన్న స్టేషన్.

చైతన్య, బాబుని భుజంమీద వేసుకొంటూ "పద కాంతి, దిగిపోదాం" అన్నాడు.

ఊరూపేరూ తెలీని ఆ చిన్నపల్లెలో దిగటం ఆమెకి యిష్టంలేదు. క్షణం తటపటాయించింది.

పక్కనున్న రైతు దాన్ని ఇంకోలా తీసుకొని చైతన్యతో.

"టికెట్ కలెక్టర్ అట్లాగే అంటాడు. దాన్ని పట్టుకొని దిగిపో వక్కర్లేదులే. దిగాల్సిన వూరొచ్చేవరకూ కూసో. పర్లేదు." అన్నాడు.

"దిగాల్సిన వూరేదో నిర్ణయించేది మనం కాదు" చైతన్యదిగుతూ అన్నాడు. కాంతి కూడా దిగక తప్పలేదు.

రైలు నెమ్మదిగా కదిలి, చీకట్లో అదృశ్యమైంది.

ప్లాట్ ఫారం అంతా నిర్మానుష్యంగా వుంది.

చుట్టూ చూసేడు.

చిన్నదీపం మినుక్కు మినుకుకుమంటూ వెలుగుతోంది. స్టేషన్ మాస్టరు దీపం పట్టుకుని వెళ్ళిపోయేడు.

దూరంగా ఏదో పిట్ట వికృతంగా అరుస్తోంది. స్టేషన్ బైట పెద్ద పెద్ద చెట్లు జుట్టు విరబోసుకొన్న దెయ్యాల్లా వున్నాయి.

చైతన్య స్టేషన్ మాస్టార్ గదివైపు నడిచేడు. తలుపులు వేసి వున్నాయి. లోపల్నుంచి గురక వినిపిస్తొంది.

వెనుదిరిగి భార్య దగ్గరకొచ్చేడు.

ఇద్దరూ స్టేషన్ నుంచి బైటకి వచ్చేరు.

సన్నగా తుంపర పడ్తూంది.

నిజానికిది వూరుకాదు. రైలుకొండ గుహలోంచి వెళ్ళవలసి రావటం వల్ల అక్కడ హాల్టు పెట్టేరు అదంతా చిట్టడవి వరుసగా కొండలు. చిన్న పల్లె అక్కడికి నాలుగుమైళ్ళ దూరంలో వుంది.

వర్షానికి నేలంతా చిత్తడిగా వుంది.

స్టేషన్‌కి బైట పది అడుగుల దూరంనుంచే దట్టమైన చెట్లు ప్రారంభం అయ్యేయి. నీళ్ళగుంట దగ్గర్నుంచి వినబడే కప్పలబెకబెకం శబ్దంతో కీచురాళ్ళ శబ్దం కలిసి గగుర్పాటు కలిగిస్తూంది.

చైతన్య చుట్టూ చూసేడు.

ప్రకృతి మనిషిని సవాలు చేస్తునట్టువుంది.

చెట్ల మధ్య నుంచి కాలిబాట వుండీ లేనట్టు వుంది.

ఆ సమయంలో బైట అడుగు పెట్టటం అంత మంచిది కాదను కొన్నాడు.

స్టేషన్ మాస్టరు గది పక్కనే క్రిందకి వంగిన రేకుల క్రింద కూర్చొనే చోటు దొరికింది.

భార్య చేతుల్లోంచి కొడుకుని తీసుకొంటూ "నువ్వు కొంచెంసేపు పడుకో కాంతీ." అన్నాడు.

కాంతిమతి చేతిసంచీలోంచి చీరె తీసి పక్కగా వేసింది. పడుకున్న రెండు నిముషాల్లో గాఢ నిద్రలో మునిగిపోయింది.

బాబు శరీరం కొద్దిగా వెచ్చగా వున్నట్టు తోచింది అతడికి. బెయిట చలిగాలికి అని సరిపెట్టుకున్నాడు.

కాలం నెమ్మదిగా ముందుకు సాగుతోంది.

డబ్బులేని వాడికి వచ్చే మలేరియా జ్వరంలా ఆగి ఆగి కురు స్తోంది వర్షం.

అతడికి నిద్ర రావటంలేదు. గోడకి ఆనుకొని చీకట్లోకి చూస్తూ కూర్చొన్నాడు. దూరంగా ఎక్కడో గట్టిగా వురిమింది. ఆ శబ్దానికి మేల్కొని ఏడవసాగాడు బాబు.

కాంతి ఇట్నుంచి అటు వత్తిగిల్లుతూ "ఫ్రిజ్‌లో కాడ్‌బరీస్ వుంది. కొద్దిగా పెట్టులో" అంది నిద్రలోనే. అతడికి తెరలు తెరలుగా

నవ్వొచ్చింది.

బాబుని వళ్ళోంచి తీసి, భుజంమీద వేసుకొని జోకొట్ట సాగేడు.

అతడికి యిప్పటివరకూ జరిగినదంతా కలకాదని, నిజమేనని నమ్మకం ఇప్పుడిప్పుడే కలుగుతోంది.

తూర్పున వెలుగురేఖలు నెమ్మదిగా విచ్చుకొంటూ వుండగా కాంతిలేచింది. క్షణం ఆమెకి ఏమీ అర్థంకాలేదు. చైతన్య భార్యవైపు చూసి నవ్వేడు.

ఆమె నవ్వలేదు.

అతడివైపే పరిశీలనగా చూస్తూ "మీరెలా వున్నారో తెలుసా ?" అంది.

అతడు నవ్వుతూనే "ఎలా వున్నాను" అన్నాడు.

"పదిరోజులు సముద్రం మీద పని చేసి వచ్చిన బెస్తవాడిలా___"

బాబుని ఆమెకు అందిస్తూ, "ముందు ముందు ఆ పనే చెయ్యాలేమో" అన్నాడు. ఆమె యీ పరిహాసాన్ని ఆనందించే స్థితిలో లేదు. భర్తచేసిన అనౌచిత్యపు పని తాలూకు ఫలితాలు ఒక్కటొక్కటే కన బడుతున్నకొద్దీ ఆమెకు కోపం, విసుగూ ఎక్కువ అవసాగేయి. దానికి తోడు అంధకారమైన భవిష్యత్తు.

చైతన్య చెట్టునుంచి పుల్లవిరిచి, "ఇదే బ్రష్.... పేస్ట్‌లేదు సారీ" అన్నాడు.

అతడు యీ పరిస్థితిని తేలిగ్గా తీసుకొవటానికి మానసింగా తయారవుతూ, ఆమెని తయారు చేస్తున్నాడు.

దూరంగా ఏదో గూడ్స్‌బండి వస్తోంది. ఒక పోర్టర్ జండా పట్టుకుని దూరంగా వెళ్తున్నాడు. ప్లాట్‌ఫారం అంతా ఖాళీగావుంది.

బాబులేచి గుక్కపెట్టి ఏడవసాగేడు। చైతన్య చప్పున అటువెళ్ళి కొడుకుని చేతిలోకి తీసుకొన్నాడు. బాబు ఆపకుండా ఏడుస్తూనేవున్నాడు. అతడికి పిల్లల్ని ఓదార్చటం తెలీదు.

భార్యవైపు నిస్సహాయంగా చూస్తూ, "ఏం కావాల్ట వీడికి—" అన్నాడు.

ఆమె నెమ్మదిగా జవాబిచ్చింది — "పాలు''

అతడికేం చెయ్యాలో తోచలేదు. ఎలా యిప్పుడు ?'' అన్నాడు. ఆమె మాట్లాడలేదు

బాబుని ఎత్తుకొని లాలిస్తూ స్టేషన్ బయిటకి వచ్చేడు.

స్టేషన్‌కి వందగజాలదూరంలో చిన్నపాక కనిపించింది. అటువేపు వెళ్ళాడు. కొంచెందగ్గరగా వెళ్ళేసరికి అదో టీబడ్డీలా కనిపించింది. ప్రాణం లేచొచ్చింది. ఆ నిర్మానుష్యమైన అడవిలో ఆమాత్రమైనా కనిపించినందుకు సంతోషించాడు.

బల్లముందు నలభై ఏళ్ళవాడు నిలబడి 'టీ' కలువుతున్నాడు.

సాధారణంగా అక్కడ అమ్మకం ఏదీ జరగదు. స్టేషన్‌దిగేవాళ్ళు కూడా ఎవరూఉండరు. అడవిలోవున్న నాలుగయిదు పల్లెలకి రైల్లో ప్రయాణించేసే వాళ్లెవ్వరూరారు.

అంతప్రొద్దున్నే తన బడ్డీదగ్గరకొచ్చిన వాళ్ళనిచూసి వాడు ఉత్సాహంతో "రండి బన్‌ఉంది వేడివేడి టీ ఉంది—" అని ఆహ్వానించేడు.

నిజానికి చైతన్య అంతక్రితం రోజు మధ్యాహ్నంనుంచి ఏమీతినలేదు. అయినా తమదగ్గర డబ్బులేదన్న విషయం మర్చిపోలేదు అతడు. అందుకనే అతినెమ్మదయిన స్వరంతో "కొంచెం పాలుకావాలిబాబుకి—" అన్నాడు.

వాడు గ్లాసుతో పొయ్యిమీదున్నపాలు తోతీసి ఇంకో గ్లాసులో పోస్తూ "పాలయితే ఇరవై పైసలు'' అన్నాడు.

చైతన్య తల సిగ్గుతో క్రిందికి వంగిపోయింది.

"చూడుబాబూ. మా దగ్గర డబ్బులేదు" అన్నాడు అభ్యర్థిస్తున్నట్టు చప్పున చేతిని వెనక్కి తీసుకొని

"ఏమిటి— అరువుబేరమా— ప్రొద్దున్నే" అన్నాడు విసుగుతో.

చైతన్య మాట్లాడలేదు.

కాంతిమతి ప్రేక్షకురాల్లా చూస్తూంది.

బడ్డీవాడు ఏదో పనిఉన్నట్టు వెనక్కి తిరిగి నిముషంపాటు సీసాల వర్తి మళ్ళీతిరిగి ఇంకా వాళ్ళక్కడే ఉండటంచూసి, మొహం చిట్లించి "వెళ్ళండయ్యా" అన్నాడు.

చైతన్య తటపటాయిస్తూ "బాబు ఏడుస్తున్నాడు" అన్నాడు.

అర్థంలేని ఈ సమర్ధనకి వాడువిచిత్రంగాచూసి, "అయితే నన్నేం చెయ్యమంటావయ్యా బోణీబేరం అరువుపెట్టమంటావా? ఇక ఈరోజు నేను పస్తుండాల్సిందే" అన్నాడు.

బోణీ అనగానే చైతన్యకి తన బిజినెస్ గుర్తుకొచ్చింది. ఉగాది రోజున ప్రతిసంవత్సరమూ లక్షరూపాయలకి తక్కువకాకుండా ఓ కాంట్రాక్టు సంతకం చేయటం అతడికలవాటు.

బిజినెస్‌లో "సెంటిమెంటు" విలువతెలిసిన చైతన్య తనకొడుకు క్షుద్బాధ తీర్చటంకోసం బడ్డీవాడిని పాలడగలేకపోయాడు అరువుమీద

బాబు ఏడుపు ఎక్కువయింది.

ఆమె చేతులమధ్య ఆగకుండా ఏడుస్తున్నాడు. అతణ్ని సముదాయించటంకోసం అటూఇటూ చేతులమధ్య త్రిప్పుతూ హైరానాపడుతోంది ఆమె. ఆ విసురికి మంగళసూత్రం అటూఇటూ వూగుతోంది.

"ఎంత గ్లాసుపాలు?" అడిగేడు,

"ఇరవై పైసలు—"

"గ్లాసు పాలియ్యి. రెండు బన్‌లు యిచ్చి రెండుకప్పుల టీ కూడా చెయ్యి."

"డబ్బు—" అనుమానంగా చూస్తూ అడిగాడు.

"ఏం ముందుచూపిసేగాని యివ్వవా?"

ఆ కంఠంలో కనబడిన ఆజ్ఞ అతడిని కట్టిపడేసింది. చప్పునగా సెడుపాలు అందించేడు.

బాబు ఆత్రంగా తాగసాగేడు.

ఖాళీగాసు బడ్డీవాడికి అందించి, బాబు మొహం పైటకొంగుతో తుడుస్తున్న భార్యతో చైతన్య నెమ్మదిగా స్పుటంగా అన్నాడు.

నీ మంగళసూత్రం ఇవ్వు కాంతీ పాలఖరీదుగా"

మిన్ను విరిగి మీద పడ్డట్టు చలించిపోయిందామె. చివ్వున తలెత్తి ఏదో అనబోయింది. చైతన్య ఆమెనే చూస్తున్నాడు. ఆ కళ్ళలో ఏదో శక్తి.... ఆజ్ఞాపించే శక్తి!

ఆమె నెమ్మదిగా మెడలోంచి సూత్రాన్ని తీసింది. చెక్కమీద పెట్టింది.

ఏదో కలచూస్తున్నట్లు విభ్రాంతిగా నిలబడ్డషాపువాడు తేరుకొని, "ఇదేమిటీ?" అన్నాడు కంగారుగా.

"అదే మా దగ్గరున్న డబ్బు—"

భార్యతోసహా వెనుదిరుగుతూ, "ఆ రోజు తరుపతిలో దేవుడికిచ్చిన విలువుదోపిడీలో మిగిలిన మంగళసూత్రాలు. ఈరోజు 'మన' దేవుడిని రక్షించుకోవటంకోసం అవి ఇచ్చేసేమనుకో కాంతీ బాధపడకు" అన్నాడు అంతలో వెనుకనుంచి బడ్డీవాడి పిలుపు వినబడింది. ఆగి, ఏమిటన్నట్టు చూసేడు

"నేనూ మడిసినేనయ్యా. ఈ సూత్రాలు తీసుకొని ఆడదాని వుసురుపోసుకోమంటావా?"

"నీ బోణి పాడుచెయ్యటం నాకిష్టంలేదు"

"బోణిలేకుంటే పీడాబోయె—"

"నీకు ఋణపడటం నాకూ ఇష్టంలేదు."

"సాల్లేవయ్యా. పెద్ద చెప్పొచ్చావ్ నాకూ పెళ్ళాంపిల్లలున్నారు. గానుడు పాలకోసం సూత్రాల్దీసుకోమంటావా?"

"సూత్రాలుతప్ప ఇంకేమీ లేవుమరి."

ఇద్దరిలో పట్టుదలకి ఎవరూ తక్కువకాదు.

"పద కాంతీ—" అన్నాడు చైతన్య.

పది అడుగులు నడిచేరు. మళ్ళీ వెనుకనుంచి ఆగమని పిలుపు.

బడ్డీవాడు గల్లాపెట్టె తెరచి, మొత్తం అంతా పైకితీసేడు.

వాటిని పట్టుకొని పరుగెత్తుతూ వీళ్ళదగ్గరకి వచ్చేడు.

రెండు అయిదురూపాయలనోట్లు; నలిగిన పాతపదిరూపాయల నోటొకటీ మిగిలిన చిల్లర అంతా చైతన్య చేతిలోపోసేడు.

ఆశ్చర్యంగా చూసేడు చైతన్య.

"గానుడుపాలిచ్చి ఆడదాని సూత్రాలు దోచుకొన్నాడన్న పెద్ద పేరు నాకెందుకులేవయ్యా. అంతేఉన్నాయి డబ్బులు తీసికెల్లు—"

చైతన్య అతడిమాటలలోని నిజాయితీకి కదిలిపోయాడు. కళ్ళల్లో సన్నటి నీటిపొర.

అక్కణ్నుంచి సాగిపోతూ భార్యతో అన్నాడు "వ్యాపారంలోపడి బయటప్రపంచం గురించే తెలుసుకోలేదు సుమీ యిన్నాళ్ళూ"

"అంటే?"

"సాటి మనిషి అవసరంమీద ఆదుకోకుండా బ్రతకాలన్న నిజాయితీ ఇంకా మనుష్యులలో ఉందన్నమాట"

o o o

"నిజాయితీ" సేట్ చమన్‌లాల్ అన్నాడు. "నిజాయితీ ఏమిటి సాబ్. అట్ల ఆస్థంతా వదిలేసి రాత్రికిరాత్రి వెళ్ళిపోవాల్సిన అవసరం

ఏమొచ్చింది. కొంతకాలం ఆగమంటే ఆగమా మేము? తరువాతతనే విలదొక్కుకొనేవాడు కాదా ఏమిటి?''

రవి అవునన్నట్లు తలూపేడు

డ్రాయింగ్ రూములో సేట్లందరూ కూర్చున్నారు.

చమన్‌లాల్ మాట వింటుంటే అన్నయ్య ఎంత తప్పుచేశాటో అనిపిస్తోంది రవికి. అతడికి తెలీదు తనముందు కూర్చున్నవన్నీ తాచు పాములని. అందులో ఒకపాము ఇల్లంతా పరీక్షచేస్తోంది. ఇంకోపాము మొత్తం అప్పిచ్చిన వాళ్ళలిస్టునీ, ఆస్థులవిలువల్నీ లెక్కచూసి రూపాయికి ఎంతవస్తుందో అంచనా వేస్తూంది. అనుమానం ఎక్కువవున్నపాము ఆ రాత్రి చైతన్య తనతో ఎంత తీసుకుపోయాడో అని అనుమాన పడుతోంది.

అప్పటికి చైతన్య అ ఇల్లువదిలి పన్నెండుగంటలు కావొస్తుంది. బిజినెస్ సర్కిల్స్‌లో యే వార్త వ్యాపించడానికయినా ఆ సమయంచాలు

"అన్నయ్యకి మీదందరూ బాగా తెల్సుగా లాల్‌సాబ్" అన్నాడు రవి "అయినా అలా ఎందుకు వెళ్ళిపోయాడో?"

'తెల్సుకాబట్టే వెళ్ళిపోయాడు.' అనుకొంది కొంచెం విజాయితీ మిగిలిఉన్నపాము.

సేట్ చమన్‌లాల్‌గొంతు సర్దుకోన్నాడు. ''రవీసాబ్" అన్నాడు. "చైతన్యగారుంటే ఇంకోలా జరిగిఉండేది. మీకా ఈ బిజినెస్‌ఏమీ తెలియదు. మా వేపునుంచికూడా ఆలోచించాలిమీరు. ఈ పరిస్థితులతో ఇట్లాగే కొంతకాలం జరిగిందంటే అసలు ధరేమీరాదు. తొందరగా అన్నీ అమ్మకానికి పెట్టాల ఏమంటారుమీ ?"

''అన్నీ అంటే—''

"మీకు తెలియంది ఏముందిసాబ్" వినమ్రతగా అన్నాడు సేట్
"స్థిరాస్తులు. చరాస్తులు"

రవి గొంతులో తడారిపోయింది

ఇదేదో అవుతుందనితెలుసు. కాని మరీ ఇంతతొందరగా అవుతుం దని అనుకోలేదు అతడు వేలంపాడేవాడు ఒక్కొక్క సామానూ పాడు తూఉంటే, తాము దూరంగానిలబడి చూసేదృశ్యాన్ని ఊహించుకొన్నాడు. శరీరం జలదరించింది.

"మా కెంతమిగులుతుంది సేట్‌జీ?" అడిగేడు.

చమన్‌లాల్ నవ్వేడు:

మునిగేవాడు గడ్డిపరకను పట్టుకొని "ఇదేమిటి" అనిఅడిగితే వద్దునఉన్నవాడు నవ్వినట్టున నవ్వాడు.

"ఇక్కడ ఉన్నవాళ్ళందరికీ — ఇచ్చినదాంట్లో సగంఅన్నావస్తుం దన్న నమ్మకంలేదు రవిగారూ అందరికీవచ్చేక ఏదయినా మిగిలితే అది మీకే:"

....అన్నయ్య రాత్రికి రాత్రి అంతాఒదిలి ఎందుకువెళ్ళిపోయాడో అర్థమైంది అతడికి.

బిజినెస్ అంటే పూలుపరిచిన పాన్పుకాదని తెలిసింది.

....ఓడలు బళ్ళవటం అంటేఏమిటో కళ్ళెదురుగా కనబడుతోంది.

వాళ్ళకింకా ఎదో నచ్చచెబుదా మనుకున్నాడు. ఎదురుకూర్చున్న వాళ్ళు ఇలాటివిషయాలలో ఢక్కామొక్కీలు తిన్నవాళ్ళనీ, తనలాటి వాళ్ళని చాలమందిని చూసేరని అతడికితెలీదు.

ఆ ఆస్తుల్ని అమ్మేచర్యని ఆపునెయ్యడానికి అతడు చేస్తున్న ప్రయత్నం ఈ విధంగా ఫలించలేదు.

ఇంకోవిధంగా ఫలించితిది.

అతడేదో చెప్పడానికి గొంతు సవరించుకొంటూవుంటే లోపలి నుంచి ఓ కేక వినిపించింది.

అది కిరణ్మయిది.

అతడు సోఫాలోంచి ఒక్కఉదుటున లేచి లోపలికి పరుగెత్తాడు.

o o o

ఆ రోజు ఇంటిలో ఎవ్వరికీ భోజనాలు లేవు.

అందరిమనసులూ కలతబారివున్నాయి.

కౌసల్యని పట్టుకోవటం ఎవరితరమూకాలేదు. అందులోనూ ఆమెకి పెద్దన్నయ్యపట్లవున్న చనువుఇంకెవరితోనూలేదు.

శారద సంగతి సరేసరి.

అందరిలోకి బింకంగా వున్నది కిరణ్మయే.

పేదతనంవల్ల భయంలేదామెకు. మొగవారెవరూ తోడులేకుండానే ఆమె కష్టాలనెదుర్కొంది. ఇప్పుడు కొత్తగా ఆమెకి వచ్చే సమస్యలేమీ లేవు. అదికాక ఇప్పుడామెకి రవి తోడున్నాడు.

కౌసల్య రూములో కూర్చొని వుంది ఆమె. కౌసల్య తలగడలో మొహం దాచుకొని నిస్త్రాణగా పడుకొనిఉంది.

పక్కనేవున్న పేపర్ తిరగెయ్యసాగింది ఆమె.

క్రింద డ్రాయింగ్‌రూములో రవి మాట్లాడుతున్నాడు.

కిరణ్మయి పెదవులమీద ఎందుకో నవ్వుకదిలింది. లేచి తన గదిలోకి వెళ్ళింది.

ఆ గదిలో శారద కిటికీలోంచి బయటకిచూస్తోంది. ఆమెమొహం వాడిపోయివుంది. కళ్ళుపీక్కుపోయాయి.

కిరణ్మయి లోపలికి రావటంచూసి అటుతిరిగింది.

ఆమె మాత్రం శారదని గమనించకుండా తనపెట్టెదగ్గరకు వెళ్ళి విస్కీబాటిల్ తీసుకొని, ఆ గదిలోంచి నిష్క్రమించింది.

రెండు నిముషాల తరువాత ఆమె కేక ఆ భవనపు గదులమధ్య ప్రతిధ్వనించింది.

రవి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

డబ్బాలోఉన్న టిక్కెట్టు నెంబరు— పేపరులో వెదుక్కోవటానికి ఆమెకి ఎక్కువ సమయం పట్టలేదు.

మొట్టమొదటి నెంబరే అది.

ఒక బీదస్కూలు మాస్టారి కడుపునపుట్టి కష్టాలను చివరికంటా అనుభవించి, గొప్ప వాళ్ళపట్ల హీనమైనఅభిప్రాయాన్ని ఏర్పరచుకొన్న ఆ అమ్మాయి ఆమె తండ్రికున్న ఒక పాడువ్యసనాలు క్షణంలో పది లక్షలకి అధికారిణిగా మారిపోయింది.

o o o o

"ఏమయింది? ఎవరూ అరిచింది?" అడిగేడు సేట్ లోపలికి చూస్తూ.

"రవీసాబ్" గట్టిగా పిల్చేడు చమన్‌లాల్.

లోపల్నుంచి ఎవరూ పలకలేదు.

చమన్‌లాల్ సోఫాలోంచి లేవబోతూవుంటే లోపల్నుంచి రవి వచ్చేడు. అతడి మొహంలో వినూత్నమైన కాంతి కనబడుతోంది.

"ఏమైంది" అందరూ ఆతృతగా అడిగేరు.

అతడువచ్చి సోఫాలో కూర్చొని గట్టిగా వూపిరి పీల్చుకొన్నాడు. క్షణం విశ్చలంగా వుండి తరువాత అన్నాడు—

మీరు మా ఆస్థిఅమ్మి పంచుకోవాలనుకొంటే మా కభ్యంతరంలేదు

కానీ దీన్నంతా నా చేతులలో పెడితే కొద్దిరోజులలోనే మీమీ అప్పులన్నీ తీర్చేస్తానని హామీ యిస్తున్నాను" అతడి కంఠంలో ధీమా ధ్వనించింది.

"కొద్దిరోజుల్లోనా? ఎలా?" అనుమానంగా అడిగేరెవరో.

"ఈ బిజినెస్‌ని కొత్త యాజమాన్యంలోకి తీసుకురావటం ద్వారా?" అన్నాడు రవి. "యజమాని ఎవరో కాదు. నా కాబోయే భార్య కిరణ్మయి. ఆమె ఈ బిజినెస్‌ని ఎలా కొంటుందీ అన్న అనుమానం వున్నవాళ్ళు ఇదిగో— ఈ లాటరీ టిక్కెట్టునీ, ఈ రోజు పేపర్నీ పరీక్షించి చూసుకో వచ్చు—"

o o o

అయిదు నిముషాల సంప్రదింపుల తరువాత ఆ గదిలోంచి వాళ్ళు వెళ్ళిపోయారు.




ప్రస్థానం సాగిపోతోంది.

మహాసముద్రాల్లో అంతర్లీనంగా జలప్రవాహాలుంటాయని— రొయ్యలు గుంపులు గుంపులుగా ఒకచోటనుంచి ఇంకోచోటకి వలస పోతూవుంటాయనీ ముందొకచోట ప్రస్తావించటం జరిగింది. కాలం అనే ప్రవాహంలో ఈ రొయ్యల ఎక్స్‌పోర్టర్ కూడా అలాగే పయనించసాగేడు కుర్చీలో కూర్చొని పనులని నిర్వహించటం వేరు— నిలబడి పనిచేయటం వేరు అన్న విషయం అతడికి తెలియక కాదు. కానీ దాన్నిగురించి అతడు ప్రస్తుతం ఆలోచించే స్థితిలో లేడు. ఇల్లు పూర్తిగా తగలబడిపోతూవుంటే అంతా సర్వనాశనం అయిపోయిందని నిశ్చయంగా తెలిసేక, జరుగుతున్న

దాన్ని నిశ్చలంగా నిలబడి చూసే స్థితి అతడిది? ఇంకే కోర్కెలేదు. ఒక విధమైన స్తబ్దత అంతే.

అద్దాల గాజుమేడలాంటి అపురూపమైన వాతావరణంలో అతడు పెరిగాడు. అకస్మాత్తుగా అది పగిలిపోయింది. ఆశ్చర్యం ఏమిటంటే – అక్కడ్నుంచి క్రిందపడినా అతడికి బాధగాలేదు. బాధల్లా అతడితో ఏడడుగులు నడిచిన నేరానికి అతడితో కష్టాలనుభవిస్తున్న కాంతిమతిది.

భర్త ఒక బలహీనపు క్షణంలో చూపించిన నిర్లక్ష్యతే తను యీ స్థితికి కారణం అని ఆమెకి తెలుసు. కానీ దాన్ని ఆమెఎందుకో క్షమించ లేకపోతోంది

తప్పు చిన్నదా పెద్దదా అన్న విషయం– తప్పునిబట్టికాక– ఆ తప్పువల్ల ఏర్పడే పరిణామాలబట్టి వుంటుంది కాబోలు. కష్టాలు అనుభవిస్తున్నకొద్దీ అతడు చేసినతప్పు పెరిగి, పెద్దదై కళ్ళముందు విస్తృతంగా వ్యాపిస్తోంది. ఏరోజో అది అగ్నిపర్వతంలా బ్రద్దలవక తప్పదు. కష్టాలే మనిషిని సానబడ్తాయి.

కష్టాలపట్ల కాంతిమతి మానసిక స్థితి ఇలావుంటే బాబు శారీరక స్థితి యింకోలా వుంది. ఋతువుల మార్పుని శరీరం ఎలా అన్వయించుకోలేదో– ఆర్థిక స్థితిలో మార్పునీ అలానే అన్వయించుకోలేదు. వేసవిలో ఫ్రిజ్లీహీటుతోనూ– చలిలో వెచ్చని రజాయిక్రింద ప్రకృతి నెదుర్కొన్న ఆ లేత శరీరం– ఒక్కసారిగా బయటకొచ్చేసరికి తట్టుకోలేకపోయింది.

డబ్బులేక పోవటం కూడా ఒకోసారి మంచిదేమో! థర్మామీటరు వుండివుంటే బాబు శరీరం నూటనాలుగు చూపించి ఆ దురదృష్టవంతులైన దంపతుల్ని కంగారు మరింత పెట్టేది.

○ ○ ○

"శుభ్రంగా వున్నావ్. ఏదైనా పనిచేసుకోలేవ్ !"

చైతన్య నవ్వేడు. "నేనడుగుతోంది ధర్మం కాదండీ పనే-"

అవతలివ్యక్తి గతుక్కుమని "మాకే పనిలేక చస్తోంటే నీ సొద ఏమిటయ్యా, వెళ్ళువెళ్ళు...." అని కసురుకొన్నాడు.

"నా కొడుక్కి వళ్ళు జ్వరంతో కాలిపోతోంది—"

అవతలి మనిషి మొహం చిట్లించి, ప్రతివాడికీ ఇదో అలవాటయి పోయింది – చిన్నపిల్లలపేరు చెప్పి పద్యం గడుపుకోవటం." అన్నాడు.

చైతన్య మొహం అవమానంతో కందిపోయింది.

నిరాశతో అక్కణ్నుంచి కదిలేడు.

ఆలోచిస్తే వాడి తప్పేమీ కనబడలేదు. ఇలాంటి తిరస్కారాల్ని తనే అలవాటు చేసుకోవాలి.

కాళ్ళీడ్చుకొంటూ వూరి చివరికొచ్చేడు. కూలిపోవటానికి సిద్ధంగా వున్న సత్రం కప్పు క్రింద అరుగుమీద కూర్చొని కాంతిమతి భర్త కోసం ఎదురు చూస్తోంది.

"ఎలా వుంది—" అడిగేడు.

ఆమె మాట్లాడలేదు. ఆమె ఒళ్ళో పడుకొన్న బాబు వంటిమీద చెయ్యివేసి, చటుక్కున వెనక్కి తీసుకొన్నాడు. పెనంలా కాలిపోతోంది వళ్ళు.

"నేవెళ్ళినప్పటినుంచి యిలానే వుందా ?"

ఆమె తలూపింది.

చైతన్య చూసేడు. ఒక మూల ఎవరో బొంత కప్పుకొని నిద్ర పోతున్నారు. ఇంకోమూల ఇద్దరు బిచ్చగాళ్ళు వంట వండుకుంటున్నారు.

గోడలమీద బొగ్గుతో గీసిన పిచ్చిబొమ్మలు వున్నాయి. అరుగు క్రింద మొక్కలు గుబుర్లుగా పెరిగివున్నాయి.

"ప్రొద్దున్నుంచీ చెయ్యని ప్రయత్నం అంటూలేదు. ఏం చేసినా ఏవీఁ దొరకలేదు—" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"మళ్ళీ వర్షం వచ్చేటట్టువుంది." దక్షిణం నుంచి ముసురు కొంటున్న మబ్బుల్ని చూస్తూ అన్నాడు. రెండ్రోజుల్నుంచి ఈ చల్లగాలికీ, వర్షానికీ జ్వరం వచ్చివుంటుంది."

ఆమె మాట్లాడలేదు. ఈ మౌనం అతడిని బాధ పెడ్తోంది. ఏది చేసిన దానికి తనెలో అపరాధి అవుతాడో అర్థంకాలేదు. వచ్చెయ్యటం తప్పుకాదని అతనికి తెలుసు. రాక చేసేది ఏవీఁ లేదనీ తెలుసు. కానీ ఆ నిజాన్ని ఆమెకెలా నచ్చచెప్పాలో తెలియటంలేదు.

ఈ ఆలోచనల్లో వుండగానే అతడి దృష్టి బాబు మీద పడింది. ఉలిక్కిపడ్డాడు. బాబు వణికి పోతున్నాడు. చప్పున తీసుకొని భుజంపీద వేసుకొన్నాడు,

బడ్డీ కొట్టు వాడికి భార్య మంగళసూత్రం బలవంతంగా యిచ్చినప్పుడున్న నిజాయితీ తాలూకు పట్టుదల, కొడుకు ఆరోగ్యం దగ్గర కాచ్చేసరికి, ఇవ్వటానికీ ఏవీఁ లేక సడిలిపోయింది.

డాక్టర్ ఇంటి ముందు నిలబడి తలుపు తట్టేడు.

బాగా చీకటిపడింది. వీధిదీపాలు అప్పుడే వెలిగినయ్,

"ఇవి విజిటింగ్ అవర్స్ కావు" తలుపు తీసిన డాక్టర్ అన్నాడు. అతడు బయిటకి వెళ్ళటానికి సిద్ధంగా వున్నాడు.

"చాలా జ్వరంగా వుంది డాక్టర్." చైతన్య కంఠంలో ఆదుర్దా ధ్వనించింది. భుజం మీద బాబు తోటకూర కాడలో వేలాడుతున్నాడు.

డాక్టరు పరిస్థితి గమనించేడు కన్సల్టింగ్ రూమ్‌లోకి దారితీసేడు.

అయిదు నిముషాలు పరీక్షచేసి చెప్పేడు. "—న్యూమోనియా."

చైతన్య మొహంలో ఏ భావమూలేదు.

డాక్టర్ కాగితం మీద మూడు నాలుగు పేర్లు వ్రాసి, "ఈ ఇంజె క్షనూ టాబ్లెట్లూ తీసుకురండి అర్జంట్" అన్నాడు.

చైతన్య ఆ కాగితం వైపు క్షణం చూసి నెమ్మదిగా తలెత్తేడు. "మా దగ్గర డబ్బుల్లేవు డాక్టర్‌గారూ—"

డాక్టర్ మొహంలో భావాలు వెంటనే మారిపోయేయి" అంటే.... అంటే కన్సల్టింగ్ ఫీజుకూడా లేదా ?"

"క్షమించండి డాక్టర్—" చైతన్యమాట పూర్తికాకుండానే "ఇడియెట్" అని అరిచేడు డాక్టర్.

"పెద్ద దబ్బిచ్చేవాడిలా బయటకి వెళ్ళబోయే వాణ్ని లోపలికి పిల్చుకొస్తావా — బిచ్చగాళ్ళకీ, ముష్టివాళ్ళకీ సేవ చెయ్యడానికి ఇదేం ధర్మాసుపత్రి అనుకొన్నావా ? గెటవుట్" కోపంతో అతడి మొహం ఎర్రబడింది. బయిటకి వెళ్ళాలన్న ఆత్రంలో వున్నాడు.

"మీ ఋణం తప్పకుండా తీర్చుకొంటాను డాక్టర్. ఇప్పుడు మీ దగ్గరున్న మందేదైన ఇవ్వండి. నా కొడుకుని రక్షించండి." చేతులు మలుముకొంటూ ప్రాధేయపడ్తున్నాడు. వంగి కాళ్ళు స్పృశించటానికి సిద్ధంగా వున్నాడు.

ఇలాంటి వాళ్ళని ఆ డాక్టరు చాలా మందిని చూసేడు. అతడు కదలకపోవటం చూసి, బెదిరించెడు.

"వెల్తావా ? మా సైగర్ని పిలవమన్నావా ?"

చైతన్య గుండెల్లో ఎక్కడో ఆ మాట తాకింది. వంగి బాబుని భుజాన వేసుకొన్నాడు.

ఈ గొడవకి లోపల్నుంచి డాక్టరు భార్య వచ్చింది. "ఏమయిందండీ.... ఏమిటాలస్యం ?"

ఆమెకి ఇంగ్లీషులోవివరించాడు. "కొడుకుని తీసుకొచ్చి ఎగ్జామిన్ చెయ్యమన్నాడు. వెధవపోజు ? మందులకే డబ్బులేదట. డీక్ ఫెలోస్

హ్యావ్ బిఁc మోర్ ఇంటలిజెంట్ నౌ ఎడేస్ - ఏం చూచుకొని అంత ధీమాగా లోపలికి వచ్చేడో ?"

వెళ్ళబోతున్న చైతన్య క్షణం ఆగి వెనక్కి తిరక్కుండానే జవాబిచ్చేడు. "ధీమాయే డాక్టర్ కనీసం డాక్టర్లలోనైనా మానవత్వం వుంటుందన్న ధీమా. బట్ యు హేంవ్ డిస్ట్రాయిడ్ మై ఫెయిత్ ఇన్ టోటల్ హ్యూమానిటీ ఇట్ సెల్ఫ్ లెట్ ఎలోన్ డాక్టరింగ్."

o o o

దూరంగా ఎనిమిదికొట్టేరు. 894-8133

తుంపర పడ్తూనే వుంది. VEF

కాంతిమతి వళ్ళో బాబు మూలుగు తున్నాడు.

చైతన్య ఆందోళనగా అటే చూస్తున్నాడు. టెంపరేచర్ ఎంతుందో తెలియదు దూరంగా కూర్చొన్న బిచ్చగాళ్ళ పొయ్యిలో చితుకుల మంట కొద్దిగా వెలుగుని ప్రసాదిస్తోంది.

స్తంభానికి అనుకోని ఎవడో సాధువు తత్వం పాడు కొంటున్నాడు. ACC NO. 1168

"ఊరికీ ఉత్తరాన ఊరింకోటున్నది—

ఆ ఊరికి పోయేటప్పుడు వూరకేపోవాలి మనసా...."

వచ్చేపోయే యాత్రికులకి ఆరామం సత్రంలాంటి భూమి. పని పూర్తవ్వగానే ఖాళీచెయ్యాలి. 81-9200

"ఇంకో యిద్దరు వచ్చి మరో మూల చేరేరు గోడకి అనుకొని శూన్యంలోకి చూస్తున్నాడు చైతన్య.

వంట చేసుకొంటున్న ఇద్దర్లో ఒకడు లేచి చైతన్య దగ్గరగా వచ్చేడు.

"అన్నం వండుకోలేదా—?"

చైతన్య తలెత్తి, వెంటనే దించుకొంటూ "ఉహూ" అన్నాడు.

"ఇద్దరికి సరిపడా బియ్యం ఉన్నాయి కావాలా? పావులా యివ్వాలు"

అంత వేదనలోనూ చైతన్యకి బియ్యం అమ్ముతున్నందుకు కాదు, బిచ్చగాడి దగ్గర వున్నంతయినా తన దగ్గర లేకపోయినందుకు.

"అన్నం వండుకోలేదా-:"

చైతన్య తలెత్తి, వెంటనే దించుకొంటూ "ఉహూ" అన్నాడు. "పావులాలేదు." అన్నాడు.

"బియ్యమూలేవు. పావులాలేదు పొద్దుట్నుంచీ ఎక్కడకూసున్నారేమిటి?"

చైతన్యకి ప్రశ్న అర్థంకాలేదు. తలెత్తి చూసేడు. బిచ్చగాడుదాన్ని యింకోలాఅర్థంచేసుకొని, వివరిస్తూ "సత్తెన్నారాయణ కోవెల దగ్గర కూసుంటే డబ్బులూ, కొబ్బరి చిప్పలూ దొరుకుతాయి. ఇంటింటికి తిరిగితే అన్నవూ, బియ్యవూ దొరుకుతాయి. అయినా యిద్దరున్నారుగా. ఒకళ్ళు అదీ, ఇంకోళ్ళదీ చేసుకోవచ్చు" అని సలహా యిచ్చేడు.

చైతన్య గుప్పెట్లో కాంతి చెయ్యివణికింది. అతడుతమబట్టలవైపు చూసుకొన్నాడు చిరిగీ, మాసీ- గెడ్డంపెరిగీ—— 'ఏ పనీ దొరక్కపోతే అడుక్కుతినొచ్చునన్నమాట. కనీసం ఆ అర్హతనిచ్చే ఆకారం అయినా వచ్చిందిచాలు అనుకొన్నాడు.

"మరేం చేస్తారిప్పుడు- వస్తుంటారా?"

చైతన్య మాట్లాడలేదు.

బియ్యమిస్తా వండుకోండి. రేపు బియ్యంగానీ పావులాగానీ ఇచ్చెయ్యండి'' అన్నాడు.

"గేపొద్దున్న ఇక్కడుండం"

బిచ్చగాడు ఈ సమాధానానికి తలగోక్కున్నాడు ''పెద్దసిక్కొచ్చిపడిందే నీతో" అంటూ వెళ్ళేడు.

నిముషం తరువాత ఓ చిన్న బియ్యంమూట చైతన్య ఒళ్ళో పడింది. తలెత్తిచూసేసరికి అది బిచ్చగాడు.

"తీసుకోండయ్యా. ఏమీ తిరిగియ్యక్కర్లేదులే"

"ఇదేమిటి? ఆశ్చర్యంగా అడిగేడు.

"ఆడదాన్ని నస్తుంచుతావంటయ్యా- పోపో— ఆ మూల మా కుండ వుంది. వండుకోండిపోయి—"

కళ్ళనీరు గిర్రున తిరిగింది చైతన్యకి.

ఆ ఆప్యాయతకి చలించిపోయేడు అతడు. రెండుచేతులలోనూ ఆ రెండు పిడికిళ్ళ బియ్యాన్ని భద్రంగా పట్టుకొని భార్యకందించేడు. ఆమె అందుకోలేదు.

శుష్కంగా నవ్వేడు.

"ఏమిటి ఆలోచిస్తున్నావు కాంతీ? అడుక్కొనేవాడిదగ్గర అడుక్కొనే స్థితికి జారిపోయిన నీ భర్తగురించా? డాక్టర్లో కనబడకుండా పోయిన మానవత్వం ఇక్కడ బిచ్చగాడిలో కనబడుతుందేమిటా అని? పద- వెళ్ళి కొంచెం ఎంగిలిపడు—" అన్నాడు.

అప్పటివరకూ బిగబట్టి ఆపుకొన్నఏడుపుని ఇక ఆపుకోలేక పోయింది ఆమె. ఒక్కసారిగా బావురుమని "ఇక్కడ బాబుకిలాఉంటే తిండెలా సహిస్తుందండీ" అంటూ రోదించసాగింది? ఆమె చేతినున్న మూటలోంచి తెల్లటి బియ్యపు గింజలు బాబుమీదకు జలజలా రాలాయి-కన్నీటిచుక్కలతో తడిసి.

o o o

డైనింగ్ టేబిల్ మీదున్న డెకలాం షీట్పైన పడిన నీటిచుక్కని చూపుడువేలుతో గీస్తోంది కిరణ్మయి.

టేబిల్మీద రకరకాల కూరలున్నాయి. అన్నం పొగలుగ్రక్కు తోంది. వంటమనిషి ఫ్రిజ్ తెరిచి పెరుగుగిన్నె తీసుకొచ్చి బల్లమీద పెట్టేడు.

ఆమె యిప్పేమీ గమనించే స్థితిలో లేదు. అంతలో రవి అక్కడికి వచ్చేడు.

"గుడ్ యీవెనింగ్ డియర్, ఏమిటీ టుడేస్ స్పెషల్స్" అన్నాడు. నేప్‌కిన్ తీసుకొంటూ ఆమె మాట్లాడలేదు.

ఆ మౌనాన్ని అతడు గ్రహించకుండా అన్నం వడ్డించుకోసాగేడు.

"ఏమన్నా తెలిసిందా రవీ?" ఆమె నెమ్మదిగా అడిగింది. అతడు జాగ్రత్తగా గమనించి వుంటే ఆమె మనసులో ఉవ్వెత్తుగా లేచిపడే ఆవేశాన్నీ, ఉద్వేగాన్నీ అతి కష్టంమీద ఆపుకొని మామూలుగా మాట్లాడటానికి ప్రయత్నిస్తూందని తెలిసివుండేది. కానీ అతడు అదేమీ గమనించకుండా "లేదు. ఈ రోజు కూడా ఏమీ వుత్తరాలు రాలేదు." అన్నాడు.

ఆమె చాలా కఠినమైన స్వరంతో "మనం ఒక్క ప్రకటన యివ్వగానే ఉత్తరాలు వచ్చిపడతాయనుకొన్నావా?" అంది.

అతడు తలెత్తిచూసి ఆమె మొహంలో కనబడుతున్న ఉద్వేగానికి ఆశ్చర్యపోయి, "ఎక్కడున్నా తిరిగి రమ్మని పేపర్లో ప్రకటించాము అంతకన్నా ఏం చెయ్యాలి?" అన్నాడు

"అంతకన్న ఏం చెయ్యాలా? మా గురించి కనుక్కోవటానికి మిఅన్నయ్య అదే చేసేడా?" అంది దాదాపు అరుస్తున్నట్టు.

రవికొంచెం విసుగుతో. "నా స్థానంలో నువ్వేగానీ వుంటే ఏంచేసేదానివి?" అన్నాడు.

"ఏం చేసేదానినా- ఈ యింట్లోనే వున్నకిరణ్మయి అనే పాపిష్ఠి దాని దగ్గరకి వెళ్ళేదాన్ని. 'ఒసేయ్-నువ్వు తినటానికి తిండిలేని స్థితిలో వున్నప్పుడు నిన్నురక్షించిన చైతన్య అనే మహనీయుడు ఇప్పుడు వూళ్ళు పట్టిపోయేడు. నీకున్న పది లక్షలు తగలెయ్యనా? ఒక్క లక్ష ఇవ్వు. ఇరవై మంది మనుష్యుల్ని పెట్టి వెతికిస్తాను దేశంలో వచ్చే

ప్రతి పేపర్లోనూ, వాళ్ళుదొరికే వరకూ ప్రతిరోజూ ప్రకటిస్తాను. అవి వుండేదాన్ని. అంతే కానీ ఇలా సర్వసుఖాలూ అనుభవిస్తూకూర్చుండే దాన్ని మాత్రం కాదు." దుఃఖంతో ఆమె కంఠం రుద్ధమైంది.

రవి మొహం అవమానంతో ఎర్రబరంది. "అన్నయ్యంటే నాకూ వుంది ప్రేమ. నేనేంచేతులు కట్టుకొని కూర్చోలేదు" అన్నాడు.

ఆమె ఎర్రబడినకళ్ళతో అతడి వైపు సూటిగా చూస్తూ, "చేసింది సరిపోదు" అంది ఎలా చెప్పగలవ్—?"

ఆమె విసురుగా కుర్చీలోంచి లేచి, "ఎలా చెప్పగలనా?" అంది. ఆమె పెదవులు ఆవేశంతో వణుకుతున్నాయి. చేతిలో కాగితాన్ని అతడి మీదకు విసిరి కొట్టింది. అతరువాత ఆమెకు దుఃఖం ఆపుకోవటం చేతకాలేదు. మొహాన్ని చేతుల్తో కప్పుకొని ఏడుస్తూ "అందరూ నన్నే అంటారు. నాదేముందితప్పు? నాదేముంది?" అని తల టేబిల్ కేసి కొట్టుకోసాంది.

కాగితాన్ని చేత్లోకి తీసుకొని విప్పేడు. కౌసల్యచేతి వ్రాతని సుల భంగానే గుర్తుపట్టి చదవసాగేడు.

"రవన్నయ్యా,

పెద్దన్నయ్య వెళ్ళిపోయి వారం రోజులు కావస్తూంది. ఎక్కడు న్నారో—ఏంచేస్తున్నారో—అసలు తింటున్నారో వస్తులుంటున్నారో —ఏమీతెలీదు. వాళ్ళక్కడ నానా కష్టాలూ పడ్తూవుంటే ఇక్కడ మనం హాయిగా వుండటానికి ఎందుకో నాకు మనసొప్పడంలేదు. నువ్వేమో అనంకల్పితంగా వచ్చిన ఆస్తిని రక్షించడానికి తలమునకలయ్యేవన్న లోవున్నావు. అన్నయ్యా— పెద్దన్నయ్యే లేనప్పుడు మనకీ ఆస్తీ— ఈ డబ్బాయివన్నీ ఎందుకు? నువ్వు చేసే ప్రయత్నాల్లో లోపంవుందని నేనటం లేదన్నయ్య. కానీ నేనూ నా ప్రయత్నం చేద్దామనుకొంటున్నాను అందుకే వెళ్ళిపోతున్నాను. దీపక్ని కలుపుకొని పెద్దన్నయ్యని వెతకటం మొదలు పెడ్తా. నేనడుగుతే—మనుష్యుల్ని పెటూటానికీ, డబ్బుఖర్చు

పెట్టటానికి దీపక్ వెనకాడడని నా నమ్మకం. అందుకే వెళ్తున్నాను. ఓ వంద రూపాయలు మాత్రం నీ పర్సులోవి తీసుకొన్నాను. అక్కడికి వెళ్ళగానే పంపిస్తాను— నీ చెల్లికౌసల్య" ఉత్తరం చదివి స్థాణువులా కూర్చుండి పోయేడు రవి. కౌసల్య ఏంతోకోపాన్నీ, తనమీద అసహ్యాన్నీ నొక్కిపట్టి ఈ వుత్తరం వ్రాసినట్లు చూడగానే అర్థమవుతోంది.

ఎవరిమీదో తెలియని కసి అతడి గుండెల్లోంచి ఒక్కసారిగా కట్టలు తెంచుకొని ప్రవహించింది.

"ఔను. నేను స్వార్థపరుణ్ణే గబోయే పెళ్లాంఅస్థి సంరక్షింటానికి స్వంత అన్నయ్యని మర్చిపోయిన వాణ్ణి నేను చేతగాని చవటనే, కానీ మీరంతా మేధావులుకదా లక్షఖర్చుపెట్టే వాళ్ళెకరు. స్వంతంగా వెతికి తీసుకురావటానికి పోయేవాళ్ళెకరు— మీరెవరూ నాకు ముందెందుకు సలహా యివ్వలేదు మరి? నేనెంత వెధవనో నాకు తెలియ చెబ్దామని చూస్తూ వూరుకుండిపోయేరా?" అని అరుస్తూ పిచ్చివాడిలా అతడు టెలిఫోన్ దగ్గరకెళ్ళి దీపక్‌కి ట్రంక్‌కాల్ చేయసాగేడు.



ట్రైన్ నెమ్మదిగా వెళ్తోంది.

కిటికీలోంచి బయటకుచూస్తూ కూర్చొంది కౌసల్య. ఆమె మనసంతా అస్పష్టమైన వేదనతో నిండిఉంది. మాటిమాటికీ కళ్ళు సజలమవుతున్నాయి.

కంపార్టుమెంట్ దాదాపు ఖాళీగానే వుంది. ఓ మూల వృద్ధ దంపతులు కూర్చొని వున్నారు. ఒక సీటంతా ఎవరో ముసుగు పెట్టుకొని నిద్రపోతున్నారు. ఆమె ఎదురుగా ఓ గళ్ళచొక్కా యువకుడు కూర్చొని వున్నాడు.

కౌసల్య ఇవన్నీ గమనించే స్థితిలో లేదు.

ఎప్పుడెప్పుడు తన గమ్యాన్ని చేరుకొందామా అన్న ఆత్రుతలో వుంది.

ఆమెకి రైలు ప్రయాణం కూడా కొత్తే ఎప్పుడన్నా ప్రయాణం చెయ్యవలసివస్తే అన్నయ్య కారునే వుపయోగించుకొనేది. ఒక్కసారి మాత్రం ఫస్ట్క్లాస్‌లో ప్రయాణం చేసింది ఆంతే.

"ఏక్కడికి వెళ్ళాలి మీరు" అన్నప్రశ్నకి ఆమె ఉలిక్కిపడి తలతిప్పింది.

ఎదురుగా వున్న యువకుడు అడుగుతున్నాడు.

చిన్నస్వరంతో ఆమె జవాబు చెప్పింది.

పరాయి మగవాళ్ళతో మాట్లాడటం ఆమెకి అలవాటులేదు. విధి యిలా ఆడుకోక పోయివుంటే మెత్తటి ఫోంబెడ్ మీద గులాబి మొగ్గల్లా వడుకొని నిద్రించవలసిన సమయం అది. నెత్తిమీద కొంగుతో, చెక్క బల్లమీద ఓమూల కూర్చుండి వగచే సమయం కాదు.

"బంధువులింటికా — ?" అతడు అడిగేడు.

అమెకీ ప్రశ్నకి జవాబు ఏం చెప్పాలో తెలియలేదు. అతడీ మౌనాన్ని ఇంకోలా అర్థం చేసుకొని. "ఇంట్లోంచి దెబ్బలాడి వచ్చేరా? అన్నాడు.

ఆమె బిత్తరపోయి చూసింది.

అతడు చిన్నగా నవ్వి, నేను మీ స్నేహితుణ్ని అనుకొని చెప్పండి—" అన్నాడు.

ఆమెకి తెలిసిన ప్రపంచంలో అందరూ మంచివాళ్ళే. ఈ ఆప్యాయానికి ఆమె కరిగిపోయింది. అన్ని సంగతులూ చెప్పింది.

రైలు ఏదో స్టేషన్‌లో ఆగి, మళ్ళీ బయల్దేరింది.

"చైతన్య అంటే గెడ్డం వుంటుంది కదూ" అడిగేడు.

"ఉహూ " తల అడ్డంగా వూపిందామె.

"దానికేముంది. తరువాత పెరిగి వుంటుంది——ఒకామె, చిన్న పిల్లవాడు మొత్తం ముగ్గురుకదూ—"

ఔనన్నట్టు తలూపింది.

"ఆమె పేరు ?"

"కాంతిమతి"

"ఓ" అరిచేడు అతడు. "మీ అన్నయ్యా 'కాంతీ' అని పిలుస్తూ వుండగా విన్నాను"

ఆమె మొహంలోకి ఒక్కసారిగా కాంతి వచ్చింది.

"మీరు చూసేరా ?" అంది ఆశగా ముందుకు వంగి. "ఎక్కడ—"

అతడు నవ్వేడు. "చూసేను" అన్నాడు. "మా ఊళ్ళోనే. గుడి పక్కనే మా ఇల్లు. నిన్న రాత్రి గుడి అరుగుమీదే చూసేను. మొత్తం ఇద్దరు. నాకు బాగా గుర్తు. ఒకబాబు కూడా వున్నాడు."

ఆమె ఆతృతగా "ఏదీ మీ వూరు" అని అడిగింది.

రైలు నెమ్మదిగా ఆగింది.

అతడు లేచి "ఇదే మా వూరు" అన్నాడు "రండి. మీ అన్నయ్యని కలుసుకొందురుగాని" అన్నాడు.

ఆమె అమాయకత్వం నిండిన కంఠంతో "వాళ్ళు యింకా అక్కడే వుంటారుగా" అని అడిగింది.

"లేకపోయినా ఆ చుట్టుపక్కలే వుంటారు. మీరేం కంగారు పడ

కండి, నా క్రింద చాలా మంది మనుష్యులున్నారు. పదినిముషాల్లో మీ అన్నయ్య మీ ముందుంటారు. దిగండి'' అన్నాడు.

ఆమె అతడి వెనుకే రైలు దిగింది.

అతనితోపాటు నడుస్తూ — స్టేషన్ బైటున్న దట్టమైన చీకటి కబంధ హస్తాల్లోకి పయనించింది.

అంతే.

ప్రియమైన పాఠకుడా ! తరువాత ఆమె ఏమైందో నాకు తెలీదు,

సుకుమారమూ, లాలిత్యమూ ఆభరణాలుగా, సౌఖ్యపు పరదాల మేలిముసుగులో అపురూపంగా పెరిగిన ఆ అమాయకపు యువతి, ఒక్క-పారి బయట ప్రపంచంలోకి వచ్చేసరికి పొంచివున్న మిన్నాగు కాటు. ఆ డబ్బున్న ప్రపంచంలోనే ఆమె కొనసాగివుంటే— ఆ లాలిత్యం ఆమెని విడిచిపోయేదేకాదు. ఎత్తయిన భవంతుల అంతర్భాగంలో ఎక్కడో ఎండ కన్నెరుగకుండా - భర్తముందు కూర్చొని నాజుగ్గా తమలపాకులు అందించవలసిన ఆ చేతులుఇక యిప్పుడు రాటుదేలవచ్చు! గులాబీల్ని పరిహసించే ఆ నాజూకు శరీరం మీద కొరడాల వాతలు పడ వచ్చు

తెల్లవారుఝామునే లేని, స్నానంచేసి, దేముడిని ప్రార్థించేఅలవాటుని తెల్లవారు ఝాము వరగూ మేలుకొనే అలవాటుగా ఆమె మార్చుకోవలసి రావచ్చు

ఆమె నదువుకొన్న చదువు, ఉన్నత కుటుంబంలో నుంచివచ్చిన సాంప్రదాయం. ఆమె నేర్చుకొన్న సంస్కారం, ఆమె వినయం— ఇవన్నీ కేవలం "ఒక్క డబ్బులేని కారణంగా" ఆమెకి ఎందుకూ పనికి రాకుండా పోవలసి రావొచ్చు.

వజ్రం కూడా బంగారంమధ్యే శోభిస్తుంది. విధి దాన్ని పెకలి బయటకు తీసింది.

ఇప్పుడు భవిష్యత్తు ప్రవల్లిక.

ఆమె గమ్యం ప్రహేళిక.

o o o

వర్షం తుంపరగా ఇంకా కురుస్తూనే వుంది.

సత్రం గోడలు వర్షానికి నాని చెమరుస్తున్నాయి. కూలిపోవటానికి సిద్ధంగావున్న కప్పులోంచి ఒక్కోచుక్క క్రిందకి దిగుతూ వుంది.

అక్కడున్న నలుగురూ నిశ్శబ్దంగా చూస్తున్నారు.

చూడటంతప్ప ఇంకేమీ చెయ్యటం చేతకాక చైతన్య కూడా వాళ్ళలో ఒకడయ్యాడు.

బాబు డొక్కలు ఎగిరెగిరి పడుతున్నాయి

ఇంక ఏడవటానికి ఓపికలేనట్టు కాంతిమతి నిస్త్రాణగా స్తంభానికి జారబడి వుంది.

"ఎదవ నాయాళ్ళు .... ఆళ్ళ సదువులు కాల్చనా? సంటోడికి వైద్దెం సెయ్యటానిక్కూడా డబ్బులు కావాలా? ....థూ" వూసేడు ఒకడు వాడగుడ్డం పెరిగివుంది బటలు చిరిగివున్నాయి. వళ్ళోజోలెవుంది. గుండెల్లో దగ్గుంది. హృదయంలో మానవత్వం వుంది. అందుకే అన్నాడు-
"తెల్లారితే బావుణ తొందరగా"

"తెల్లారితే ఏమైతదిరా?" అన్నాడు యింకో బిచ్చగాడు, చైతన్యకి బియ్యం యిచ్చినవాడు.

"అందరిదగర డబ్బులూ కలిపితే, అందరిదగ్గర బియ్యమూ అమ్మితే మందేరాదా సంటోడికి?"

చైతన్య కళ్ళు చెమర్చినయ్. ఊరికిదూరంగా ఓ పాడుబడిన సత్రంలో తనచుట్టూ కూర్చున్న ముగ్గురు బిచ్చగాళ్ళలో ఓ గొప్ప మానవతావాదాన్ని చూస్తున్నాడు అతడు.

దూరంగా మెరుస్తోంది.

తెల్లవారటానికి ఇంకో రెండుగంటలుంది.

'రెండుగంటలు'అనుకున్నాడు చైతన్య. 'రెండుగంటలు దాటితే-'.

కానీ అతడికి ఇంక వేచి చూడాల్సిన అవసరం లేకపోయింది.

మినుక్కు మినుక్కుమని వెలుగుతున్నదీపం ఆరిపోయింది. ఆ చిన్న శరీరం నిలబెట్టుకోవటానికి ఆఖరి నిముషంవరకూ ప్రయత్నించిన ప్రాణం కొట్టుకొని, కొట్టుకొని -ఓడిపోయి- ఆ సకల చరాచర సృష్టి స్థితిలయ కారుడిలో ఐక్యం కావటానికి వెళ్ళిపోయింది.

అది ముందు గమనించినవాడు అక్కడున్నవారిలో వృద్ధుడు. అతడిజుట్టు తెల్లగా పండిపోయింది. వళ్ళు వృద్ధాప్యంతో ముడతలుపడింది. చావుకోసం ఎదురుచూస్తున్నవాడు ఎన్నో చావుల్ని చూసినవాడు.

జ్వరంతో ఎగిరెగిరిపడే వళ్ళు నెమ్మదించగానే చైతన్య వూపిరి పీల్చుకొన్నాడు. వంటమీద చెయ్యివేసి చూసి ఉధృతం తగ్గిందనుకొన్నాడు. కానీ అతని సంతృప్తి ఎంతసేపు నిలవలేదు.

పక్కనున్న వృద్ధుడు తెల్లగుడ్డని మొహంమీదగా కప్పేడు.

చైతన్య కర్రలాగే అయ్యాడు.

అప్పటివరకూ ఆడుతూ పాడుతూ తనమధ్య తిరిగినవాడు_తనకి ఆనందాన్ని పంచియిచ్చినవాడు_ తన కంటివెలుగు - ఇకలేడన్ననిజాన్ని అతడు నమ్మలేక పోతున్నాడు. మరణం ఇంత నిశ్శబ్దంగావచ్చి మనిషిని తనతో తీసుకుపోతుందని అనుకోలేదు.

ఏడుపూ రాలేదు.

అంతకన్నా ఘోరమైనస్థితి

నిర్లిప్తత ...

అతడి మనసంతా శూన్యంగా వుంది.

విషయం అప్పుడే తెలిసినట్టుంది — కాంతిమతి గోడుగోడున ఏడుస్తోంది 'బాబూ — బాబూ' అని. అవిర్జీవమైన శరీరాన్ని కదుపుతోంది. ఆ తలని వళ్ళోకి తీసుకొని కన్నీటితో తడిపేస్తోంది. "నాయినా-బాబూ-ఒక్కసారి కళ్లుతెరవరా" -అంటోంది.

అతడు కళ్ళు మూసుకొన్నాడు.

మేఘాలమధ్యనుంచిపూవుల— రథం ఎక్కి బాబు వెళ్ళిపోతున్నాడు, తండ్రి కేసి చిరునవ్వుతో చెయ్యి వూపుతున్నాడు... బాబు !! తప్పటడుగులు వేసుకొంటూ నట్టింట్లో మొన్న మొన్నటి వంకూ తిరిగినబాబు !!! ఇంటికి రాగానే మీద వాలిపోయే బాబు——

"బాధ దకు-" ఓదారుస్తున్నాడు వృద్ధుడు.

చైతన్య కళ్ళెత్తి చూసేడు.

ఆ కళ్ళల్లో జీవంలేదు.

దేన్నీ చూడటంలేదు.

బాధ కూడా లేదు.

.... .... ....

.... .... ....

తూర్పున వెలుగురేఖలు విచ్చుకొంటున్నాయి.

"ఇలా వున్నకొద్దీ బాధ ఎక్కువౌతుంది" అన్నాడొకడు.

వృద్ధుడు అతడి భుజంమీద చెయ్యివేసి "తీసుకో" అన్నాడు.

కొడుకుని వదలానికి తల్లి వప్పుకోడం లేదు రెండుచేతులువిడదీసి బలవంతంగా వేరుచేసారు.

బాబుని ఓ చింపిచాపలోచుట్టాడు వృద్ధుడు.

చైతన్య చేతులమీదకి తీసుకున్నాడు చాపచుట్టని.

నెమ్మదిగా శ్మశానంవైపు కదిలేడు. వెనుకే నలుగురు విచ్చగాళ్ళు.

ఈ దృశ్యాన్ని చూడలేనట్టు ప్రకృతికూడా స్తంభించింది.

వర్షం ఆగింది.

పిచ్చి మొక్కల్తో, చిన్నచిన్న దిబ్బల్తో స్మశానం మనిషిని ఆహ్వానిస్తున్నట్టువుంది.

ఎండి మోడైన రావిచెట్టు క్రింద కూర్చొన్నాడు అతడు.

ఇద్దరు గొయ్యి తవ్వుతున్నారు.

అతడి పక్కనే వృద్ధుడు కూర్చొన్నాడు.

మట్టితీసి పోస్తున్న సహచరులవైపు చూస్తూ చైతన్యని అతడు ఓదార్చాడు — "బాధపడకు నాయనా! చావుకి బ్రతుక్కీ మధ్యతేడా చాలా చిన్నది. నా పెళ్ళాం కన్న ఎనిమిది మంది పిల్లల్ని నేనిట్లానే పాతిపెట్టేను. కొన్ని చచ్చేపుట్టిన మాంసం ముద్దలు. కొన్ని పుట్టినప్పుడు కదిలి, తరువాత చలనం ఆగిన ముద్దలు.... మొత్తం ఎనిమిది అది కనేది, వాళ్ళు చచ్చి వాళ్ళు—నేనేమో ఇంటునుంచి స్మశానానికీ— స్మశానం నుంచి ఇంటికి—కాలం పాములా కదిలిపోయేది. ఆఖరిసారి దాన్నే పాతి పెట్టాల్సి వచ్చింది. అంతే! స్మశానానికీ నాకూ ఋణం తీరిపోయింది. నే చచ్చినప్పుడు నేను రానక్కర్లేదుగా ఎవరో తీసుకొస్తారు. ఏముంది నాయనా ఇందులో.... బ్రతికితే మనకి దుఃఖం. చస్తే మనవాళ్ళకి దుఃఖం. బ్రతికినా చచ్చినా దుఃఖమే "

తవ్వటం పూర్తయింది.

చైతన్య బాబుని గోతిలో పడుకోబెట్టేడు.

మూసివున్న ఆ విశాలమైన నేత్రాల వైపూ. ఆ అమాయకమైన మొహంవైపూ ఆఖరిసారి చూసేడు,

"నాయనా" అన్నాడు వృద్ధుడు. "స్వర్గలోకం అంటూ వుందో లేదో మనకి తెలీదు. ఈ జీవిని అక్కడికే పంపమని దేముడిని ప్రార్థించ

టానికి మన తరఫున ఏవరూ బ్రాహ్మలు లేరు. పెట్టుకోవటానికి మన దగ్గర డబ్బూలేదు. నీ కొడుకు అదృష్టవంతుడు. వాడిగురించి ప్రార్థించ టానికి నువ్వున్నావ్. ప్రార్థించు. నీ కొడుకు ఆత్మకోసం నువ్వు ప్రార్థించు.

చైతన్య నవ్వేడు. ఆ నవ్వులో వేదాంతం వుంది. వేదన వుంది.

"మమ్మల్నొదిలి వెళ్ళిపోయిన దేముడి ఆత్మశాంతి కోసం—— నా కొడుకు శరీరాన్ని వదిలి వెళ్ళిపోయిన దేముణ్ని ఏం ప్రార్థించను తాతా!"

వంగిమట్టి తీసుకొన్నాడు.

"బాబూ" అన్నాడు.

"పరిస్థితులు బావుండి వుంటే ఎయిర్ కండిషన్డు రూముల్లో పెరిగి పెద్దవ్వాల్సిన వాడివి బాబూ నువ్వు. అది తెలిసేనేమో విన్ను వళ్ళో దాచుకొన్న పుడమితల్లివి వర్షం నీరు చల్లగా తడుపుతోంది——" గుప్పెట వదిలేడు.

తన నుంచి పుట్టిన దానివి తనలో కలుపు కోవడానికి మట్టి, పెళ్ళలు పెళ్ళలుగా గోతిలో పడుతోంది.

o o o

జాజ్ డ్రమ్మూ, గిటార్ శబ్దాల మధ్య ఎల్విస్ ప్రెస్లీ కంఠం మట్టిపెళ్ళలు విరిగి పడ్డట్టుగా వుంది.

అక్కడ రాత్రికీ పగలుకీ తేడాలేనట్టు దీపకాంతి పరచుకొని వుంది.

రంగు రంగు బల్బుల వెలుగు - రంగు రంగు ద్రవాల మీద పడి — రంగురంగులుగా విశ్లేషణం చెందుతోంది.

అక్కడ తాగిన కస్టమర్లు నేలకీ సోఫాకీ మధ్య త్రిశంకుల్లా వున్నారు. తాగని వెయిటర్లు తెల్లబటల్లో శాంతి దూతల్లా వున్నారు. గ్లాసుల్లో ద్రవం అమృతంలా వుంది. ప్లేట్లలో ముక్కలు నరకంలో వేగిన పాపుల ఖండాల్లా వున్నాయి.

"బేరర్" పిల్చేడు రవి.

"యస్ సార్" అంటూ వచ్చేడు వెయిటర్.

"ఇంకో యిద్దర్ని పిలు—"

వాడికి అర్థం కాలేదు. అలాగే నిల్చున్నాడు

"పిలూ. ఐసీ – కాల్ అనదర్ టూ—"

వెయిటర్ బెదిరిపోయి ఇంకోయిద్దర్ని పిలుచుకొచ్చేడు. ముగ్గురూ చేతులు కట్టుకొని నిలబడ్డారు.

"ఎవ్రడా నాకు దూరదృష్టి లేదన్నది ?" లేచి నిలబడబోయి, కాళ్ళు తడబడ సోఫాలో కూలబడ్డాడు. "అందుకే పిల్చేను ముగ్గుర్ని తీసుకెళ్ళి నన్ను టాక్సీలో పడెయ్యండి—"

ముగ్గురూ చేతుల మధ్య తీసుకెళ్ళి టాక్సీలో కూర్చోబెట్టేరు.

"ఎక్కడికి'' డ్రైవర్ అడిగేడు.

తెలిసిన బేరర్ అడ్రస్ చెబుతున్నాడు.

"నాక్కాబోయే ఆవిడ కొనుక్కొన్న మాఅన్నయ్య ఇంటికి—' తనలో తనే గొణుక్కొన్నాడు.

టాక్సీ కదిలి, అయిదునిముషాలు ప్రయాణం చేసి ఇంటిముందు ఆగింది.

దిగి. తూలిపడబోయి, నిలదొక్కుకొని, జేబులోంచి నోటు తీసి అందిస్తూ, "చూడు–పదేకదా" అన్నాడు.

అతడందించిన వందనోటుని చప్పునజేబులో పెట్టుకుని "పదే సార్'' అన్నాడు డ్రైవర్.

"చూడు బ్రదర్. నామీద నీకున్న పాటి నమ్మకం నా చెల్లెలికి లేకపోయింది. ఎక్కడికో వెళ్ళిపోయింది. ఏదేవైనాదే కానీ గూర్ఖావచ్చి లోపలికి తీసుకెళ్ళారు.

పైన కిటికీలోంచి ఇదంతా కిరణ్మయి చూస్తోంది.

అతడు లోపలికి వస్తోంటే క్రిందకి దిగి వచ్చింది.

"మళ్ళీ తాగొచ్చావే కదూ!"

రవి మూతపడ్తున్న కనురెప్పలు పైకెత్తి "మళ్ళీ" ఏమిటి - అక్కణ్ణుంచే" అన్నాడు.

ఛీత్కారం చేసింది ఆమె. "ఈ తాగుడు మనిషినెక్కడికి తీసుకెళ్తుందో తెలుసా?"

"స్వర్గానికి"

"ఆఁ ఆఁ- ఇలా వళ్ళు గుల్లయితే వెళ్ళాల్సింది అక్కడికే!"

"ఏం చెయ్యను" మొహం చేతులతో కప్పుకొన్నాడు. "బాధ మర్చిపోవటంకోసం తాగాలి. కానీ తాగినకొద్దీ ఈ బాధ ఎక్కువ అవు తోందే—"

ఆమె అతడి పక్కన కూర్చొని అతడి చేతిని తన చేతిలోకితీసు కొంటూ, "అందరికీ బాధగానేవుంది. కానీ దీనికి పరిష్కారం ఇదికాదే" అంది.

"మరేం చెయ్యాలి?" మత్తుగా అడిగేడు.

"మీ అన్నయ్య కనబడతారని నా మనసెందుకో చెబుతోంది. అప్పటివరకయినా మనవిధి మనాం నిర్వర్తించాలి—"

"అంటే?"

"అంటే...." అంటూ ఆమె ఏదో వివరించబోయింది.

అతడు మధ్యలోనే అందుకొని, "అంటే నీ పదిలక్షలు ఇరవై లక్షలు చెయ్యాలి అంతేగా" అన్నాడు.

ఆ మాటలు సూటిగా ఆమెకి తగిలేయి. అప్పటివరకూ విగ్ర హంతో అతడి ప్రవర్తనని సహిస్తూ వచ్చింది. ఆమె శారదలా నెమ్మ దయినది కాదు. అతడు అనవసరంగా చేసిన ఈ ఆరోపణకి దెబ్బతిన్న పులిలా రెచ్చిపోయింది.

అతడి మత్తంతా దెబ్బకి దిగిపోయేలా లాగి లెంపమీదకొట్టింది.

ం ం ం

చైతన్య రోడ్డుమీద నడుస్తున్నాడు.

అతడి పక్కనుంచి ఎన్నో రిక్షాలు, కార్లూ పోతున్నా అతడికి పట్టినట్టులేదు.

అతడేం ఆలోచిస్తున్నాడో అతడికే తెలీదు.

ఇప్పుడు అతడిని చూసినవారెవారూ గుర్తుపట్టలేరు.

రెండురోజుల్నించీ తిండిలేక కాళ్ళు తేలిపోతున్నాయి. అయినా దాన్నంతగా పట్టించుకోలేదు. భార్యసంగతే సమస్య అయింది. ఆమెకీ విన్నటినుంచీ ఏమీలేదు.

అంతకుముందు రోజు బస్టాండ్‌దగ్గర సామానులు మోసే ఒక రూపాయి దొరికింది.

కానీ అక్కడ కూలీలు తొందరలోనే బయటవాడని గ్రహించి వెళ్ళగొట్టారు.

అడుక్కోవటం ఇష్టంలేదు. కానీ భార్యా ఆకలి అతడినిగ్రహాన్ని సడలిస్తోంది. ఇంకేఏనీ దొరక్కపోతే అదే చేద్దామన్న నిశ్చయానికి నెమ్మదిగా వస్తున్నాడు.

ఈ ఆలోచనల్లో వుండగానే ఒక కారు సూటిగా అతడిమీదకు రావటం- పక్కనున్న ఎవరో చెయ్యిపట్టుకు లాగటం, క్షణంలో జరిగి పోయినయ్.

కారు దూసుకు వెళ్ళిపోయింది.

క్షణంపాటు ఇటుచూసిన జనం మళ్ళీ ఎవరిపనులలో వారు మునిగిపోయారు.

"క్రిందపడిన చైతన్యవేపు చేయి అందిస్తూ, "చావాలనిఉందా." అని అడిగాడు,

"చస్తె బ్రతికిపోయేవాడిని" అన్నాడు చైతన్య బట్టలు దులుపు కొంటూ.

చైతన్యకి చేయి అందించిన వ్యక్తికి అరవై డెభ్భై ఏళ్ళ మధ్య వయసుంటుంది. అయినా దృఢంగానే ఉన్నాడు. చూడగానే ఉత్తరదేశా నికి సంబంధించినవాడిలా కనబడుతున్నాడు.

"బ్రతకటం చావటంకోసం కాదు."

క్రిందపడ్డప్పుడు బెణికిన కాలు సరిచేసుకొంటూ "క్షణక్షణం చావ టంకంటే అదే మంచిదికదా" అన్నాడు చైతన్య.

సంభాషణంతా హిందీలోనే జరుగుతోంది.

"ఎవరు నువ్వు?" అడిగాడు ఆయన.

చైతన్య నవ్వేడు. "నాకూ ఈ ప్రశ్న యీ మధ్యేకలిగింది. దాని గురించే దీర్ఘంగా ఆలోచిస్తున్నాను."

తనముందు బికారిలా నిలబడివున్న మనిషి పైకి కనబడేటంత హీనచరితుడు కాదని ఆయనకు అనిపించింది. బట్టలెంత మాసివున్నా గెడ్డం ఎంత పెరిగివున్నా కళ్ళల్లో దీప్తి మనిషిని వర్ణించేస్తుంది.

"నీ కిక్కడ జరుగుబాటే కష్టమైతే నాతోరా' ఏం పని చెయ్య గలవు నువ్వు?"

చైతన్య మాట్లాడలేదు. ఏంపని చెయ్యగలడు తను? నిజానికి తనకేమీ చేతకాదు. ఎంత గొప్ప చేదునిజం!

"మా యింట్లో పని చెయ్యవచ్చు నా మనవళ్ళని స్కూలుకు తీసు కెళ్ళవచ్చు.... నా కారు డ్రైవర్‌గా ఉండొచ్చు..... నా...."

ఆయన మాటల్ని మధ్యలో అప్పజేసి "ఆఁ! డ్రైవింగ్ వచు నాకు" అన్నాడు.

''మరింకేం అదిచాలు" అన్నాడు.

యాదృచ్ఛికమైన ఈ సంఘటన అతడి జీవితాన్ని ఇంకోమలుపు తిప్పింది.

o o o

చైతన్యని తనతోపాటు పాట్నా తీసుకువెళ్ళిన వ్యక్తిపేరు శంకర్ లాల్. ఎడిబుల్ ఆయిల్స్‌లో ఫార్వర్డుకాంట్రాక్ట్ చేస్తూవుంటాడు. అసలా పనిమీదే ఆయన ఆంధ్రదేశానికి రావటం జరిగింది.

స్టేషన్‌కి ఆయన్ని రిసీవ్ చేసుకోవటానికి కారొచ్చింది. ఆయన తోపాటు చైతన్యా కాంతిమతీ దిగేరు.

షా ఆలీ రోడ్‌లో ఓ పోష్ బంగ్లాముందు కారాగింది.

"ఇదే మా యిల్లు" అన్నాడు శంకర్‌లాల్.

నౌఖరు పరుగెత్తుకొంటూ వచ్చేడు.

"వీళ్ళకి మన పాతడ్రైవర్ హౌస్ చూపించు." అన్నాడు.

బంగ్లాకి కొద్దిదూరంలో నౌఖర్ల క్వార్టర్లు కట్టబడిఉన్నాయి. క్వార్టర్లంటే పెద్దఏమీలేదు. ఓ పెద్దగది పక్కనే వంటిల్లు, అంతే.

''చాలు'' అన్నాడు చైతన్య యిల్లుచూసి. ''సత్రం అరుగుకన్నా ఇది బావుంది. మన స్టేటస్ కొంచెం పెరిగిందన్నమాట–" మనసారా నవ్వుకొన్నాడు.

చిత్రమేమిటంటే– అతడో బిజినెస్ మాగ్నెట్‌గా వున్నప్పుడూ ఎప్పుడూ– సీరియస్‌గానూ, గంభీరంగానూ వుండేవాడు. సర్వం కోల్పోయేసరికి అతడికి తలారా స్నానం చేసినట్టు తేలికగావుంది. ఏ బాదరబందీ లేదు. హాయిగా నవ్వగలుగుతున్నాడు. అయితే ఆ నవ్వువెనుక ఒక జీవితకాలం నేర్పిన పాఠంవుంది.

ఇద్దరి స్నానాలు పూర్తయేసమయానికి నౌకరు వచ్చి పిలుస్తున్నారని చెప్పాడు.

ముందుగార్డెన్‌లో కూర్చొని వున్నాడు శంకర్‌లాల్.

సాయంత్రం అవటంవల్ల తోటలో చెట్లమీదనుంచి వచ్చే గాలి మనసు సేదతీరుస్తోంది.

ఫౌంటెన్ పక్కనే ఇద్దరు కుర్రవాళ్ళు టెన్నిస్ బాలుతో క్రికెట్ ఆడుతున్నారు.

కాంతిమతీ చైతన్య రావటంచూసి తాతగారిదగ్గరకు పరుగెత్తుకు వచ్చారు.

"పిల్లలు నా మనవళ్ళు" అన్నాడు శంకర్‌లాల్ హిందీలో.

"నమస్తే" అన్నాడు చైతన్య చేతులు జోడించి.

"హలో" అన్నట్లు పెద్దవాడు స్టయిల్‌గా తలూపేడు.

మళ్ళీ ఇద్దరూ ఆడుకోటానికి పోయేరు.

గార్డెన్ టేబిల్‌మీదున్న డూప్లికేట్‌కారు తాళాలు తీసియిస్తూ "చాలా నీటుగా వుంచాలి కారుని. ఇలాటి విషయాలలో నేను చాలా స్ట్రిక్టుగా వుంటాను" అన్నాడు.

చైతన్య తలూపేడు.

కాంతిమతి బంగళానీ, తోటనీ, ఆడుకొనే పిల్లల్నీ చూస్తోంది.

"కారు మా అబ్బాయి పట్టుకెళ్ళినట్టున్నాడు. వస్తాడు" ఆయన మాటలు పూర్తికాకుండానే 'కాంటెస్సా' గేట్లోంచి దూసుకొచ్చి ఆగింది.

అందులోంచి ముప్పైఏళ్ళ యువకుడు దిగేడు. చేతికి వుంగరాలు మొహంలో దర్పమూ వున్నాయి.

"నా కొడుకు చంపాలాల్" అన్నాడు.

ఇంతలో అతడు దగ్గరగా వచ్చాడు.

"ఎవరు వాళ్ళు?" అడిగేడు ఇంగ్లీషులో.

"నెనే తీసుకొచ్చేను. మద్రాసీలు. ఏ వుద్యోగమూ లేకపోతే మనకెలాగూ డ్రైవర్ కావాలిగా. అందుకని"

సంభాషణంతా ఇంగ్లీషులో జరుగుతోంది.

"ఇలా అర్ధమైనవాళ్ళనీ తీసుకొచ్చి పెడితే కొంప గుల్లచేస్తారు"

"కాదు నమ్మకస్తుల్లానే ఉన్నారు"

"ముందు అందరూ అలానే కనబడతారు" అని లోపలికి వెళ్ళిపోయాడు.

శంకర్‌లాల్ తిరిగి, "కారు తీసికెళ్ళి శుభ్రంగా తుడువ్. ఈరోజు నుంచీ నువ్వు పనిలో చేరెనట్లే లెఖ్ఖ" అన్నాడు.

చైతన్య తలూపి, తాళాలు తీసుకోబోతూవుంటే ఏదో అనుమానం వచ్చినట్లు," ఏం చదువుకున్నావు నువ్వు?" అడిగేడు.

"తక్కువ చాలాతక్కువ" అని, అక్కణ్నుంచి కదిలేడుచైతన్య కాంతిమతి అతణ్ని అనుసరించింది.

పైన బాల్కనీలోంచి చంపాలాల్ వాళ్ళనే చూస్తున్నాడు.

o o o

జాయినింగ్ రిపోర్టు యిచ్చింది శారద.

ఆమె చెయ్యవలసిన పనిని వివరించేడు హెడ్‌క్లర్కు.

పోస్టు రాగానే పుస్తకంలో వ్రాయటం, నెంబరింగ్ ఇవ్వటం-ఇదీ ఆమెపని. దానికి జీతం నూట డెబ్బైఅయిదు రూపాయలు!

ఒక మనిషి మామూలుగా బ్రతకటానికి అది చాలు.

ఆమెకి ఎంతో రిలీఫ్‌గా. ఒక పెద్దబోనులోంచి తప్పించుకొన్నట్టు వుంది.

నిజంగా యీ వుద్యోగం దొరకటం తన అదృష్టం.

ఆలోచిస్తూనే పనిచేసింది.

లంచ్ అవర్లో ఎవరో ఒక కోక్లర్క్ దగ్గరకొచ్చేరు. యువకుడు. పాతికేళ్ళుంటాయి.

లంచ్ అవర్లో పనిచేస్తున్నారేమిటి?"

ఆమె తలెత్తిచూసింది.

"రండి కాఫీ తాగొద్దాం"

"కాంటీన్ ఎక్కడ?"

అతడి మొహం ఆనందంతో వెలిగిపోయింది. "ఆఫీసు కాంపౌండులోనే. రండి" అన్నాడు.

"అహఁ మీతో రావటానికికాదు. నేను వెళతానులెండి" అని తిరిగి పేపర్లు చూసుకోసాగింది.

మాడిపోయినబల్బులా మారింది అతడి మొహం. అక్కడ్నుంచి వెళ్ళిపోయేడు.

శారదకి ఆశ్చర్యంవేసింది. తనేనా అంతమాట్లాడింది- మగవాడు కనబడితే సిగ్గుతో కుంచించుకుపోయే తనకి అంతధైర్యం ఎలావచ్చింది?

ధియరీ అఫ్ ఎవల్యూషన్ గురించీ, స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్ కోసం ప్రకృతి ప్రసాదించే వరాలగురించీ ఆమెకి తెలీదు.

o o o

అప్పటికి చైతన్య బెనారస్ వెళ్ళి రెండురోజులయింది.

బిజినెస్ పనిమీద శంకర్‌లాల్ అలా వూళ్ళు తిరుగుతూవుంటాడు ఆఫీసుపని అంతా కొడుకు చూసుకొంటూవుంటాడు.

వాళ్ళు రావటానికి ఇంకో రెండురోజులు టైముంది.

కాంతిమతి వంట పూర్తిచేసింది. ఒక్కదానికే కాబట్టి పెద్ద ఆలస్యం అవలేదు.

సాయంత్రం అయిదయింది.

అవుట్ హౌస్ గుమ్మంలో నిలబడి తోటలో ఆడుకొనే పిల్లలకేసి చూడసాగింది.

అప్పటికి వాళ్ళు పనిలో చేరి రెండు నెలలయింది. శంకర్‌లాల్ రెండొందలు ఇచ్చేవాడు. కరెక్ట్‌గా ఫస్టుతారీఖు సాయంత్రానికి జీతం అందేది.

ఆమె పూర్వపు సౌందర్యం మళ్ళీ తిరిగివచ్చింది. ఏ ఆభరణాలు లేకపోయినా- ఆమెలో ఏదో ఠీవి అంతర్లీనంగా ప్రతిబింబిస్తూవుంటుంది. ఆమె శరీరచ్ఛాయ తెల్లటి తెలుపు, దానికితోడు పెద్దపెద్ద కళ్ళు.

కుర్రవాడు కొట్టిన బంతివచ్చి ఆమె కాళ్ళముందు పడింది. వంగి తీసి అందివ్వబోయింది.

"మీరెందుకు వాళ్ళు తీసుకుంటార్లెండి" హిందీలో అన్నమాటలు వినిపించినయ్. తలెత్తిచూడగానే చంపాలాల్.

ఆమె అడుగు వెనక్కివేసింది.

"మీకు హిందీ వచ్చా?" అడిగేడు.

ఆమె రాదన్నట్లు తలూపింది.

"మరెలా" తనలో తనే అనుకొంటున్నట్లు అన్నాడు.

"ఇంగ్లీషులో చెప్పండి ఫరవాలేదు" అందామె ఇంగ్లీషులో.

"మీకు ఇంగ్లీషువచ్చా" అతడికళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయ్ ఆమెకి లోలోపల కొద్దిగా గర్వం కలిగింది. ఏమనుకుంటున్నాడు ఇతడు తనగురించి? ...

కానీ అది ఎక్కువకాలం ఉండలేదు. మరి మీ ఆయనకి ఇంగ్లీషు రాదన్నాడు."

షాలిక్కిపడింది.

ఒక అబద్దాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఇంకో అబద్ధం" ఆయనకి రాదు'' అంది.

"ఓ.... లవ్ మారేజ్...." అన్నాడు.

ఆమె మాట్లాడలేదు.

"మిమ్మల్ని చూస్తుంటే డబ్బున్న కుటుంబంలో పుట్టినట్టున్నారు. చదువుకున్నారుకూడా. ఒక్క కారు డ్రైవింగ్ తప్ప ఇంకే క్వాలిఫికేషనూ లేని ఇతడి ప్రేమలో ఎలాపడ్డారు?"

ఆమె మాట్లాడలేదు.

"మీరు ఇతనితో కలసి వచ్చెయ్యటంచూసి, మీ తలిదండ్రులు చాలా దుఃఖిస్తూ వుండివుంటారు"

ఇంతలో ఇద్దరుపిల్లలూ తండ్రిదగ్గరకొచ్చి బయటకెళదామని గొడవచేయసాగారు.

"వీళ్ళకి కొంచెం తలదువ్వండి. వీళ్ళ అమ్మ రేపుగాని రాదు-" అన్నాడు. ఆమె తన యింట్లోంచి దువ్వెన తెచ్చి దువ్వేలోపులో కారు గ్యారేజీలోంచి తీసేడు.

పిల్లలిద్దరూ తండ్రి పక్కన కూర్చొన్నారు.

"మీరూ రండి" అని ఆహ్వానించేడు.

"నేనా-" అందామె ఆశ్చర్యంతో.

"అవును. వదినిముషాలలో తిరిగివచ్చేద్దాం. ఈలోపులో పిల్లలకి ఏదయినా కావల్సివుంటే కష్టం"

ఆమెకి కారు ఎక్కక తప్పలేదు.

ఎయిర్ కండిషన్డ్ రెస్టారెంట్ ముందాగంది కారు.

ఆమె గలాస్ ఎత్తి లోపలివేపు లాక్‌చేసి, తలుపు మూసింది.

అందరూ లోపలికి వెళ్ళేరు.

డిన్నర్‌కి ఆర్డరిచ్చాడు.

పియానో రికార్డు సన్నగా వినిపిస్తోంది.

గదంతా సబ్‌డ్యూట్ లైటింగ్ వ్యాపించివుంది.

అందరూ కబుర్లు చెప్పుకొంటున్నారు. నవ్వుతున్నారు. ఆనందం అంతా తమసొత్తే అన్నట్లు హాయిగావున్నారు. వీళ్ళ ప్రపంచంలో డబ్బో సమస్యకాదు. అనారోగ్యం లేదు. కసురుకోవటాలూ తిట్టుకోవటాలూలేవు. అంతా ఆనందమే.

"ఏమిటీ ఆలోచిస్తున్నారు?" డిన్నర్‌వచ్చి అయిదునిముషా లయింది," అన్నాడు. ఆమె వులిక్కిపడి నేప్‌కిన్ తీసుకొంది.

కత్తి ఫోర్కులతో ప్లేటుమీద శబ్దంచెయ్యకుండా మిక్స్డ్ నోడూల్స్ తినసాగింది. ఎంతలేతనుకొన్నా ఆత్రం కనబడుతూనేవుంది. అయిదు నిముషాల్లో డిన్నర్ పూర్తయింది.

"షల్ ఐ ఆస్క్ ఫర్ కెసెట్టా?"

"నో ఐ ప్రిఫర్ పుడ్డింగ్"

అతడికి సంతోషంగావుంది. ఆమెని చూస్తుంటే డబ్బున్న కుటుం బంలో నుంచి వచ్చినదని తెలుస్తూనేఉంది. ఒక్క చిన్నతప్పుచేసి తన వాళ్ళని వదిలిపెట్టినట్లుంది. ఆ ప్రేమ తాలూకు మత్తు ఈపాటికి పూర్తిగా ఈ వాటికి తగ్గిపోయివుంటుంది. ఏం కోల్పోయిందో చూపించాలి....

డిన్నర్ పూర్తయ్యేసరికి తొమ్మిదయింది.

కారు నెమ్మదిగా వెళ్తోంది.

కిటికీలలోంచి గాలి అలలు అలలుగా వీస్తోంది. సీట్లు మెత్తగా వున్నాయి. గారికి పైటచెంగు ఎగిరెగిరి వడుతోంది. కారులో కూర్చొని చెవిక్రిందికి జారిపోయి ఎగురుతోన్న ముంగురుల్ని మాటిమాటికీ సర్దుకో టం ఒక వింత అనుభూతి.

ఎన్నాళ్ళకి మళ్ళీ !!

పిల్లలతో కలిసి అలా వెళ్ళటం ఎంతో బావుంది.

మరునటి రోజు పిల్లలు లేకపోయినా బాగావుంది.

o o o

"ఆయితే నెలరోజుల్లో అంత స్టాకూ మాకు పంపగలనంటారు" అన్నాడు జపాన్ నుంచి వచ్చిన ప్రతినిధి'

"ఓ తప్పకుండా"

షివాజీ రీగల్ చెరో పెగ్గూ గ్లాసుల్లో పోసేడు.

"మిస్టర్ రవీ_"

"యస్-"

"మీరీ కాంట్రాక్ట్ వప్పుకోవటం చాలా బావుంది. మామూలు రేట్ కన్నా పది శాతం ఎక్కువ ఇవ్వటానికి మా కంపెనీ వప్పు కొంది"

"దట్స్ రియల్లీనైస్ అఫ్ యూ'

'ఇదిగో కాంట్రాక్ట్ ఫారం. ఫెయిల్యూర్ క్లాజ్ నలభై శాతం, పార్టీపెర్సెంట్ ఆఫ్‌ది టోటల్ కాంట్రాక్టు వేల్యూ,'

'నో ప్రాబ్లెమ్'

ఇద్దరూ సంతకాలు చేసేరు.

రాత్రి పదింటికి అతడు ఇంటికి చేరుకోనే సరికి మానేజరు అప్పుడే కిరణ్మయితో మాట్లాడి వెళ్తున్నాడు శత్రు గూఢచారిని చూసినట్లు రవి అతడిని చూసుకోంటూ లోపలికి వెళ్లేడు.

కిరణ్మయి సోఫాలో కూర్చొని వుంది.

హుషారుగా 'కిరణ్' అన్నాడు ఐదు లక్షలకి కాంట్రాక్టు సంపా దించేను,'

ఆమె మొహంలో ఆనందం కనబడలేదు. 'తెలిసింది' అంది కామ్‌గా.

'రేపట్నుంచే పని ప్రారంభించాలి.' ఉత్సాహంగా అన్నాడు.

'అక్కర్లేదు రవీ మానేజర్‌గారికి ఇప్పుడే చెప్పేను. పుస్తకాల్లో లక్షపతిక వేలు నష్టం రాసుకొమ్మని'

రవి పాలిపోయినట్లైపోయి. 'అదేం' అన్నాడు.

'నువ్వు ఈ సంస్థకి ఏ విధంగానూ ప్రతినిధివికావు అని ప్రకటించి ఈ నష్టం రాకుండా చేసుకోవచ్చు. కానీ అది నాకిష్టంలేదు. అందుకే లక్ష రూపాయలూ నష్టంపోవటానికే సిద్ధపడాల్సి వచ్చింది."

'నేను చేసే ప్రతి పనీ తప్పకుండా నష్టానికి దారి తీస్తుందన్న ప్రగాఢ విశ్వాసం మీ అందరికీ ఎందుకు కలిగిందో కాస్త చెబుతావా? ఎఱ్ఱ బడ్డ మొహంతో అడిగేడు.

'తప్పకుండా? సీజన్ కాని సమయంలో, నెల రోజుల్లో ఐదులక్షల విలువగల రొయ్యల్ని ఎలా సంపాదిద్దామనుకొన్నావు? ఏ ప్రగాఢ విశ్వాసంతో?'

o o o

"ఈ రోజు సినిమాకి వెళ్దాం" అంది కాంతిమతి.

'సరే—' అన్నాడు చైతన్య భోజనంచేస్తూ.

'ఆయన్ని కారడిగి తీసుకోండి' తింటున్న ముద్ద ఆపి, చైతన్య తలెత్తి చూసేడు అమె చెప్పుకుపోతూ వుంది. 'అలాగే ఏ హోటల్లోనో డిన్నర్ చేద్దాం కొంచంసేపు తిరిగి రావచ్చు. వెరైటీగా వుంటుంది—'

చైతన్య నవ్వేడు.

'నేను శంకర్‌లాల్ కారు డ్రైవర్ని, ఆయన స్నేహితుణ్ణికాదు.'

'పర్లేదు. అడిగితే కాదనడు.'

'సారీ. అడగను.'

'ఏం ఎందుకని?' ఆమె రెట్టించింది.

'నాకొన్ని ప్రిన్సిపుల్స్ వున్నాయి.'

'అందులో ఒకటి భార్యని బాధ పెట్టటమా—' వెటకారంగా అడిగింది.

'నేన్నిన్నేవీఁ బాధ పెట్టటంలేదు కాంతీ—నువ్వు నా బాధల్లో పాలు పంచుకొంటున్నావ్ అంతే.'

'అవును మీరు చేసిన తెలివి తక్కువ పన్ల వల్ల వచ్చిన బాధలు-'

'కాంతీ—' దెబ్బతిన్నట్లు చూసేడు 'ఏమిటి నేను చేసిన తెలివి తక్కువ పన్లు-' తాపీగ అడిగేడు.

ఆ ప్రశ్నకి ఆమెలో ఎప్పట్నుంచో అణిగివున్న అగ్ని పర్వతం బ్రద్దలయింది, పెద్దగా అరుస్తూ 'చెప్పమంటారా మీకుతెలీదా అవేమిటో అయితే చెప్తాను వినండి-" అంది 'ఏదో కొంపలు మునిగిపోయినట్లు వున్నవాళ్ళని ఉన్నట్టు లేపదీసుకొచ్చేరు చేతిలో చిల్లి కానీకూడా లేకుండా వీధిన పడేసేరు మీ అనాలోచనకి బాబుని బలిచేసేరు. కట్టుకున్న భార్యని నానా కష్టాలు పెడ్తున్నారు. ఇదంతా మీరేదో పెద్దగొప్పవాడిలా చేసేనని మురిసిపోకండి! ఏవీఁచేతకాని వాడు చేసేపని యిది. అవును. మీ కేం చేతకాదు. ఒక్కసారి అన్నంతా పోయేసరికి మీకేమీ చేతకాదనే విషయం అర్ధమయింది-ఇప్పుడు నేనేం చెయ్యను? ఇలాతల కొట్టుకొని ఏడవటం తప్ప...' హిస్టీరిక్‌గా మారిన రోదన అతణ్ణి కదిలించలేదు ఆమె నెమ్మది పడిన తరువాత అన్నాడు.

"నువ్వు చెప్పినవన్నీ నీకు ముందునుంచీ వున్న భావాలని నేననుకోవటంలేదు. కాంతి వచ్చేసేమంటే-... రావల్సి వచ్చింది. మరి అదే వ్యాపారం అంటే, బాబు మరణం నీకన్నా నన్నే ఎక్కువ కృంగ తీసింది. అయితే మనం చేసేది ఏవీఁలేదు. నీలో మనం చేస్తున్నదంతా 'తప్పు' అన్నభావం-ఇంతకాలం లేనిది-కొత్తగా ఏర్పడుతూ వున్నదంటే -మనమున్న దానికి వ్యతిరేకమైన ప్రపంచం నీ ఎదురుగా కనిపిస్తూ వుండటమే దానికి కారణం అయివుంటుందని నేననుకుంటున్నాను.

దీపం దగ్గరగా వెళ్ళకు కాంతి... ... మసి అయిపోతావు."

అతడి మాటలకి అర్థం ఆమెకి మరో రెండుసంవత్సరాల తర్వాత అర్థమయింది.

కాని అతడు మాత్రం ఆ ఉప్పెనవి తొందర్లోనే ఎదుర్కొవలసి వచ్చింది.

ం ం ం

'ఆరోజు శనివారం.

ఛాంబర్ ఆఫ్ కామర్స్ నుంచి, ఇంటికి కారు నడపుతున్నాడు చైతన్య,

వెనుక సీట్లో చంపాలాల్, మరో వర్తకుడు ఎవరో కూర్చొని మాట్లాడుకొంటున్నారు. స్టాక్ ఎక్స్చేంజి గురించి, షేర్లగురించీసంభాషణ జరుగుతోంది.

ఇద్దరికీ ఆ విషయాల్లో అంత ప్రవేశంలేదనీ. కేవలం మిడి మిడి జ్ఞానంతో, ఒకరికన్నా యింకొకరికి ఎక్కువ తెలుసనే నమ్మకం కలిగించటానికి ప్రయత్నిస్తున్నారని వాళ్ళు సంభాషణ మొదలుపెట్టిన రెండు నిముషాల్లో గ్రహించేడు చైతన్య.

"బుల్స్ మార్కెట్ కదా. ఓ పదివేల షేర్లు కొందామను కొంటున్నాను."

"దానికన్నా పార్ట్నర్‌షిప్‌లో చేరండి, ఇన్‌కంటాక్స్ తగ్గుతుంది-"

అతడికి వాళ్ళమాటలు వింటుంటే నవ్వొస్తూంది.

"ఈ డివాల్యుయేషన్‌లో బోస్టన్ కంపెనీ షేర్లు పడిపోతాయి" అంటున్నాడు ఆ వర్తకుడు.

చైతన్య సాధారణంగా ఎక్కువ మాట్లాడడు. కానీ ఆ బలహీన

మైన క్షణం అతడితో మాట్లాడించింది. అప్పటివరకు వింటున్నవాడు ఇక ఆగలేకపోయాడు.

"ఈ డివాల్యుయేషన్ మనదేశానికి, దానికీ ఎక్కడోవున్న బోస్టన్ కంపెనీకి సంబంధంలేదు." అన్నాడు వెనక్కు తిరక్కుండానే.

కార్లో ఒక్కసారిగా చాలా గాఢమైన నిశ్శబ్దం పేరుకుపోయింది.

ఆ వర్తకుడి మొహంలో రక్తంచుక్కలేదు.

చాలా సేపు మౌనంగా కూర్చుంది, తనింటి దగ్గిర దిగి పోయాడు.

ఇంటికొచ్చేక కారుదిగి తలుపు బలంగా వేస్తూ చంపాలాల్ అన్నాడు— "కారుకి ముందు సీటూ, వెనుకసీటూ పెట్టింది ఎందుకో తెలుసా ? ముందు డ్రైవర్ కూర్చోవటానికీ - వెనుక యజమానులు కూర్చోవటానికీ "

చైతన్య తలెత్తి అతడివైపు చూసేడు, పెదవులమీద అదే స్వభావసిద్ధమైన నవ్వుతో, "కాల ప్రవాహంలో వెనుకవాడు ముందుకు కొట్టుకు రావొచ్చు - అదేవిధి," అన్నాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన నౌఖరు ఈ మాటలకి కిసుక్కున నవ్వటంతో చంపాలాల్ ఆగ్రహం బట్టలేక, "మాటకిమాట చెబుతావురా ఇడియెట్" అంటూ చెంపమీద ఫెళ్ళునకొట్టేడు.

అరక్షణం తర్వాత చంపాలాల్ గులాబి తుప్పల్లో వున్నాడు. ఆ తరువాత అతడిబంతిలాంటి శరీరం గాలిలోకి ఎగిరి మల్లెతీగె కోసం తవ్విన నీళ్ళ కాలువలో పడింది.

"బాసర్దు - నాన్నరాగానే నిన్ను పనిలోంచి తీసేయించకపోతే చూడు." ఇద్దరు నౌఖర్లు లేవదీస్తున్నారు.

అభిమానం చంపుకోలేని చైతన్య అన్నాడు - "మైండ్ యువర్ థంగ్ ? నేనే వదిలేస్తున్నాను యీ వుద్యోగం—"

అరక్షణంపాటు చంపాలాల్ మొహం వెలిగింది.

అదెందుకో అయిదు నిముషాల తర్వాత చైతన్యకి తెలిసింది.

.... .... ....

బోట్ హౌస్‌లోకి వచ్చేడు.

కాంతిమతి లాంతరు వెలిగిస్తోంది.

"కాంతీ" అన్నాడు భారంగా. "ఇక్కడకూడ మన ఋణం తీరిపోయింది. పోదాంపద—"

ఆమెకీ మాటలు క్షణంపాటు అర్థంకాలేదు. అర్థంకాగానే ఆమె చటుక్కున లేచి నిలబడి, "ఏమి జరిగిందండీ" అంది—

"ఉద్యోగం వదిలేసేను."

"ఎలా ? ఏమయింది ?" ఆమె మొహం వాడిపోయింది.

"ఏమయితేనేం — ఉద్యోగం వదిలేసేను. పదపోదాం !"

"ఎక్కడికి పోతాం?" అన్నదామె. "ఏదోచిన్నకొంపా, కడుపు కింత కూడూ దొరుకుతున్నాయి. ఇక్కడ వదిలేసిపోతే—పోతే—ఒక్క సారి ఆ పాత రోజులు గుర్తు తెచ్చుకోండీ—"

"ఏం పోయినా పర్లేదు. - అభిమానాన్ని చంపుకోలేను."

"అఁ— ఇలాంటి అర్థంలేని ఆలోచనల్తోనే ఇంతవరకూ తెచ్చు కొన్నారు. ఇంకా ఎందుకు—" విసురుగా అంది.

క్షణం నిశ్శబ్దం. "కాంతీ" అతడు నెమ్మదిగా అన్నాడు. "ఆ రాత్రి మనం సర్వం కోల్పోయేమని తెలిసినప్పుడు 'ఎక్కడికైనా వెళ్ళి పోదాం' అన్నాను. వద్దనిమువ్వు వాదించావు. అప్పుడు నేనేమన్నానో తెలుసా ?- 'ఇదేమిటి కాంతీ, ఎప్పుడూ లేనిది మొట్ట మొదటిసారి నా మాటకి ఎదురు చెబుతున్నావ్'- అని. జ్ఞాపకం వుందా ?"

"ఉంది. అది మొట్టమొదటిసారి. కాని—.కానీ.... యిదే ఆఖరి సారి."

అతడికి వెయ్యివోల్టుల కరెంట్‌షాక్ తగిలి నట్టయింది.

మొదట ఈ మాట ఆమె ఏ భావంతో అన్నదో అతడికి అర్థం కాలేదు. కాని ఆమె మాత్రం ఈ మాట అనటానికి సర్వశక్తుల్నీ కూడ గట్టుకోవలసి వచ్చింది. తరతరాల సంప్రదాయాన్నీ, రక్తంలో జీర్ణించుకు పోయిన సంస్కారాన్నీ వదిలి పెట్టడం అంత సులభం కాదు—

కానీ వదలాలి. తప్పదు.

అవసరం వదిలిస్తుంది.

లేళ్ళమధ్య, సెలయేళ్ళమధ్య నిర్మించుకొన్న పర్ణశాలలో వుండే సంతృప్తికోసమేనా రావణుడి రమ్యహర్మ్యాల్ని కాదన్నది.... చెప్పు సీతా చెప్పు — రాముడితో అడివిలో ఏముందని - ప్రేమా ?— నీర సించిన ఎరాలు, కాలేనుదురూ, ఎండిననాలుకా, దాని కోసం దగాలూ, స్నేహాలూ, మనసులు విడిపోవటం - చివరకు మిగిలేదేది ? ఒక్క స్త్రీ కోసం అంత మంది వానరుల్ని బలి ఇచ్చే హక్కు నీకెవరిచ్చారు రాముడా - నలుడిమీద దమయంతి కున్న ప్రేమ గొప్పదా ? రాముడి మీద సీతకున్న ప్రేమ గొప్పదా - భావానికి భవానికో సంబంధం లేని ఆలోచన్లు....

చంపాలాల్ ఆశ చూసిన స్వర్గానికీ, చైతన్యతో వుంటున్న నరకానికీ మధ్య త్రిశంకులా ఊగుతున్న ఆ స్త్రీ — స్వర్గం అనుకొంటూ అటు జారింది. ప్రతి మనిషికీ జీవితంలో కొన్ని బలహీనమైన క్షణాలుం టాయి చైతన్య ఇన్సూరెన్స్ కాగితం గురించి మర్చిపోయిన క్షణం— కౌసల్య రైలు దిగాలని నిర్ణయించుకొన్న క్షణం— అయితే వాటి ప్రభా వం మనిషి అదృష్ట - దురదృష్టాలని బట్టి వుంటుంది. ఎవరూ రెండో దాని గురించి ఆలోచించరు. ఆ తొందర్లోనే ఆమె ఒక నిర్ణయానికివచ్చి తోళ, "ఇదే ఆఖరిసారి" అనగలిగింది.

అతనికి అర్థంకాలేదు. "అంటే" అన్నాడు.

ఈలోపున తలుపుదగ్గర చప్పుడైంది.

తల తిప్పి చూశాడు.

అక్కడ చంపాలాల్ నిలబడి వున్నాడు.

చైతన్యని చూసి పరిహాసంగా నవ్వేడు.

తన భార్యవంక చూసేడు చైతన్య.

తల పక్కకు తిప్పుకు నిలబడి వుంది ఆమె

మళ్ళీ చంపాలాల్ వైపు చూశాడు.

అతను నవ్వుతూనే వున్నాడు. 'ఆమెకిక నీ అవసరంలేదు' అన్నట్లుందా నవ్వు.

'మొరాలిటీ' కన్నా 'రియాలిటీ' గొప్పది కావచ్చు. అయితే ఏది 'రియాలిటీ' అన్నదే సమస్య. నైతిక విలువల్ని వాస్తవికత జయిస్తుంది- అని చైతన్యకు అర్థం అయింది. అతడికీ ఏది వాస్తవికతో స్ఫురణకు వచ్చింది.

"——నాతి చరామి——!!!" ఎటువంటి పస్థితుల్లో ఇందరు దంపతులు భవంతుల్లో నయితేనేం, మురికికూపాల్లోని నయితేనేం - ఏదో ఒకనరకంలో ఓకరొకరి తోడుగా, కాలం వెళ్ళదీస్తున్నారన్న మాటేగానీ మనసా వాచా ఎందరు పరస్పరం ప్రేమించుకొంటూ కాపురాలు చేస్తున్నారు.

ప్రియమైన పాఠకుల్లారా! కాపురం పరస్పర అవసరాలు తీర్చుకోడానికే కాదూ అన్నట్టయితే ఈ భావాలన్నీ చాదస్తపు సిద్ధాంతాలుగా కవబడవచ్చు. మరో కోణంనుంచి పరిశీలించినట్లయితే అనుబంధంపెరగ వలసింది అవసరార్థం కాదు అన్నదికూడా కనిపిస్తుందేమో....

విధిచేతి పేకముక్కల్లో ఒక్కొక్కటీ రాలిపోతోంది. అతను మిగిలేడు.

నెమ్మదిగా- తాపీగా- ఆ భవంతి కాంపౌండులోంచి బయటికి వచ్చేరు. దారికిరువేపులావున్న మొక్కలు వీడ్కోలు చెబుతున్నాయి. రోడ్డుకవతల చెత్తకుండి దగ్గర కుక్క అతడినే విచిత్రంగా చూస్తోంది. సృష్టి మౌనంగా, స్తబ్దంగావుంది. అతడు రోడ్డుమధ్యగా నిలబడి చేతులు రెండూ గాలిలోచాచి, తలపైకెత్తి ఆకాశంకేసిచూస్తూ, బిగ్గరగా "ఇప్పుడు నేను అన్నిబంధాలూ తెంచుకొన్న సర్వ స్వతంత్రుణ్ని" అని అరిచేడు.

# 12

"ఒసేయ్ శారదా.

ఇన్నాళ్ళూ ఉత్తరం వ్రాయలేదని నీకు కోపంగాని వచ్చిందా? రాదులే. నా సంగతి నీకుతెలుసుకదా!! నువ్వువెళ్ళిపోయిన తరువాత ఇక్కడ పరిస్థితులు మరింత దిగజారేయి. ఈ రవి అనబడే మహాప్రియుడు నాకు ఎప్పటికీ అర్థంకాడు. అమాయకుడో తెలీదు- మానసికంగా బలహీనుడో తెలీదు. బహుశా రెండూ కరెక్టేఅయివుంటాయిలే. లేకపోతే బిజినెస్‌లో నష్టంవచ్చిందని తెలిసి, తాగేసి ఇంటికొచ్చి నీ చేతులుపట్టుకొని ఏడవటం ఏమిటి— ఏడవమను.కాదన్నదెవడు? కానీ నాచేతులుపట్టుకొని ఏడవొచ్చుగా.

పోతే నువ్వో ఫూల్‌వి.

సెంటిమెంటుతప్ప నీకేమీ తెలీదు. మీ అందరికి నేనో పెద్దరాక్షసిలాగానో, భూతంలాగానూ కనబడతానన్నమాట. నిజం అయితేఅయివుం

డొచ్చుగానీ, నీలా తనుబాధపడుతూ ఇతరుల్ని బాధపెట్టటంకన్నా నాలా వుంచేనే మంచిదికదా!

లేకపోతే ఏమిటి చెప్పు—

నువ్వు నెమ్మదస్తురాల్లాగానూ, బాధల్ని అర్థంచేసుకోగలదానివి గానూ కనపడివుండవచ్చు అతడికి. అందుకే తనబాధ నీ దగ్గర వెళ్ళ బోసుకొని వుండవచ్చు. దాంతో నువ్వు బెదిరిపోయి సినిమాల్లోలాగా ఒక హీరో, ఇద్దరు హీరోయిన్లని వూహించుకొనివెళ్ళిపోవటం ఏమీబాగోలేదు

రవి నన్నుకాదని ఎక్కడికీ పోలేడని నాకు బాగాతెలుసు. నాకు తెలియనిదల్లా ఇంత డబ్బొచ్చినా నాకు సంతోషం ఎందుకులేదని? అంతే! కాకపోతే ఏమిటి చెప్పు?

నాలుగులక్షల ఆస్తికి (ఆరులక్షలు ఖర్చయ్యేయి.) వారసురాల నయ్యిందీ— చెల్లెలు గుమాస్తాగా పనిచేస్తువుంటే చూస్తూ ఊరుకోవటం ఏమిటి? 'నా ఆస్తి నీ ఆస్తికాదా?' అని రెండుమొట్టి ఇంటికి తీసుకురాక.

కానీ నేనలా చెయ్యనే కారదా!

నీకుండాలి ఆ బుద్ధి. నేను బ్రతిమాలటం ఏమిటి! ఈ బ్రతిమా లటం అనేది ఇష్టంలేకే రవిమీద అధికారం చెలాయించే హక్కు వచ్చే నెల మొదటివారంలో సంపాదించుకొంటున్నాను.

నువ్వు వెంటనే బయలుదేరి పెళ్ళికి పదిరోజుల ముందేరా.

ఒసేయ్ నువ్వు కాకపోతే నాకెవరున్నారు చెప్పు.

—కిరణ్మయి•

ఇంకోసంగతి, అతితొందర్లోనే నేనూ రవీ, మనం పూర్వం అను భవించిన బాధలలోకి (ఇప్పుడదే స్వర్గంలాగా కనబడుతోంది. వున్నరోజు తింటూ లేనిరోజు పస్తుండటం) వెళ్ళిపోతున్నాము. ఈ నాజూకు రాకుమా రుడు ఈ డబ్బు ప్రపంచంలోంచి బయటపడితే- నిజంబాధలు తెలిసేక

క్షణంలో మారతాడే, నాకుతెలుసు. ఆ నమ్మకంతోనే ఈ పెళ్ళిచేసుకొంటున్నాను. వస్తావుకదూ."

శారద మొహం ఆనందంతో వెలిగిపోయింది. చప్పునలేచి హెడ్‌క్లర్కు దగ్గరకి వడివడిగా వెళ్ళింది.

"సర్. నాకో నెలరోజులు సెలవుకావాలి."
ఆయన తలెత్తి కళజోడు సవరించుకొంటూ "ఎందుకమ్మా" అన్నాడు.

"మా అక్కయ్య పెళ్ళికండీ."

ఆయన నవ్వేడు. "సంవత్సరం పనిచేశావు కాబట్టి నెలలోజులు లీవ్ వుంటుందనుకో. కానీ అదంతా అక్కపెళ్ళికేవాడేస్తే మరి నీపెళ్ళికో?"

ఆమె సిగ్గుతో తలదించుకొని- "ఇప్పుడా ప్రసక్తేమీ లేదండీ" అంది.

పెళ్ళవటానికి ప్రసక్తి ఏమిటమ్మా- కళ్యాణ ఘడియవస్తే నువ్వు ఆగమన్నా ఆగదు"

o o o

లోపల ఎవరిదో పెళ్ళి ఘనంగా జరుగుతోంది. మంగళవాయిద్యాలు గట్టిగా వినబడుతున్నాయి.

"ఇంకా ఆలస్యమేమిటి?" అన్నాడొకడు.
నడుముమీద చిన్న గుడ్డపీలికతప్ప వాడికి యింకేమీ లేదు.

"మనకోసం తొందరగా చేస్తారేమిట్రా?" అన్నాడింకోడు. వాడి వంటినిండా బొల్లితప్ప ఇంకేమీ లేదు.

ఈ మాటలలో పాల్గొనకుండా ఇంకొక వ్యక్తి చెత్తకుండీకి ఆనుకొని కళ్ళుమూసుకుని కూర్చొనివున్నాడు. ఎవరో దయతో యిచ్చినకోటు వేసుకున్నాడు. అదీ చిరిగి శిథిలావస్థలోవుంది. పైజామానో పంచో తెలి

యకుండా లాగు పీలికలయివుంది. అతడికి రెండురోజులనుంచీ భోజనం లేదు. అయినా ఆ విషయం అంతగాబాధించినట్లు లేదతణ్ని. నిర్వికారంగా కూర్చొనివున్నాడు. అతడు చైతన్య.

పాట్నా ఒదిలేక దేశమంతా తిరిగేడు.

ఏదయినా దొరికితే తినటం, లేకపోతే పస్తుండటం.

వర్షంవచ్చినప్పుడు తడవటం, ఎండొచ్చినప్పుడు ఎండటం.

నిరాసక్తత అతడిని పూర్తిగా "ఆక్రమించుకొంది. అది వేదాంతమూకాదు. అలసటాకాదు. ఒకవిధమైన ట్రాన్స్—

భ్రాంతుల నిరూపణమే మిధ్యాత్వము (ఫాల్సిటీ) అంతామిథ్యే! అనుభవం, దానికి సంబంధించిన ప్రతి విషయం 'శూన్యం' జ్ఞానంకూడా శూన్యమే.

కానీ అతడికి తెలియనివిషయం ఒకటుంది. అది-

—'మిథ్య' అన్యాధునమని!

-పరమార్థము, నిత్యమూ అయిన ఒకపదార్థాన్ని అందంగా తీసుకొన్నప్పుడు మాత్రమే మిథ్య ప్రతిభాసమవుతుందని—

——

మొదటి బంతిభోజనం పూర్తయినట్టుంది.

ఆకులు ప్రహారీగోడమీదనుంచి వచ్చి ఇవతలివేపు పడ్డాయి. ఇద్దరు బిచ్చగాళ్ళు పరుగెత్తారు. కుక్కలతో దెబలాడి వాటిని పారద్రోలి ఆకుల్ని స్వాధీనపర్చుకున్నారు. అందులో ఒకడు అతడిని పిలుస్తూ "రా" అన్నాడు.

చైతన్య వెళ్ళలేదు.

మనసులోఏదో మారుమూల ఎక్కడో కొద్దిగాఅహం అడ్డుపడుతోంది. వెళ్ళబుద్ధి కావటంలేదు.

బిచ్చగాళ్ళు ఇద్దరూ ఆత్రంగా ఆకులు ఏరుకొని తింటున్నారు. పావుగంటలో ఆకులు ఖాళీఅయినయ్. ఆకలితీరింది వాళ్ళువెళ్ళిపోయేరు

రెండోబంతి తాలూకు ఆకుల్ని కుక్కలు ఖాళీచేసి వెళ్ళినయ్.

చైతన్య ఒక్కడే మిగిలేడు.

ఎదురుగా సగం విండిన చెత్తకుండీ.

మూడోసారి మళ్ళీ ఆకులుపడి పూర్తిగానిండింది.

కడుపు ఖాళీగావుంది. ఆకలిగావుంది. ఆకలి మనిషిని దిగజారుస్తుంది. చెత్తకుండీలోది తినటం దిగజారటమా? బ్యాలెన్స్‌షీట్‌లో లాభాలను తగ్గించిచూపించటం దిగజారటంకాదా?

కాలేకడుపు కాంట్రడిక్షన్‌ని గుర్తించదు.

కుండీదగ్గరకువెళ్ళి ఆకుని చేతులతో పట్టుకొంటూ అనుకొన్నాడు "నా మనసులో ఏమూలో నా భార్యమీద అసహ్యం వుంటే ఇప్పుడది పోయింది. ఆకలి మనిషితో ఏదయినా చేయిస్తుందన్న సత్యంఅర్థమైంది.

వంగి. ఆత్రంగా ఆకులోది తినబోతూ విద్యుద్ఘాతం తగిలినవాడిలా ఆగిపోయేడు. కుండీకి అవతలిపక్క ఎవరో పడిపోయివున్నారు. ఆకలి వల్లవచ్చిన విస్త్రాణతో మూలుగుతున్నాడు.

చప్పున అటువెళ్ళి పక్కకి తిప్పేడు.

అతడు—

తనకొడుకుని శ్మశానంలోపాతిపెడుతున్నప్పుడు పక్కనేకూర్చుని ఓదార్చినవృద్ధుడు.

o o o

"ఎందుకు నవ్వుతున్నావు నాయనా?" అడిగేడు వృద్ధుడు.

"ఏంలేదు తాతా. సముద్రంలో రాయ్యలు నీటిప్రవాహంలోపల గుంపులు గుంపులు వలసపోతూంటాయి. కాలప్రవాహంలో మనుష్యులు.

కూడా అంతే అనుకొంటా? ఎక్కడ విడిపోయేం— ఎక్కడ కలుసుకొన్నాం!!"

"ఏదిఏమైనా నన్ను రక్షించినందుకు కృతజ్ఞతలు. నువ్వు తిండి పెట్టకపోతే అక్కడే చచ్చిపోయిఉండేవాణ్ని"

"నేను పెట్టింది ఎవరోపారేసింది."

"చెప్పకు. చేదునిజం మింగుడుపడదు." నవ్వుతూ లేచేడువృద్ధుడు "పదబాబూ పోదాం. కొండమీద వారంరోజుల పాటు సంతర్పణ జరుగుతూందట. ఎక్కడెక్కడినుంచో మనలాటివాళ్ళు వస్తున్నారు. దగ్గరుంది మనం వదలటందెనికి??"

వాళ్ళిద్దరూ కొండమీదకి ప్రయాణం సాగించేరు.

o o o

"హనీమూన్ ఎక్కడికి వెళదాం-" హుషారుగా అడిగేడు రవి.

కిరణ్మయి మాట్లాడలేదు. ఆలోచిస్తూ వుండిపోయింది.

"చెప్పు—"

ఆమె అతడివేపు సాలోచనగా చూస్తూ, "వెళ్ళాలంటావా?"అంది

అతడు దెబ్బతిన్నట్లు చూసి, "అంటే" అన్నాడు.

"ఇక్కడ పరిస్థితులు నీకుతెలుసుకదా. ఇటువంటప్పుడు మనిద్దరం లేకపోతే ఏంజరుగుతుందో ఊహించలేకపోతున్నాను."

"ఏం జరుగుతుంది! పదిహేనురోజులు అంతేగా."

"ఏదయినా జరగటానికి పదిహేను క్షణాలు చాలు-"

రవి నవ్వటానికి ప్రయత్నించేస్తూ, "అంటేదబ్బున్నవాళ్ళు ఒక్కరోజుకూడా తమ పన్లనుంచి విశ్రాంతి తీసుకోకూడదా-" అన్నాడు.

చాలాసేపు మౌనంగా వుండి! అన్నది కిరణ్మయి. "నిజమేనేమో. ఈడబ్బు అన్నది మనిషిని నిద్రపోనివ్వకుండా చేస్తుంది. కడుపునిండా తిననివ్వకుండా చేస్తుంది. ఆదిలేని రోజుల్లో దానికోసం—అది వున్నాక ఇంకో దానికోసం.... దేనికోసమో— ? ? విశ్రాంతి అన్నది ఎక్కడ దొరుకుతుంది? డబ్బుకి దానికీ అసలు బాంధవ్యం లేదు.

"కిరణ్" దీనంగా అన్నాడు రవి "యీడబ్బు కారణంగా—దీన్ని నిలబెట్టుకొనే విద్యరాని కారణంగా నన్ను వదిలెయ్యవు కదూ—"

చిన్న పిల్లాడిలా అడుగుతున్న ఆ పాతికేళ్ళ యువకుణ్ణి చూస్తూంటే ఆమె హృదయంలో ఏదో మాతృత్వపు స్పందన కలిగింది. అతడి తలని హృదయానికి హత్తుకొంటూ, "లేదు రవీ—ఆ ఆలోచనని కలలోకి కూడా రానివ్వకు" అంది అర్ధ్రంగా.

ఆ రాగరంజిత రసానుబంధపు పరిష్వంగాంలా చాలాసేపు మౌనంగా వుండి, అతడు నెమ్మదిగా అన్నాడు, "నామనసులో బాధ మీకెవరికి తెలీదు కిరణ్ అటు అన్నని-ఇటు చెల్లినీ వదులుకొన్నానన్న బాధ నా మనసుని ఎంతలా కోసేస్తోందో మీకు తెలీదు...."

చైతన్య జ్ఞాపకం వచ్చేసరికి ఇద్దరి మనసులూ వ్యాకులమయ్యేయి.



''గోవిందా....గోవిందా.... గోవిందా....'' గుంపు ముక్తకంఠంతో అరుస్తోంది. లాళ్ళనీ, తుప్పల్నీ దాటుకొంటూ మెట్లు ఎక్కుతున్నారు.

"గోవిందా— గో... విందా." ఒకటే నాదం. కాళ్ళు పీకుతున్నాయి. గొంతు ఎండిపోతోంది. అయినా పయనం ఆగటం లేదు ఏదో ఆవేశం ముందుకు తోస్తోంది భక్తి పారవశ్యం బాధని తెలియనివ్వటం లేదు. వాళ్ళకి.

ఎదురు దెబ్బ తగిలి, కాలినుంచి ప్రవహిస్తూన్న రక్తాన్ని తుడుచుకుంటూ— "ఇంకా ఎంతదూరం తాతా" అడుగేడు చైతన్య.

—ఎంతో దూరంలేదు— రెండు కొండలే యిక!"

జుట్టులోంచి చెమట ధారగా కారుతోంది. చెప్పులులేక కాళ్ళు కాలుతున్నాయి. మెట్లు ఎక్కుతూ పోవటంవల్ల మోకాలి చిప్పలు పట్టేసినయ్.

"ఇంకా ఎంతదూరం తాతా—"

"ఇంకొక్క కొండే-"

"గోవిందా— గోవిందా—గో—విందా!"

అదో ప్రవాహం—వృద్ధులు—పిల్లలు— ఆడవాళ్ళు....డబ్బున్నవాళ్ళు—లేనివాళ్ళు— అందరూ ఏకేంద్రంవైపు సాగిపోతున్నారు. గంటలు గణగణా మ్రోగుతున్నాయి. ఎక్కడ చూసినా జనమే. బైట మనుష్యులు, లోపల మనుష్యులు—ధర్మదర్శనపు క్యూల్లో మనుష్యులు—

వెనకనుంచి తోసేవారు-ముందునుంచి ప్రతిఘటించేవారు. మధ్యలో నలిగేవారు. వంకర్లు తిరిగిన వరుసలు... వరుసల్లో మనుషులు— అందర్లోనూ ఆత్రం .. దేముణ్ని చూడాలని క్షణాలు—నిమిషాలు— గంటలు—తరగని వరుసలు—వంకర్లు తిరిగిన వరుసలు—"గోవిందా —"ఆగి నడిచిఉతొందరగా సాగి- మళ్ళీ ఆగి- గుడిలోకి క్యూ.

"ఎక్కడున్నాడయ్యా దేముడు?"

"ఇంకొ౦క్క వరుసేనయ్యా—అదుగో—అ మలుపు తిరిగేక—"

కాళ్ళు పట్టేసినయ్. పదిహేనుగంటలు నడిచి, పది గంటలు వరుసలలో నిలబడి—ఇంతశక్తి ఎలా వచ్చింది.–ఎవరిచ్చేరు? ఇంత బాధ పడితే గానీ దేముడు కనబడడా?—మరి బాధపడుతున్నట్లు తెలియదేం?

మలుపు తిరిగితే....?

వచ్చేసింది. మలుపు వచ్చేసింది. తిరిగితేకనబడతాడా? ఆమూర్తి నిజదర్శనం కనబడుతుందా?? అసలు దేవుడున్నాడా???

ప్రమిదలు వెలుగుతున్నాయి. చుట్టూ గోడలు ప్రకాశిస్తున్నాయి. విగ్రహం వెనుకనుంచి ఏదో వెలుగు.... ముందుకు జరిగేకొలదీ మనసు తేలికపడుతున్న అనుభూతి. పడినబాధ అంతా మర్చిపోయేలా ఏదోవుద్వేగం. చేరుకొవటానికి ఎంతకష్టపడితే అంతవుద్వేగం, అంత ఆనందం లభిస్తుంది కాబోలు. ఏదో అలౌకికమైన అనుభూతి.

అయితే ఆ అనుభూతి దేవుణ్ని చూడటంవల్లా? చూడటానికిపడిన కష్టంవల్లా??

అడుగు ముందుకు వేయబోయాడు.

ఎవరో ముఖ్యుడు ఇంకోదారివెంట వస్తున్నాడు. అతడికిదారిఇవ్వటం కోసం ఇతణ్ని వాలంటీర్లు ఆపుజేసేరు. వెనుక జనం ప్రవాహంలా వస్తున్నారు. ముందుకు సాగిపోవాలని ఆశ. ఆ దివ్యమంగళ విగ్రహాన్ని చూడాలని ఆతృత. 'గోవిందా- గోవిందా' అని నినాదాలు. గుండెల్లో గణగణా మ్రోగే గంటలు—

చైతన్య ఆగలేదు. సాగిపోతున్నాడు. మనసు వుద్వేగంతో ఊగిపోతోంది. పూజారుల మంత్రాలు ఉచ్ఛస్వరంతో వినపడుతున్నాయి. అంతా గోలగావుంది మనసుమాత్రం మౌనంగావుంది. అతడు కదులు

తూనేవున్నాడు. యేదోశక్తి ముందుకు తోస్తున్నట్టు కదులుతూనేవున్నాడు. వాలంటీరు కఱ్ఱ అడ్డుపెట్టేడు. ఆగలేదు.

వాలంటీరు బలంగాతోస్తే క్రిందపడి, తల అదిరి, మళ్ళీ స్పృహలోకి వచ్చేరు. పక్కనుంచి వచ్చిన వి. ఐ. పి. విగ్రహం దగ్గిరకు సాగిపోయేడు. చైతన్య చేతులమీద బలహీనంగా లేస్తూ గొంతుపగిలేలా అరిచేడు. "పదహారు గంటల్నుంచీ వరుసలో నిలబడి వస్తున్నారా. ఇప్పుడు తోసేస్తావుకదూ. ఒరేయ్ సర్వనాశనమైపోతావురా"

ం ం ం

వెనకున్న వృద్ధుడు సాయంచేసేడు.

మళ్ళీ ముందుకు పయనం.

దూరంగా దేవుడు.

చెయ్యెత్తి అభయమిస్తున్నట్టు!

కళ్ళు మూసుకొన్నాడు. అంతాచీకటిగావుంది. పడినబాధ అంతా మరిచిపోయేలా_ మనసు సేదతీరుతోంది. యేదో సంతృప్తి కానీ సంతృప్తిలోనే యేదో అసంతృప్తి పూజారి వెళ్ళమని తొందరచేస్తున్నాడు. మనసు ఆగమని గోలచేస్తోంది ఆగటానికి వెళ్ళటానికి మధ్యనిర్ణయించుకోవలసిన మనసుకి దేవుడ్ని ధ్యానించే యేకాగ్రతఏది! అతడు కళ్ళు తెరవబోయాడు.

అంతలోనే విచిత్రంజరిగి ంది.

మొక్కుకున్నదాన్ని హుండీలోవేసితే దేవుడికి చేరదేమోనన్న అనుమానంతో ఒక భక్తుడు- వరుసలో నిలబడి, దేవుడిదగ్గరకు రాగానే పిచ్చివాడిలా ఒక్కసారి రెండుగుప్పెళ్ళతోనూ వెండిరూపాయ కాసుల్ని విగ్రహంమీదకు విసరసాగేడు.

క్షణంలో కలకలం బయలుదేరింది.

చైతన్య నుదుటికి ఒకారూపాయొచ్చి టప్‌మని తగిలింది. అలాగే నొక్కిపట్టుకొన్నాడు. తడిగాతగిలింది. తీసిచూడగానే ఎర్రటి రక్తపుమరకవున్న తెల్లటిరూపాయి. నుదుటిమీద చిన్నబొప్పి—

అంతలోనే వాలంటీర్లు రంగంలోకివచ్చేరు. జనాన్ని సర్దుతున్నారు. అంతా తొక్కిసలాటగావుంది

ఇద్దరూ వెనుకనుంచి ఎవరో తోస్తున్నట్టు బయటకొచ్చిపడ్డారు.

"చూసేవా నాయ నాదేవుణ్ని?" వృద్ధుడు అడిగేడు.

"ఏదితాతా.... కళ్ళుమూసుకోగానే ఇదొచ్చి తగిలింది" అంటూ నవ్వి గుప్పెట విప్పేడు. సకల చరాచర సృష్టిస్థితి లయకారుని ప్రాంగణంలో దొరికిన— సకల మానవకోటినీ ఆడించే రూపాయికాసు.!

o o o

రాత్రి రెండయింది.

చలిగాలి రివ్వున వీస్తోంది. వెన్నులోంచి చలిపుట్టుకొచ్చి వళ్ళు చిగురుటాకులా వణికిపోతోంది. వేసుకొన్న పాతకోటు చలిని ఆపలేకపోతోంది. దుబ్బులా పెరిగిన జుట్టూ, గెడ్డమూ కొద్దిగా చలిబారినుంచి రక్షిస్తున్నాయి.

సత్రం అరుగుమీద ముడుచుకొని పడుకొన్నచైతన్య లేచి కూర్చున్నాడు.

పక్కనేపడుకొన్న వృద్ధుడు మాత్రం గురకపెట్టి అతడిలాగే శవాకారంలో కొంతమంది ఆ అరుగుమీద పడుకొనివున్నారు.

అంతా నిశ్శబ్దంగావుంది.

చీకటి కొండల్ని కప్పేసింది.

గుడిగోపురం మీదనుంచి ఏదో పిట్ట నిద్రలోంచి మెలకువవచ్చినట్టు అందంగా కూసి, మళ్ళీపడుకొంది. దానికి బదులిస్తున్నట్లు పిల్లగాలి చిన్నశబ్దంతో ఆకుల్ని కదిల్చింది.

మళ్ళీ విశ్వబ్దం.

చైతన్యలేచి మెట్లుదిగేడు. గమ్యంలేకుండా బయలుదేరేడు.

వెన్నెల జల్లులా కురుస్తోంది.

నెమ్మదిగా నడుస్తున్నాడు.

ఎక్కడికోతెలీదు నడుస్తున్నాడు. నడుస్తూనేవున్నాడు.

సృష్టిఅంతా విశ్రాంతి తీసుకొంటున్నట్లు మౌనంగావుంది. వెళ్ళి కోనేరుగట్టు మెట్టుమీద కూర్చున్నాడు. దూరంగా గుడి.

కాళ్ళదగ్గర పచ్చటినీరు. పక్కనే నిద్రగన్నేరు చెట్టు. గాలికి రాలినఆకులు నీటిమీద తెప్పల్లాతేలుతున్నాయి.

అలికిడికి తపోభంగమైన ఋషిలాకదిలిన కప్ప- మళ్ళీ కళ్లు మూసుకొంది.

ఓ పిల్లతెమ్మెర వచ్చి అతడ్ని నాజూగ్గా స్పృశించి ముందుకు సాగిపోయింది.

అతడలాగే నిశ్చలంగా కూర్చొని కళ్లుమూసుకొని వున్నాడు.

దూరంగా ఎవరో నిద్రరాక సన్నటి కంఠంతో గీతాలాపనచేస్తు న్నారు. పాట గాలిలో అలలు అలలుగా తేలివస్తూంది—

"యోమాం అజం అనాదించ వేత్తి లోక మహేశ్వరం.... సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ-"

-నేను సర్వమునకు ప్రభవమును. నన్ను అజునిగా ఎరుగువాడు పాపములనుండి విముక్తుడగును. నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము. అనే కానేక సందేహాలతో భ్రాంతులయినవారికి చరమ సందేశమొక్కటే-

"—గీతా సుగీతా, కర్తవ్యా కిమన్యైః శాస్త్ర విస్తరైః"

... వీణయ తీవెలపై సున్నితంగా మీటినట్లు ఆ ధ్వని గాలిలో మందంగా వ్యాపిస్తున్నది.

అతడిఒళ్ళు జలదరించింది.

కళ్ళు తెరిచేడు.

పైన నీలాకాశం. క్రింద నిశ్చలమైనభూమి. ఆకాశంలో మినుక్కు-మినుక్కుమనే నక్షత్రాలు....

ఓ చిన్నమేఘం మందగమనంతో తూర్పుదిక్కుగాసాగిపోతోంది. కోనేటినీరు నిశ్చలంగావుంది. నీటిలో ప్రతిబింబాలు- వెన్నెలలోమెరుస్తూ కదలకుండా నిలబడివున్నాయి.

విద్రగన్నేరు చెట్టునుంచి పూవొకటి రాలింది.

మెట్టుమీద కప్ప అలాగేవుంది.

అతడిలో ఏదో ఎక్కడో కదులుతోంది.

తిరిగే భూమి. వీచేగాలి, కదలని ఆకాశం. స్థిరమైనకొండలు, స్వచ్ఛమైన నీరు, కదిలే చెట్లు- అన్నీ ఏకమై అందరూ నిద్రించే వేళ- ఆ నిశ్శబ్దంలో సకల చరాలూ విశ్రాంతి తీసుకొనే ఆ నీరవంలో- ఆ చరాలన్నీకలిసి- తమను సృష్టించిన ఆ భగవంతుడిని ముక్తకంఠంతో మౌనంగా ప్రార్థిస్తున్నట్టున్నాయి.

ఆ నిశ్శబ్దం అతడికేదో బోధిస్తున్నట్టువుంది. అతడినరాల్లోకిఏదో తెలియని వుద్వేగం పాకుతోంది.

నన్నగా గాలివీచింది. ఆకులు కదులుతున్నాయి. కొమ్మకొమ్మ రాచుకొన్నప్పడు విచిత్రమైన శబ్దం వినిపిస్తోంది.

అతడు సమాధిలోవున్నట్టు నిశ్చలంగావున్నాడు.

గాలి వయవించినా—

కొమ్మలురాచుకొన్నా—

ఒకటే శబ్దం- నెమ్మదిగా— మనసు స్పందించేలా ఒకేశబ్దం.

"ఓమ్- ఓమ్"

అన్నివేపుల్నించీ అదేనాదం.

అలలు అలలుగా అలలు అలలుగా! అతని మొహం ఒక దివ్య మైన తేజస్సుతో వెలిగిపోతోంది, అన్నిదిక్కుల్నుంచీ ప్రకృతి ఓంకార నాదాన్ని గానంచేస్తోంటే అతడు వింటున్నాడు. అతడిచుట్టూవున్న జీవ కోటి స్నేహ పురస్సరంగా అతడిని అభినందిస్తూంది. అతడికళ్ళల్లో ఉజ్వలమయిన వెలుగు ప్రతిబింబిస్తున్నది అతడి శూన్యమయిన మన సులో ఒక చిన్నజ్యోతి అఖండమై, ప్రతిఖంజనంతోడై, మనస్సంతా ఆక్రమించుకొంది.

అతడు లేచేడు.

వడివడిగా తన నెలవుకేసి నడవసాగాడు.

తూర్పురేఖలు నెమ్మదిగా విచ్చుకొంటున్నాయి.

ఆకాశం ఎర్రగా ప్రకాశింతాటానికి ఆయత్తమవుతోంది. ఆ వెలుగు అతడి మొహంలోనేవుంది.

అతడు వెళ్ళేసరికి తాత లేచేవున్నాడు.

''ఎక్కడికెళ్ళావయ్యా ఇంతరాత్రి?''

''దేవుణ్ని చూడటానికి వెళ్ళానయ్యా''

బోసిగానవ్వాడు తాత. "మరి చూసేవా?"

చూసేనయ్యా. మెరిసే నీళ్ళలో కదిలే మేఘాలలో, నిలిచిన కొండల్లో దేవుణ్ని చూసేనయ్యా''

o o o

పెళ్ళివాళ్ళతో కలిసి వెళ్ళిపోకుండా ఇటురావటంద్వారా ఎంతతప్పు చేసిందో శారదకి అర్థమయింది.

రావటం అయితే అందరూకలిసి వచ్చేరు.

స్నేహితురాలు, వాళ్ళకుటుంబం, అంతా బాగానే జరిగింది. కానీ ఆ రష్‌లో వారు తప్పిపోవటంతో కంగారుపడింది. ఒక్కతేవెళ్ళిపోగలదు అదేమంత కష్టమైనదని కాదు. అదేవుద్దేశ్యంతో కౌంటర్లో టిక్కెట్టు

కాసుక్కొందామని బ్యాగ్‌లోంచి పదిరూపాయలనోటు తీసిపెడితే అది చిరిగిందనీ చెల్లదనీ అన్నారు. ఇంక డబ్బులేదు బ్యాగంతా కంగారుగా వెతికింది. ఓ పావలాకాసూ, రెండు పదిపైసల బిళ్ళలూ దొరికినాయి

ఆమె కళ్ళవెంట నీరు గిర్రున తిరిగింది చప్పున క్యూలోంచి బైటకొచ్చింది. ఒకటి రెండు కొట్లలో మారుద్దామంటే ఎవరూ తీసుకో లేదు.

ఒక పక్క చీకటి పడ్తోంది. ఆ తటపటా యింపులోనే మరింత సమయం గడచిపోయింది. ఆమె కేం చెయ్యాలో తోచలేదు,

నుదుటిమీద చెమట పడ్తోంది, కాళ్ళు వణకు తున్నాయి.

ఆమె కంగారునీ, బిత్తరచూపుల్నీ పసిగట్టి ఒక యువకబృందం, దగ్గర చేరింది.

దాంతో ఆమె మరింత కంగారుపడింది.

బస్‌స్టాండ్ దాదాపుంఖాళీ అయింది,

చలికాలం అవటంవల్ల కొద్దిగా చికటిపడే సరికే మనుష్య సంచారంతగ్గి పోయింది.

ఏవరైనా అడుగుదామా అనుకొంటే- బిడియం. అయినా అది మరో అర్థాన్ని సూచిస్తే——?? ఈ పరస్పర విరుద్ధమయిన భావాల మధ్య ఆమె కొట్టుమిట్టులాడుతూ వుండగానే ఒక యువకుడు దగ్గరకు వచ్చి ఏదో పని వున్నట్టూ ఆమెని రాచుకొంటూ వెళ్ళిపోయేడు.

దాంతో ఆమె మరింత బెంబేలుపడి, అక్కణుంచి కదిలి, పది అడుగులు వేసి. వెనక్కి తిరిగి చూసేసరికి వెనుకే ఆ నలుగురూ వస్తూ కనిపించేరు. ఆమె నడక వేగం హెచ్చించింది.

అక్కనుంచి కదలటం, వెనుక వాళ్ళు వస్తున్నారా లేదా అని తిరిగిచూడటం, తరువాత నడక వేగం హెచ్చించటం, వారికి మరింత

హుషారునిచ్చింది. ఇంకొంచెం దగ్గరగా వచ్చి అన్యాపదేశంగా మాటలు విసరసాగేరు.

బస్‌స్టాండ్ దాటగానే దూరంగా విసిరేసి నట్లున్న కాటేజ్స్. చీకటి చూసి, తనెంత తప్పు చేసిందో ఆమెకి అర్థమైంది.

చిన్న వీధీ దీవపు వెల్తుర్లో సత్రం అరుగుమీద కొంతమంది పడు కొని వుండటం చూసి ఆమెకి ధైర్యమొచ్చింది. కానీ అదెక్కువకాలం నిలవలేదు.

నలుగుర్లోనూ ఒకడు మరింత ధైర్యంచేసి ఆమె చెయ్యిపట్టుకొ న్నాడు. ఆమె కెవ్వున అరవాలనుకొంది. కానీ భయంతో నోటమాట రాలేదు. ఇది అవకాశంగా తీసుకొని- అతడు పక్కకి లాగసాగేడు. ఆమె వదిలించుకోవాలని కూడా తోచకుండా బ్రమాన్పడి పోయింది.

"ఎవరూ—" అన్న మాటలు వినిపించి, నలుగురూ పక్కకి చూసేరు.

ఒక ముసలవాడు....డెబ్బై ఏళ్ళ పైబడిన వాడు-విల్చావి వున్నాడు సన్నగా, గాలికి ఎగిరి పోయేలా వున్న అతణ్ణి చూసి వాళ్ళ తిరిగి ధైర్యం తెచ్చుకున్నారు.

అందులో ఒకడు. "మావాళ్ళే-లే" అన్నాడు ఆమె మౌనం చూసి, కవర్ చేసుకొంటూ.

ఆమె గప్పున స్పృహలోకి వచ్చినట్లు, "కాదు, కాదు" అని అరి సింది. కానీ ఆమె కంఠం ఆమెకే కీచుగా, సన్నగా వినబడింది.

ముసలివాడికేదో అనుమానం వచ్చి, దగ్గరగా రాబోయేడు కానీ, అందులో ఒకడు అతడికి అడ్డుగా నిలబడి, అతడు ముందుకు రాబోతూ వుంటే భుజంపట్టుకు తోసేడు. దాంతో అసలే బలహీనంగా వున్న వృద్ధుడు వెనక్కి పడ్డాడు. తల రాతికి కొట్టుకొని "అబ్బా" అన్నాడు.

"ఎవర్రా అది" అంటూ చైతన్య అక్కడికి వచ్చేడు. వచ్చిన వాడు నలుగురికి సమాధానం చెప్పగలవాడని తోచగానే, నలుగురూ పరుగుతీసేరు.

వంగి చెయ్యి అందిస్తూ, "దెబ్బతగిలిందా తాతా" అన్నాడు చైతన్య. వృద్ధుడు చేతులమీద లేస్తూ–" నా సంగతికేంగానీ ఆ అమ్మాయిని చూడయ్యా- పాపం భయపడినట్టుంది." అన్నాడు.

చైతన్య అటుతిరిగాడు.

వీధి దీపపు క్రీనీడలో ఆమె నిలబడివుంది. చీకటివెలుగుల మిశ్రమం ఆమె మొహంమీద ప్రతిబింబిస్తోంది. ఆమె మొహం దీనంగా ఆర్తిగావుంది.

పదిమంది కుర్రవాళ్ళు కలిసి, ఇల్లు ఖాళీ చేయిస్తున్నప్పుడు ఏ విధంగా, నిస్సహాయంగా, వేదనగా ఎటూతోచనిపరిస్థితిలో నిలబడిఉందో ఇప్పుడూ అలాగే నిలబడివుంది.

అతడు విస్మయంగా "శారదా" అన్నాడు.

ఆమె అయోమయంగా తలెత్తింది. అప్పటివరకూ జరిగిన సంఘటనలన్నీ ఆమె మెదడు మొద్దుబారేట్టు చేసినయ్.

ముందునిలబడ్డ వ్యక్తివేపు చూసింది.

పొరలు నెమ్మదిగా విచ్చుకోసాగాయి.

ఆ గెడ్డమూ బట్టలూ తీసేసే....

క్రమంగా ఆమె కళ్ళలో వెలుగొచ్చింది.

చప్పున అడుగు ముందుకేసి అతడిచేతిని పట్టుకొని "చైతన్యబాబూ" అంది.

అంతలో వృద్ధుడు వారిదగ్గిరకొచ్చాడు. "ఇంత రాత్రిపూట..., ఇదేమిటి శారదా- ఇక్కడ" అంటున్నాడు చైతన్య.

"నా సంగతికేంగానీ- ఇదేమిటి.... ఇదేమిటి చైతన్యబాబూ_ మీ ఈ వేషమేమిటీ- ఈ బట్టలేమిటి?" ఆమె కంఠం రుద్ధమైంది "ఎటు. వంటివారు ఇలా అయిపోయారు_ ఒక్కచూపుతో పదిమందిని శాసించ గలవారు మీకీ స్థితిఏమిటి?"

చైతన్య నవ్వేడు. భావాన్నీ వేదాంతాన్నీ రంగిరించిన నవ్వుఅది.

వృద్ధుడు అతడ్ని పరిశీలనగాచూసి "నే ననుకుంటూనేఉన్నాను సుమా. నువ్వు పుట్టుదరిద్రంలోంచి వచ్చినవాడివి కావని" అన్నాడు.

"ఇక్కడెందుకు- రండి" అంటూ సత్రం అరుగుదగ్గరకి దారి తీసేడు వృద్ధుడు.

చైతన్య కనపడగానే కలిగిన మొదటిప్రశ్నని అడిగిందామె. అది వేయిరూపాలుగా ఆమెని అప్పట్నుంచీ వేధిస్తోంది.

నవ్వేడు. "ఏం చెప్పమంటావు శారదా ఒకరు నన్నొదిలీ, ఇంకొకరు లోకాన్నొదిలీ వెళ్ళిపోయారు" అన్నాడు.

ఆమె ఏదో అడగబోతూవుంటే "వద్దుశారదా- ఇంకేమీ అడగకు" అన్నాడు వారిస్తున్నట్టు. కూర్చున్నాక అడిగాడు.

"మనవాళ్ళంతా ఎలా వున్నారు? ఎక్కడున్నారు?"

శారద ఆ ప్రశ్నకి వెంటనే సమాధానం చెప్పలేదు. చాలాసేపు మౌనంగావుండి, నెమ్మదిగా ఒక్కోవిషయమే చెప్పసాగింది.

గోడకి ఆనుకొని కూర్చొనివున్నాడు చైతన్య. ఒకవేపుచెంపమీద లైటువెల్తురు మసగ్గా పడుతోంది. శూన్యంలోకి చూస్తూకూర్చున్నాడు. అతడి మొహంలో ఏ భావమూ లేదు శారదమాత్రం జరిగిందంతా చెప్పటానికి చాలా బాధపడుతోంది ముఖ్యంగా కౌసల్య సంగతి,

అదికూడా చెప్పి ఆమె మౌనంవహించింది.

చాలాసేపు నిశ్శబ్దం వాళ్ళమధ్య తాండవించింది. చుట్టూ చీకటి.

చైతన్య కదలకుండా గోడకి ఆనుకొని అలానే కూర్చొనివున్నాడు. అత డికి చెలితాలూకు స్మృతులు ఒకటొకటే గుర్తుకు రాసాగినయ్.

తెల్లవారుజామునే లేచి, స్నానంచేసి చదువుకు కూర్చునే చెల్లి—. ముగ్ధంగా, ముద్దబంతిపూవులా ఇంట్లో లక్ష్మిలా మసలిన చెల్లి- జలపా తంలా తృళ్ళుతూ వెన్నెల తీవెలా మెరిసే చెల్లి.... ఏ అంధకారబంధుర పరేత నిలయంలో చిక్కుపడిపోయిందో.... ఏ కసాయి చేతుల్లో బాధలు అనుభవిస్తోందో....

చెంపమీద తడిగా తగిలేసరికి అప్రయత్నంగా తుడుచుకొన్నాడు. ఒకే ఒక కన్నీటిచుక్క— నెమ్మదిగా క్రిందికి జారుతోంది. అలాగే వేలుమీదికి తీసిపట్టుకొని అనుకొన్నాడు.

"—కన్నీటిచుక్కా— కన్నీటిచుక్కా- ఆస్థి సర్వస్వం పోయిన ప్పుడు రాలేదు— నా కొడుకు చచ్చిపోయినప్పుడు రాలేదు— నా భార్య లేచిపోయినప్పుడు రాలేదు. ఇప్పుడెందుకొచ్చావే కన్నీటిచుక్కా?"

o o o

అతడిని తిరిగి తనవాళ్ళతో కలువుదామన్న ఆమెఆశ నెరవేర లేదు. ఎన్నోవిధాల ప్రయత్నించింది.

చైతన్య తలఅడ్డంగా వూపుతూ, "లేదు శారదా. నేను వెళ్ళి కిరణ్మయి ఆస్థి అనుభవించే ప్రసక్తేలేదు" అన్నాడు.

"పోనీ దాని అజమాయిషీచూస్తూ—" అంటూన్న ఆమెమాటల్ని మధ్యలోనే అపుచేసేడు. "అది కుదిరే పనేనంటావా? నేను కనబడగానే వాళ్ళిద్దరూ అంతా నా చేతుల్లోనే పెడతారు. నేనే వాళ్ళకీ యజమానిలా ప్రవర్తిస్తారు అదే నాకిష్టంలేదు. ఒక్కసారి నా కొడుకు చచ్చిపోయే ముందు డాక్టర్ని తప్ప- ఇంతవరకూ ఎవర్నీ చేయిచాచి ఏదీఅడిగించలేదు. ఇప్పుడా పరిస్థితి రానివ్వను—"

మీరు ఆశించే పరిస్థితి ఏమిటి? మీరు కనబడగానే వాళ్ళేమిమ్మల్ని —" ఆమె పూర్తిచేయలేదు.

"అదే నాకిష్టంలేదు" అన్నాడు చైతన్య. "ఎలా అయితేనేం— చివరికి అదేజరుగుతుంది వద్దు శారదా. వాళ్ళు సంపాదించుకొన్నది వారే అనుభవించనీ వాళ్ళ పెళ్ళిగురించి మంచివార్త చెప్పేవు అదే చాలు. కౌసల్యపట్ల బాధతప్ప ఇంకేమీలేదు నాకు. ఇంకేముందని ఆ ఇంటికి రావాలినేను-"

"కానీ మీరిలా వున్నారనితెలిసే రవిబాబు వూరుకుంటాడంటారా"

మరి అన్ని లక్షల కధికారిణయిన మీ అక్కయ్య— నువ్విలా చిన్న ఉద్యోగం చేసుకొంటూ వేరే వుంటానంటే ఎలా ఒప్పుకొంది."

"తనసంగతి వేరు—"

చైతన్య నవ్వాడు. " నీకున్న వ్యక్తిత్వం నాకుండదని ఎందుకు అనుకొన్నావ్ శారదా" అన్నాడు.

ఆమె యీ ప్రశ్నకి సమాధానం చెప్పలేకపోయింది. ఒక కోణం లోంచి చూస్తుంటే అతడు చెప్పిందీ నిజమేలా కనిపిస్తోంది.

ఆమెకి సంతోషంగావుంది. అతడు ఇలా కనిపిస్తాడనుకోలేదు. ఈ సంగతి అక్కకీ, రవికీ తెలిసిందంటేచాలు. వాళ్లేవచ్చి తీసుకెళ్తారు. తనతో వాదించినట్లు తమ్ముడితో వాదించలేడుగా.

కానీ ఆమె ఆశ నెరవేరలేదు. చైతన్య ఆ జాగ్రత్త ముందే పడ్డాడు. అదెలా జరిగిందంటే—

"రండి వెళదాం" అంది శారద.

"ఎక్కడికి?"

"మా యింటికి—"

చైతన్య నవ్వి "అప్పుడే ఇల్లుకూడా ఏర్పరచుకొన్నావన్న మాట—" అన్నాడు.

శారద సిగ్గుపడింది.

చైతన్యే అన్నాడు. ''వద్దు శారదా. మళ్ళీ నన్నా జంజాటంలోకి ఈడ్చకు''

ఆమె తెల్లబోయి– ''అదేమిటి– ఇలాగే ఉండిపోతారా'' అంది.

అతడు మాట్లాడలేదు.

అప్పటివరకూ వాళ్ళ సంభాషణ వింటున్న వృద్ధుడు కల్పించుకొని– ''అంత ఆస్థివుంచుకొని నీకీ ఖర్మేమిటి బాబూ. వెళ్ళు–'' అన్నాడు.

చైతన్య తల అడ్డంగా వూపుతూ, ''అది నాది కాదు తాతా'' అన్నాడు.

''అయినా నీవాళ్ళందరూ వున్నారన్నావుగా– వాళ్ళకోసమన్నా వెళ్ళాలి–''

''లేదు తాతా. నేను లేనివాడ్ని. ఉన్నవాళ్ళు నావాళ్ళు కాదు.''

వృద్ధుడు నవ్వేడు ''వేదాంతం నిరాశలోంచి ఉద్భవించదు బాబూ. అన్నీ అనుభవించాకే ఆ స్థితి రావాలి.''

''నే. అన్నీ అనుభవించాను తాతా.''

''నేనలా అనుకోను. స్త్రీపట్ల నీ మనసులో ఎక్కడో పూర్ణ విశ్వాసంలేదు. అంతే కాదు, విధిపట్ల కూడా నీకు గౌరవం పూర్తిగా లేదు. నీపట్ల నీకు పూర్తిగా ఏకీకరణ అవుతేగానీ ఆ స్థితి సాధ్యంకాదు. ఆ స్థితి నిరాశలోంచి మాత్రంరాదు.''

చైతన్య మనసు అట్టడుగుపొరల్లో ఎక్కడో అహం దెబ్బతిన్నది ''అది నీకొచ్చిందా,'' అన్నాడు.

వృద్ధుడు బలంగా నిశ్వసించేడు, కొద్దిసేపు మౌనంగా వుండి అన్నాడు.

''చాలా రోజులక్రితం ఢిల్లీలో రంజనీ స్టూడియోస్ అని వుండేది

జ్ఞాపకం వున్నదా? దాని ప్రొప్రయిటరు నిరంజన్ దాస్ ఆరోజుల్లో దేశం మొత్తంమీద అదే పెద్దస్టూడియో.

ఒకరోజు నిరంజన్ దాస్‌కి ఓ విచిత్రమైన కోర్కె కలిగింది. అంతా విదేశీనటులతో 'భారతం' సినిమా తీయాలని! అందరూ వారిం చేరు. హితవు చెప్పేరు. అయినా అతడు విన్లేదు. ఉన్నదంతా పెట్టుబడి పెట్టేడు. దొరికిన చోటల్లా అప్పుచేసేడు. చివరికి ఆ చిత్రం పూర్తిచే సేడు కానీ దురదృష్టవశాత్తూ అది ఘోరంగా దెబ్బతిన్నది.

కోట్ల రూపాయల్ని ఆ చేతిలోకి ఈ చేతిలోకి ఆడించిన నిరంజన్ దాస్ తెల్లవారుజామకల్లా వీధినపడ్డాడు. హితవు విననందుకు తగిన శాస్తి జరిగిందని సంతోషించారు కొందరు, కాంపిటీషన్ తగ్గింది ఫీల్డులో అని మరికొంతమంది ఉంబరపడ్డారు. ఇచ్చే చెయ్యి యిస్తున్నప్పుడు తీసు కొన్న వేలాది చేతుల్లో ఒక్కచెయ్యికూడా ఆ చెయ్యి అర్థించినప్పుడు ఒక్క చిల్లికానీ రాల్చలేదు. కానీ అతడు నిరాశచెందలేదు. నీలా వైరా గ్యాన్నే వేదాంతం అనీ ఆత్మవంచన చేసుకోలేదు. ఏ సమాజం అయితే అతడ్నిచూసి నవ్విందో దాన్నే ఒక ఆట పట్టించాలనుకొన్నాడు మేథస్సు శ్రమా పెట్టుబడులుగాపెట్టి అహోరాత్రాలు కష్టపడ్డాడు! ఇరవై అయిదు సంవత్సరాలు తిరిగేసరికల్లా మళ్ళీ సెంట్రల్ స్టూడియోస్ కొనగలిగే స్థితికొచ్చాడు! అందరూ అదే చేస్తాడనుకొన్నారు, కానీఅతడుఏంచేసాడో తెలుసా?"

శ్రోతలు యిద్దరూ శ్రద్ధగా వింటున్నారు,

"తన మిత్రుల్ని పరిచయస్తుల్ని- ఏమాత్రం కొద్దిగా పరిచయం వున్నాసరే ఆహ్వానించి పార్టీయిచ్చేడు! చాలో బ్రహ్మాండమయిన పార్టీ అది! కొన్ని వేలఖర్చుతో జరిగిన ఆ పార్టీ చివరలో అతడుమాట్లాడటం మొదలుపెట్టాడు! ఈ మనుష్యుల్ని వాళ్ళ కుత్సితమయిన స్వభావాల్ని తిట్టిపోసేడు. అరగంటసేపు ఉధృతంగాసాగిన అతడి వుపన్యాసం చివర

తననిర్ణయాన్ని వెల్లడించేడు. అన్నిలక్షల ఆస్తినీ అతడు ధర్మసంస్థలకి శరణాలయలకీ వ్రాసి సన్యాసం సన్యాసం స్వీకరించబోతున్నట్లు—

అది వినగానే సభలో హాహాకారాలు బయలుదేరేయి. అతణ్ణి వారించటానికి ఎందరో ప్రయత్నించేరు. కానీ అతడు వినలేదు. ఆ మరునటిరోజు నుంచీ కనపడలేదుదు. మాట నిలబెట్టుకొన్నాడు. ఎవరికి అర్థం కావిదొక్కటే డబ్బుపోయినప్పుడే వెళ్ళిపోకుండా – మళ్ళీదాన్ని సంపాదించటంకోసం ఎందుకంత కష్టపడ్డాడూ! కష్టపడి సంపాదించి, అనుకున్నది సాధించేక మళ్ళీఎందుకు వదిలేసేడూ అని"

"అవునెందుకు వదిలేసేడు?" అడిగేడు చైతన్య.

"చెప్పేనుగా నిరాశలోంచి వేదాంతం వుద్భవించిందని"

"అదే కారణం అని నమ్మకం ఏమిటి? ఇంకేదయినా వుండొచ్చుగా."

వృద్ధుడు ఆవేశంగా "లేదు ఇంకోటిరేదు-" అన్నాడు.

"ఏమిటా నమ్మకం?"

"అవును నమ్మకమే."

"అంత నమ్మకంగా చెబుతున్నావ్, నీకెలా తెలుసు?"

నిరంజన్‌దాస్‌ని నేనే కాబట్టి—"

దెబ్బతిన్నట్టు చూసేడు చైతన్య.

ఎదురుగా వృద్ధుడు నిర్వికారంగా కూర్చొనివున్నాడు.

చైతన్య మనసులో ఏ మారుమూలో కొద్దిగా మిథ్యా దార్శనిక భౌతికవాదంవుంటే తనలాటి నక్షాధికారుల్ని చిన్న కనుసైగతోకొనగలిగే ఈ కోటేశ్వరుడి నిరాడంబరత చూసి— నశించింది.

అతడిని అప్పటివరకూ వేధిస్తూన్న తత్వ పిజ్ఞాసాత్మక శూన్యత మెటాఫిజికల్ ఎమ్టీనెస్ పోయింది.

శారద వేపు తిరిగాడు.

ఆమె అతడినే చూస్తోంది.

అతడు నెమ్మదిగా– "శారదా నేను నీతోవస్తాను" అన్నాడు. ఆమె మొహం ఆనందంతో వెలిగిపోయింది.

"—కానీ ఒక షరతు" అన్నారు. "నా గురించి మనవాళ్ళకు చెప్పకూడదు సుమా–"

అతడు తమలోకివస్తే చాలనుకొన్న ఆమెవెంటనే దానికి వప్పుకొంది.

"వెళ్ళిరా" అన్నాడు వృద్ధుడు చిరునవ్వుతో.

దూరంగా ఎక్కడో ఎనిమిది కొట్టింది.

తనదంటూ ఏదీలేదు తీసుకెళ్ళటానికి.

వచ్చేటప్పుడు ఏంతీసుకొచ్చేడు గనుక?

లేచేడు.

"వెళ్ళొస్తాను తాతా"

"మంచిది నాయనా"

శారద మెట్లుదిగింది.

"మళ్ళీ మనం కలుసుకోమా తాతా"

"నువ్వే అన్నావుగా బాబూ కాలప్రవాహంలో పడసపోయే ప్రాణులం అని. కాలం కలిపితే మళ్ళీ కలుసుకొందాం. ఈ లోపులో నా కాలం పూర్తికాకపోతే...."

అతడు కదిలేడు ఆమెకోపాటు.

ముందు ఆమె, వెనుక నెమ్మదిగా అతడు.

కొద్దిదూరం నడిచి అతడు వెనుదిరిగి చూసేడు.

ఆ వృద్ధుడు చీకట్లో అలానే కూర్చొనివున్నాడు.

చైతన్య చేయివూపేడు.

వృద్ధుడుకూడా చెయ్యెత్తి ఆశీర్వదిస్తున్నట్లు అస్పష్టంగా ఏదో అన్నాడు.

వాళ్ళిద్దరూ చీకట్లో కలిసిపోయి నెమ్మదిగా అదృశ్యమయ్యారు.

o o o

శారద చిన్నయిల్లు చైతన్యకి బాగానచ్చింది. చుట్టూ పూలచెట్లు పక్కపోర్షనులో ఇంటిగలవాళ్ళు.

రెండ్రోజులలో అతడూ చిన్నఉద్యోగం సంపాదించేడు. వుద్యోగం అంటే అది పుద్యోగమూకాదు. పీలింగ్ యూనిట్ లో వచ్చే సరుకు పోయేసరుకు లెక్కలువ్రాసే వుద్యోగం.

అది దొరగ్గానే అతడు వేరే వెళ్ళిపోదామనుకొన్నాడు. కానీ శారద వప్పుకోలేదు.

చైతన్యకి ఉద్యోగం కొత్తగా ఏమీలేదు.

అతడు బిజినెస్ చేసేరోజుల్లో ఇటువంటి చిన్నచిన్న పీలర్స్ అతడి చేతిక్రింద ఎంతోమంది వుండేవారు. అటువంటి పీలర్ దగ్గర గుమాస్తా తను.

అన్ని కోట్లవ్యాపారం చేసిన చైతన్యకి- ఇప్పుడు అన్ని మెట్లూ దిగి బెస్తవాళ్ళతో కలిసి పనిచెయ్యటం కొత్త అనుభవం.

అతడు వాళ్ళతో పరిచయం పెంపొందించుకోసాగాడు.

వాళ్ళ అమాయకమైన చిరునవ్వూ, స్వచ్ఛమైన హృదయం, కష్టపడటం తప్ప మరొకటి తెలియని తనం ఆతణ్ని ఎంతో ఆకర్షించాయ్. వాళ్ళకి అతడిపేరు నోరు తిరిగేదికాదు. 'సైద్దొరా' అని పిలిచేవారు.

ఒకరోజు వాళ్ళు అతనిని సముద్రంమీదికి ఆహ్వానించారు. "రా సైద్దొరా సానా బావుంటాది. మొత్తం రెండురోజులఏట".

చైతన్య నవ్వి, ''అలాగే వస్తాను" అన్నాడు.

అయిదారు రోజులకి సరిపడా మూటకట్టుకొని సముద్రంమీద వేటకుపోవటం చాలా అరుదయిన అనుభవం.

ఆరోజు అతడు ఇంటికి వచ్చేసరికి చాలా ఆలస్యమయింది. ఊరంతా నిద్రపోయింది. అతడొచ్చేవరకూ శారద మెలకువగావుంది. ఆమెనుచూసి అతడు ఆశ్చర్యంతో "టైమెంతయింది" అని అడిగాడు.

"పదకొండున్నర" అంది.

"నువ్వింకా మెలకువగానే వున్నావా!"

ఆమె తలతిప్పకొని "పర్లేదు" అని అతడికి భోజనం వడ్డించ సాగింది.

''మళ్ళీ నువ్వు ఆఫీసుకు వెళ్ళాలికదా. ఇలా నా కోసం నిద్ర పాడుచేసుకొంటే ఎలా చెప్పు?''

ఆమె చిరుకోపంతో, "ఇంకా విషయంతప్ప మరొకటి మాట్లాడ టానికి ఎదా లేమిటి?" అంది.

అతడు నవ్వి, ''వుంది. రేపు సముద్రంమీదకి వెళుతున్నాను-వాళ్ళతో కలిసి. ఒకటి రెండురోజులవరకూ రాను" అన్నాడు.

ఆమె వ్యాకులమయిన మొహంతో "ఎందుకు యిప్పుడు సముద్రం మీదకి అసలే తుఫానురోజులుకూడాను'' అంది.

అతడు భోజనం ముగించి చెయ్యి తుడుచుకొంటూ, ''రెండ్రోజులకే అలా అంటున్నావు. జీవితాంతం సముద్రంమీద గడిపే జాలరి గురించి మాట్లాడవేం'' అన్నాడు.

"అది వాళ్ళకి అలవాటయిపోయింది"

చైతన్య నవ్వేడు. "ప్రాణంపోవటం ఎవరికీ అలవాటవదు శారదా ఎందుకంటే అది ఒకసారే పోతుంది కాబట్టి''

ఆమె మాట్లాడలేదు.

అతడు వరండాలో వున్న కుర్చీలో కూర్చొన్నాడు. ఆమె బయట మెట్టుమీద కూర్చొనివుంది. కర్రలతో కట్టిన ప్రహరీ అవతల రోడ్డు నిర్మానుష్యంగా వుంది. సన్నగా వీచే గాలికి ముద్దబంతిపూలు నెమ్మదిగా తలలూపుతూవుంటే వాటిమీద పిండారబోసినట్టు పడుతున్న వెన్నెల మరింత అందాన్ని సంతరించుకొంది.

"నా మాటలగురించి ఆలోచిస్తున్నావా?"

ఆమె తత్తరపడి, "లేదు లేదు" అంది.

కొద్దిక్షణాల నిశ్శబ్దం తరువాత తలెత్తింది.

చైతన్య కుర్చీ వెనక్కివాలి కళ్ళుమూసుకొనివున్నాడు.

ఆమె కళ్ళవెంట అప్రయత్నంగా నీరుతిరిగింది.

ఎటువంటివాడు ఎలాఅయిపోయేడు. గతంలోజరిగిన ఏవిషయమూ ఆమె స్మృతిపథం దాటిపోలేదు అతని ప్రతికదలికలోనూ అదోరకమైన హుందావుండేది చిన్న కనుసైగతో పదిమందిని శాసించగలిగే ధీమా వుండేది. విధి ఎంత విచిత్రమైంది? కానీ ఈ మానవుడు విధి కన్నా విచిత్రమైనవాడు. విధి ఎలా ఆడించినా కళ్ళలో తీక్షణత కోల్పోనివాడు.

నిజమే. కొద్దిగా నల్లబడ్డాడు. బుగ్గలు లోపలికి పోయినయ్. కానీ మొహంమీద పూర్వంలేని నవ్వు యిప్పుడొచ్చింది. కొంచెం ఆత్మవిశ్వాసాన్ని భవిష్యత్తు బావుండాలనే కోర్కెనీ కలుగజేస్తే చాలు. అంచెలంచెలుగా పైకి వెళతాడు.

ఆమె ఆలోచనలో వుండగానే "నాకు తెలుసు నువ్వేం ఆలోచిస్తున్నావో" అన్నాడు అతడు.

ఆమె వులిక్కిపడి "ఏమిటి" అంది.

"నన్నెలా ఒప్పించి మనవూరు తీసుకెళ్ళాలా అని"

ఆమెకి నవ్వొచ్చింది "అదేంకాదు" "నేనుచెబితే మాత్రం విం టారా మీరు?"

"ఎవరో సంపాదించుకొన్న డబ్బు తగుదునమ్మాఅని మనంవెళ్ళి అనుభవించటమనే సలహాతప్పు ఇంకేదయినా వింటాను. అయినా ఈ చర్చ ఇప్పటికి మనమధ్య కొన్ని వందలసార్లు వచ్చిందనుకొంటాను?"

"నేను దానిగురించేమీ ఆలోచించటం లేదులెండి" అంది.

"మరి దేనిగురించి?" అడిగేడు.

"ఇది మరీబావుంది. నేను ఆలోచించే ప్రతిదీ మీతో చెప్పాలా ఏమిటి?"

అతడికి నవ్వొచ్చింది.

అదిచూసి ఆమె మరింత ఉడుక్కుంటూ, "లేవండి లేవండి చాలా రాత్రయింది" అంది.

"లేదు శారదా నువ్వు పడుకో. నాకు అప్పుడే నిద్రరావటంలేదు" అన్నాడు.

అతడికది అలవాటే ఆవటంవల్ల, ఆమె మరి మాట్లాడకుండా లోపలికి వచ్చి తలుపు దగ్గరకేసి వెళ్ళి పడుకొంది.

అతడు వెన్నెల్లోకి చూస్తూ చాలాసేపు అలానే కూర్చొన్నాడు తన జీవితంలోంచి వెళ్ళిపోయిన ఒక్కొక్క వ్యక్తిని గురించిన ఆలోచనల్లో ఎంతసేపు గడిపాడో అతడికే తెలీదు. దూరంగా ఎక్కడో గడియారం రెండు కొట్టి అతడి ఆలోచనల్ని భగ్నం చేసింది.

కుర్చీలోంచి లేచి లోపలికి వెళ్తూ—ఆగేడు.

గదిలో ఓక మూలగా-పక్కకి వత్తిగిలి పడుకొని వుంది. శారద కిటికీలోంచి పడ్తున్న వెన్నెల ఆమె చెంపమీదికి జారుతోంది.

అతడికి తన చెల్లెలు జ్ఞాపకం వచ్చింది. ఒద్దికగా, పొందికగా ఇలానే పడుకొనే కౌసల్య.... ఆమెవైపే చూస్తూక్షణంపాటు నిల్చొన్నాడు.

కాంతిమతి, కిరణ్మయిల అందంతో పోల్చుకొంటే కౌసల్య, శారదల అందం ఏ మాత్రం సరికాదు. కానీ యీయిద్దరి కళ్ళలో ఏదో ఆర్తి వుంది. లీలగా ఎక్కడో విషాదం వుంది. పురుషుణ్ణి ఆహ్లాదపరిచే అందంకాదు: లాలించే విషాదం ఆత్మీయత కలిగించే ఆర్తి. చెల్లి జ్ఞాపకాల్తో అతడి మనస్సు వ్యాకుల మయింది.

తన గదిలోకి వెళ్ళేడు. గ్లాసులో నీళ్ళు పోసుకొని తాగేడు. పక్కమీద ఇస్త్రీ దుప్పటి, చిన్న తలదిండు——అతడికి కాంతిమతి జ్ఞాపకం వచ్చింది. ఆలస్యంగా యింటికొచ్చి భోజనంచేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్తే నిద్రకళ్ళతో విష్‌చేసే భార్య జ్ఞాపకం వచ్చింది.

పక్కమీద పడుకొన్నాడు. చలిగా వుంది. కాళ్ళ దగ్గర దుప్పటి తీసి కప్పుకొన్నాడు. వెచ్చగా వుంది. అప్పుడతడికి అతని తల్లి జ్ఞాపకం వచ్చింది.

పురుషుడికి తనలో చెల్లినీ, భార్యనీ, తల్లినీ, చూపించగలిగే అదృష్టం చాలామంది స్త్రీల కుండదు.

# 15

బల్బు కినపడకుండా ఏర్పాటు చేసిన లైట్ల కాంతిలో స్పెషల్‌గా ట్రైనింగ్ పొందిన వెయిటర్లు వడ్డిస్తూండగా డిన్నర్‌పార్టీ పూర్తయింది.

రవిసూట్‌లో ఉన్నాడు,

కిరణ్మయి పట్టుచీరలో మెరిసిపోతూంది.

అంతా హడావుడి. స్పీకర్‌లోంచి లాంగ్‌ప్లే పియానో కన్సర్ట్ నెమ్మదిగా వినిపిస్తోంది. గ్లాసుల శబ్దాలు దానికి తాళం వేస్తున్నట్టూ వుంది. 'బఫే' అవటంవల్ల చిన్న చిన్న గ్రూపులుగా చేరి మాట్లాడుకొంటున్నారు.

రవి అందరికీ అన్నీ అందాయో లేదో చూస్తున్నాడు.

అంతలో జైన్ అతడి దగ్గరకి వచ్చేడు. "ఏం సాబ్-ఎలావుంది ధర?"

"తెలియనిదేముంది జైన్ సాబ్-కాంపిటీషన్ విపరీతంగా పెరిగిపోయింది. వీధికో 'సీఫుడ్' కంపెనీ బయల్దేరింది.

"ఒకటే బిజినెస్ చేస్తే అలానే వుంటుంది. సైడ్ లైన్‌లో ఇంకొకటి ప్రారంభిస్తే బావుంటుంది. ఏమంటారు-"

"ఏం ప్రారంభిసే బావుంటుందని మీ ఉద్దేశ్యం?"

"ఆలోచించండి. నా వుద్దేశ్యం నూనెగింజలు అయితే బావుంటుందని, మీకా ఉద్దేశ్యం గానీ వుంటే చెప్పండి నేనూ షేర్ తీసుకొంటాను."

రవి మొహం ఆనందంతో వెలిగింది.

"తప్పకుండా సాబ్-కిరణ్‌తో ఆలోచించి చెప్తాను."

జైన్ నవ్వి, "ఆడవాళ్ళని బిజినెస్ సలహాలు అడక్కూడదు. సాబ్. వాళ్ళని సలహాఅడిగే విషయాలు వేరు" అన్నాడు.

రవి కూడా ఆ జోక్‌కి నవ్వేడు.

"వెళ్ళొస్తాను. ఆలోచించి వుంచండి...." అంటూ అతడు శలవు తీసుకున్నాడు.

ఒక్కరొక్కరే వెళ్ళిపోసాగేరు. గార్డెన్ అంతా ఖాళీ అయింది. రవి అలసటగా కుర్చీలో కూర్చొన్నాడు. ఖాళీ కుర్చీలు, కమ్యూనికేషన్

గ్యాప్ గురించి చర్చించిన అయినెస్కో అబ్సర్డ్ ప్లేలో లావున్నాయి.

అతడు చాలా సేపు అలానే కూర్చొని వున్నాడు.

లోపల కిరణ్మయి హోటల్ మేనేజర్ అకౌంట్ సెటిల్ చేసి బైటికి వచ్చింది. వేన్ వెళ్ళిపోయింది.

బిల్ చూసినప్పటి నుంచీ ఆమె వళ్ళు మండి పోతోంది.

నౌఖర్లె కుర్చీలు లోపలికి పట్టుకెళ్తున్నారు.

ఆమె వచ్చి అతడి పక్క కుర్చీలో కూర్చుంటూ "బిల్ ఎంత యిందో తెలుసా?" అంది.

"ఎంతయింది?"

"ఐదు వేలు."

'అలాగా' అన్నట్టు అతడు తలూపేడు.

"నీకేం పట్టినట్టు లేదే?"

అతడు ఆశ్చర్యంగా, "ఎందుకు?" అని అడిగేడు.

దాంతో ఆమెకు మరింత కారం జల్లినట్టు అయి, "ఎందుకా? ఐదు వేలు ఖర్చయినందుకు?"

"ముందు అనుకున్నదేగా పార్టీ యివ్వాలని" అన్నాడు అతడు అర్థంకానట్టు.

"అనుకున్నాం కానీ—నువ్వు కనపడిన ప్రతీ పరిచయస్తుణ్ణీ పిలుస్తావనుకోలేదు. ఈ పార్టీలవల్ల మనం సాధించేది ఏమిటో నాకు తెలియటం లేదు."

"బిజినెస్ కమ్యూనిటీలో ఇలా టీ పార్టీలవల్లే పన్లు జరుగుతాయి."

ఆమె అతడి మొహంలోకి తీక్షణంగా చూసి, పుస్తకాలు చదివి బిజినెస్ ఎలా చెయ్యాలో మాట్లాడకు. బిజినెస్ థియరీ కాదు" అంది,

దాంతో అతడికి వళ్ళు మండింది. "వంటిట్లో వుండిల్సిన ఆడ

వాళ్ళ బిజినెస్ విషయాలలో వేలు పెడ్తోంటే ఇలాగే తగలడుతుంది." అన్నాడు.

ఆమె రెచ్చిపోయి, "ఏమన్నావ్?" అంది,

అతడు చాలా కూల్‌గా, "కిరణ్మయీ! నువ్వు చాలా అందమైన దానివి. మాటిమాటికీ చిరాకునీ, కోపాన్నీ, అరువు తెచ్చుకొని ఆ అందాన్ని పోగొట్టుకోక." అన్నాడు ఎందుకైనా మంచిదని కొంచెం దూరంగా జరిగి.

అంతకోపంలోనూ ఆమెకి నవ్వొచ్చింది. "మాటమార్చకు అంది మొహాన్ని సీరియస్‌గా వుంచి.

"మాటేం మార్చాను. ఈవేళ జైన్‌తో బిజినెస్సే మాట్లాడేను"

ఆమె ఆత్రుతగా, "ఏవిషయం?" అంది.

అతడు చాలా పెద్ద వ్యవహారకర్తలా మొహం పెట్టి "ఇద్దరం కలిసి వ్యాపారం చేద్దామనుకొంటున్నాం-నూనెగింజల వ్యాపారం" అన్నాడు.

"నీకేమైనా బుద్ధి వుందా?" అంది ఆమె అతడి మొహం ఎర్ర బడింది. "ఏం?" అన్నాడు.

"ఆ జైన్ ఈ రోజో, రేపో దివాళా తీసేటట్టు వున్నాడు, అతనితో కలుస్తావా?" అంది.

"నీకెలా తెలుసు?"

"ఇప్పుడే పార్టీలో అనీల్ భార్య చెప్పింది.

అతడి మొహం ఆనందంలో వెలిగింది. "చూసేవా-పార్టీలవల్ల ఏం లాభం అన్నావు ఎలా రక్షింపబడ్డామో చూశావుగా' అన్నాడు.

ఆమె తలకొట్టుకొని "ఖర్మ" అనుకొంది.

o o o

"హైలేసా—ఐసా—హైలేసా—" అన్ని గొంతులూ కలిసి

ఒకే కంఠంలోంచి వస్తున్నట్లుగా లయబద్ధంగా వినిపిస్తోంది పాట.

బోటుకి ఒక మూలగా కూర్చొన్నాడు చైతన్య.

తీరానికి నెమ్మదిగా దూరమవుతోంది బోటు.

సముద్రం గంభీరంగా-నిశ్చలంగా వుంది.

తీరం దగ్గర ఉవ్వెత్తుగా పడిలేచే కెరటాలు-తీరం దూరమయ్యేక లేవు.

విశాలమైన సముద్రం పిపీలికలాంటి మనిషి అస్తిత్వాన్ని ప్రశ్నిస్తోంది.

పడవలో దాదాపు పది పన్నెండుమంది వున్నారు. చుక్కానిపట్టడంవల్లా, గెడవెయ్యటంవల్లా కండలు మెలిదిరిగి, ఉదయకాలపుఅరుణారుణ కాంతిలో నిగనిగలాడుతున్నాయి.

స్వచ్ఛమైన చిరునవ్వు పెదవులమీద కదులుతోంది. అమాయకత్వంతప్ప మరొకటి తెలియని మనుష్యుల్లా వున్నారువాళ్ళు. కష్టపడటం తప్ప ఇంకొకటి తెలియని మరల్లావున్నాయి వాళ్ళశరీరాలు.

లయబద్ధంగా గెడవేస్తూ ముందుకు సాగిపోతున్నారు.

సూర్యుడు సముద్రంలోంచి బద్ధకంగా బయటకొచ్చాడు.

నీలి సముద్రం తెల్లదనాన్ని సంతరించుకొంది. ఏటవాలు కిరణాలు నీటిమీద పరావర్తనంచెంది కెరటాలుతళతళా మెరుస్తున్నాయి.

మొదటిసారి వలవిసరటానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

నలుగురు కలిసి వలవిప్పేరు.

గాలిలోకి ఎగిరి జల్లెడలా సముద్రంమీద పడింది.

చైతన్య కుతూహలంగా చూస్తున్నాడు. నెమ్మదిగా నీటిలోకి దిగిపోయి అదృశ్యమయింది.

పడవ నెమ్మదిగా కదులుతోంది. సమయంకూడా.

"అడిగో అటుచూడు" అన్నాడు చంద్రయ్య.

చైతన్య చూసేడు. దూరంగా సముద్రంలో ఏదో ఆకారం కనబడింది.

"అదే ట్రాలర్. మొన్న మనూరికి వచ్చింది. పెదరాజుగారు కొన్నారట. అదేదో దేశంనుంచి-"

వాళ్ళు చూస్తూవుండగానే ఆ ట్రాలర్ సముద్రంలో అదృశ్య మైపోయింది.

వల నెమ్మదిగా పైకిలాగుతున్నారు. చైతన ఉత్సుకతతో చూడసాగారు.

పూర్తిగా వల పైకివచ్చింది.

అందరిమొహాల్లో నిరాశ కొట్టొచ్చినట్టు కనబడింది వలలో చిన్న చిన్న చేపలూ, రాళ్ళూ, నీటినాచూ తప్ప ఇంకేమీలేదు.

'అపశకునం' గొణుక్కున్నాడు చంద్రయ్య.

"చైతన్యకి "దేసింది. దురదృష్టదేవత ఇంకా తనతోనే వస్తోందా?

వేట యింకో రెండుగంటలు సాగింది. ఫలితం అంతంతమాత్రం గానేఉంది. పడవ కొద్ది చేపలతో నిండింది. చేపలు లాభదాయకంకాదు. ఇంకేమీ దొరక్కపోతే ఆ సంగతి పేరుగాపీ రొయ్యలు దొరికితే వలలో పడిన చేపల్ని కూడా మళ్ళీ సముద్రంలోనే వదిలేసారు జాలర్లు. పడవలో ఏమాత్రం చోటున్నా దాన్ని రొయ్యలతోనే నింపటానికి ప్రయత్నిస్తారు. ఈసారి కనీసం చేపలుకూడా దొరకలేదు.

ఎండ తీక్షణత ఎక్కువయింది.

వల్లిటిశరీరాలమీద చెమట మెరుస్తోంది. జుట్టులోంచి ధారగా కారు తోంది. తూర్పున దొరక్కపోతే వుత్తరానికి– వుత్తరంవేపు దొరక్క పోతే దక్షిణానికి ప్రయాణం చేస్తున్నారు. అయినా లాభంలేకపోతోంది. అందరిమొహాలలోనూ నిరాశ తాండవిస్తోంది.

"ఈ ట్రాలర్లొచ్చినాక మననోట్లో మన్నే" విస్పృహతో అన్నాడు చంద్రయ్య. "పెనంలోంచి గరిటతో తీసినట్టు రొయ్యల్ని సముద్రం లోంచి తీసుకుపోతున్నారాల్లు. ఇక మనకేం దొరకుతాయి?''

ఈసారి వల అంతతొందరగా రాలేదు! ఇంకో ఇద్దరు పట్టి లాగా ల్సొచ్చింది. చైతన్య ప్రక్కనకూర్చొన్న చంద్రయ్య ఒక్కవుదటున లేచివెళ్ళి. ''నెమ్మదిగా— ఒరేయ్ నెమ్మదిగా'' అంటూ అరిచేడు చైతన్య వూపిరి బిగబట్టేడు వలని జాగ్రత్తగా లాగుతున్నారు.

నెమ్మదిగా లాగుతున్నారు.

అందరిమొహాలూ నెత్తురుచుక్కలేనట్టు వాడిపోయాయి వలకి ఓ మూల పెద్ద బండరాయివుంది. నీళ్ళపైకి రాగానే ఆ బరువుకి ఆగలేక వలని చింపుకొని మళ్ళీ నీళ్ళలోకి జారిపోయింది. వల ఓ మూలవూర్తిగా చిరిగిపోయి పనికిరాకుండా పోయింది. పిరుపేదలయిన జాలరుకి అది సామాన్యమైన నష్టంకాదు.

స్మశాన నిశ్శబ్దం ఆ నావలో పరచుకొనివుంది.

సాయంత్రపు చీకటులు నెమ్మదిగా ముసురుకొంటున్నాయి.

పడవ వెనక్కి తిరిగింది.

చాలామంది మౌనంగా కూర్చుండిపోయేరు. ఆశ చావనివాళ్ళు ఇంకా వలవిసిరి పైకితీస్తూనేవున్నారు ఖాళీగావస్తువ్న వలనిచూసి నిరాశ పడుతూనేవున్నారు. పడవమాత్రం ఆశానిరాశల మధ్యవూగే మనిషి జీవితంలా తీరంవేపు సాగిపోతోంది.

''చంద్రయ్యా" చైతన్య పిలిచేడు.

"ఏం సైద్దొరా''

"తిరిగి వెళ్ళిపోవటమేనా—''

''ఇంకేం చేస్తామయ్యా-'

చైతన్య కొద్దిసేపు మౌనంగావుంది_ "ఇంకోసారి ప్రయత్నిద్దాం చంద్రయ్యా" అన్నాడు.

"చీకటిపడుతున్నాది కదయ్యా"

"చీకటిలో వల వేయటం అలవాటే కదయ్యా"

"అవుననుకోండొరా. కానీ ఈ రోజు జలం కనికరించలేదే"

"కనికరిస్తుందని నాకెందుకో నమ్మకం వుందయ్యా"

"ఎలాగేటి?"

ఎలాగని చెబుతాడు? సిక్స్త్సెన్స్‌కి తెలుగు తెలీదే? మౌనంగా వుండిపోయాడు.

చైతన్యంటే గౌరవంవుంది అందరికీ. అతడి మౌనాన్నిచూసి మనసు నొప్పించానేమో అనుకొని, చుక్కాని రెండుచేతులతోనూ పట్టుకొని "సెప్పుబాబూ_ కుడికా ఎడిమకా" అన్నాడు చంద్రయ్య.

చైతన్య చంద్రయ్యమొహంలోకి చూసేడు.

చంద్రయ్య నవ్వేడు.

చైతన్య నవ్వి "కుడికి" అన్నాడు.

పడవ సర్రున మలుపుతిరిగింది.

అందరూ ఆశ్చర్యంగా చుక్కానివేపు చూసేరు. చంద్రయ్యలేచి నిలబడి, "వల ఎయ్యండ్రా ఆఖరిసారి అదృష్టం చూసుకొందాం" అని అరిచేడు.

వెన్నెలలో అతడి నల్లటి ఒళ్ళు సముద్రంలో నీలినీళ్ళు తళతళా మెరుస్తున్నాయి.

యువకులలో హుషారొచ్చింది.

వల మళ్ళీ జలెదలా సముద్రంమీద పడింది.

అయిదు.... పది.... పదిహేను నిముషాలు.

వల నెమ్మదిగా పైకి లేస్తున్నది.

చైతన్య వూపిరి బిగబట్టేడు.

వల పైకివస్తుంటే "ఓహ్" అన్నశబ్దం చైతన్య నోటినుంచి అప్రయత్నంగా వెలువడింది. వలనిండా మిలమిలా మెరుస్తూ- సన్నగా కదులుతూ పుంజీలకొద్దీ రొయ్యలు!

చంద్రయ్య గొంతు చిరిగిపోయేలా- "రేయ్, పదకొండూ పది హేనురోయ్" అని కేకపెట్టాడు ఆనందంపట్టలేక.

పదకొండూ- పదిహేను కొంటున్న రొయ్య సాధారణంగా దొరకదు.

జాలరుల చేతులు మిషనులలా పనిచేస్తున్నాయి వలని ఖాళీచేసి మళ్ళీ విసిరేరు.

అంతర్లీనమైన నీటి ప్రవాహంతో పాటూ, గుంపులు గుంపులుగా వస్తున్న రొయ్యలు వలలోపడి పడవలోకి చేరుతున్నాయి గంటలో పడవ నిండింది.

జాలర్ల ఆనందానికి అంతులేదు. ఉన్నది పడవ కాకపోతే ఎగిరి గంతులేసి నాట్యం చేసేవాళ్ళే.

చైతన్య పెదవులమీద నవ్వు.

చంద్రయ్య మొహంలో నవ్వు.

సముద్రంమీద వెన్నెల నవ్వు.

వల మడిచేరు.

జాలర్ల చేతులు లయబద్ధంగా కదుల్తున్నాయి.

చంద్రయ్య చుక్కాని పట్టుకొన్నాడు.

"హైలేస... ఐసా.... హైలేసా...."

పదిగొంతులు ఒకే కంఠంలోంచి వస్తున్నట్టుగా పాట....

చైతన్య పడవగట్టుకి అనుకొని, వెనక్కి వాలి కళ్ళు మూసు కొన్నాడు. సముద్రం మీద నుంచి వస్తోన్న గాలి మనసు సేద తీరు స్తోంది. పడవ తీరంవైపు సాగిపోతోంది.

ఒడ్డుకి వరుసగా పడవలు వచ్చి చేరుకొంటున్నాయి. ముందు వచ్చినవాళ్ళు అందరూ నిరాశగా వున్నారు, పీలర్లు సరుకు రాక తెల్ల మొహం వేసుకొని చూస్తున్నారు.

వీళ్ళ పడవ ఒడ్డుకి రాగానే వార్త దావానలంలా పాకిపోయింది.

"ఏచేపు దొరికినయ్—" ప్రశ్న.

"పదకొండూ—పదిహేనోయ్" సంభ్రమం

"రే జగ్గ—రారో—రారో.... అరుపు.

పడవలో దిగినవాళ్ళు బైటవాళ్ళకి జవాబు చెబుతున్నారు క్షణంలో అక్కడి పరిస్థితి మారిపోయింది. ఇళ్ళ కెళ్ళినవాళ్ళు పరుగెత్తుకొస్తు న్నాడు. పడవల్లో పడవల్లో లాంతర్లు అమరుస్తున్నారు.

అంతా హడావిడి. కలకలం.

వేటకాని వింటినుంచి వెలువడిన బాణాల్లా ఒకదాని తరువాత ఒకటిగా పడవలు సముద్రంలోకి దూసుకుపోయినయ్.

రాత్రని లేదు, పగలని లేదు.

చీకటని లేదు, ఎండని లేదు.

కష్టానికి తగిన ప్రతిఫలం దొరుకుతుందా లేదా అన్న ఆలోచన లేదు. అదృష్టాన్ని వెతుక్కుంటూ—రెక్కలు ముక్కలు చేసుకోవటం ఒక్కటే తెలుసు.

బ్రోకర్లు సరుకుచుట్టూ చేరేరు.

"ఎంత ?"

"తెలియనదేముంది బాబూ" చేతులు నులుముకుంటూ అన్నాడు చంద్రయ్య,

జాలర్ల కళ్ళలో ఆశతో కూడిన కుతూహలం

బ్రోకర్ల కళ్ళలో తెలివితో కూడిన హాలాహలం. "నలభై రూపాయలు.!!''

జాలర్లు ఉలిక్కిపడ్డారు. ''నలభై రూపాయలా—"

"తొందరగా చెప్పండి' మనిషిని తొందరబెడ్తే మనసు బలహీనమవుతుందన్న టాక్టిక్స్ బ్రోకర్లకి బాగా తెలుసు.

"చాలా తక్కువ బాబూ—''

నువ్వే చూసినావ్ కదా, వంద పడవలెల్లినయ్. అవి తిరిగొచ్చేయంటే ముప్పై ఎనిమిది రూపాయలయిపోతుంది ధర."

అదీ నిజమే.

సరుకు అమ్ముడుపోదేమోనన్న భయం జాలర్లని మెట్లు దింపుతుంది. నిలవవుంచడానికివనరులు లేవు వాళ్ళదగ్గర. (ప్రభుత్వమూ ప్రభుత్వమా—ఏం చేస్తున్నావు ప్రభుత్వమా?)

ఏదో ఒక ధర అమ్మెయ్యాలి.

కొంచెంసేపు బెట్టుసరి చేస్తే దిగివస్తారని, బ్రోకర్లకున్న నమ్మకం జాలర్లకి లేదు.

చంద్రయ్య క్షణం తటపటాయించేడు.

బ్రోకర్లలో ఎవరో— 'సరే నలభైన్నర ఏసుకో' అనబోవటం చైతన్య గమనించి, చంద్రయ్యని వారించే లోపులోనే అతడనేసేడు. సరే—బాబూ''

పది నిముషాల్లో సరుకు చేతులు మారింది.

జాలర్ల కళ్ళల్లో ఆనందం. తాత్కాలికంగా.... దొరికిన డబ్బు చూసి— వద్దులుకున్న డబ్బు ప్రసక్తి లేదు. దక్కిందే ప్రాప్తం.

"ఎల్లొస్తాం పైద్దొరా''

చైతన్య తలూపేడు.

"పైద్దొర రాకుంటే అలాగే ఎల్లొచ్చేవాల్లం" అనుకుంటున్నారు ఎవరో. అతనికి ఆ ఆనందం లేదు.

మనిషికి మనిషి చేసే అన్యాయాన్ని చూడటం — మనిషిగా మారేత మొదటిసారి. ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో తీసుకొనే డెసిషన్‌ల పరిణామాలు అన్యాయాలికి దారితీస్తాయన్న విషయం గుర్తురాకుండా గుమాస్తాలూ, మానేజర్లు పడబోస్తారు.

జాలర్లు వలేసి పట్టుకొన్న రొయ్యల తాలూకు డబ్బుట్టుకుని ఇళ్ళకి పోయేరు.

బ్రోకర్లు వలేసి జాలర్లని పట్టుకోవటానికి ఇంకా ఆలస్యముందని టీకి పోయేరు.

చైతన్య ఒక్కడే మిగిలేడు.

ఎదురుగా మనిషి పాపంలాటి అంతులేని సముద్రం—మీద దాన్ని క్షమిస్తున్నట్టు తెల్లని వెన్నెల — మనసులో ఘర్షణలా పడిలేచే కెరటాలు.

రెండు చేతులూ జేబులలో పెట్టుకొని, వడ్డు వెంబడే నడవసాగేడు చైతన్య.

అంతా నిర్మానుష్యంగా వుంది.

సముద్రం మీద నుంచి వస్తున్న గాలి జాలిగా అతణ్ణి పరామర్శించి ముందుకు సాగిపోతోంది.

ఎవరో యువకుడు, చిన్న దొప్పెలో కూర్చొని గెడవేసి తోస్తూ విషాదంగా పాడుతున్నాడు.

"కడవుర్తని మీన్ ఇల్ల —ఏలియాయి—
కడంతరానివి మీనిల్ల —ఏలియాయి—

o o o

త్యాగరకడప్పరతిని—వుల్సబమాయె
పోయెవ—తక్కాళి కూకిళి—సెంగిళియె—"

—సముద్రం అంతా ఓడ్చి మీ చేతుల్లో పోసేం. ఒక్క రొయ్య కూడా అక్కడ లేదిక. మమ్మల్ని అన్యాయం చెయ్యకండి. రావల్సిన డబ్బు న్యాయంగా ఇవ్వండి—

"ఈరోజు నేను అకౌంట్స్ చూడాలనుకొంటున్నాను" అన్నాడు రవి.

మానేజర్ తలూపి బైటకెళ్ళేడు.

అయిదు నిముషాల్లో లెడ్జర్ పుస్తకాలు అతని బల్ల మీదకు వచ్చినయ్.

'డే' బుక్ తీసి చూసేడు. దాదాపు పదిహేను రోజుల క్రితం నుంచి వ్రాయబడిలేదు.

"ఏమిటిది" అడిగేడు మానేజర్ని.

మానేజర్ లెడ్జర్ క్లర్క్ని అడిగేడు. అతడు నేలచూపు చూస్తూ మాట్లాడలేదు.

"ఆఫీసులో పని ఎక్కువగా ఉందా? ఇద్దరు చేయ్యాల్సిన పనిని ఒకరే చేస్తున్నారా?"

మానేజరూ క్లర్కూ మాట్లాడలేదు.

"దీన్నిబట్టి చూస్తే—ఎవరైన పైనుండి అడిగితే తప్పమీరు పని చెయ్యరన్నమాట—

క్లర్కు నసుగుతూ 'తొందరలో పూర్తిచేస్తాను సార్'" అన్నాడు

రవి మండి పడ్డాడు. 'తొందరలోకాదు ఈ రోజు పూర్తవ్వాలి ఎంత ఆలస్యమైనా సరే. నేనూవుంటాను. వెళ్ళి వెంటనే మొదలు పెట్టండి" అని, మానేజర్ వైపు తిరిగి "క్యాషియర్ని పిలవండి" అన్నాడు.

క్యాషియర్ వచ్చేడు
"క్యాష్ బ్యాలెన్స్ ఎంతుంది?"
అతడు మాట్లాడలేదు
"చెప్పరేం—" గద్దించేడు.
"మూడు వేలు....
'ఎంతుండాలి?'

'ప....పన్నెండువేలు' అని చప్పున దణ్ణంపెట్టి "బాబూ పిల్లలు కలవాణ్ణి రెండురోజులు టైమివ్వండి, కట్టేస్తాను' అన్నాడు ఇంకొంచెం మాట్లాడితే ఏడ్చేలా వున్నాడు.

రవి మానేజర్ వైపుతిరిగి, "ఈయనికి మెమోయివ్వండి. ఇదే ఆఖరి వార్నింగ్" అన్నాడు. క్యాషియర్ దణ్ణాలు పెడ్తూవెళ్ళి పోయేడు.

ఇకవంతు తనదే అన్నట్లూ మానేజర్ నిలబడ్డాడు.
రవి ఏమీ అనలెదు. నిజమైనమానేజర్ తనే అని అతడికి తెలుసు. అలాటిది తనే నిర్లక్ష్యంగా వుంచి. ఇంకొకళ్ళని అనటంలో రీజన్ లేదు....

....ఆరోజు లెక్కలు పూర్తయ్యేసరికి రాత్రి పదయింది.
అప్పటి వరకూ ఆఫీసులోనే కూర్చొని కాగితాలు అన్నీ ఓపిగ్గా చూసేడు. స్టాఫంతా ఇతడితో పాటు వుండిపోయింది. చివరికి లెక్క చూసుకొంటే అతనికి గాభరాపుట్టింది.

"డెట్ ఈక్విటీ—కరెంట్ రేషో" లాటి పెద్దపెద్ద పదాలుఅతడికి తెలియవుకానీ—ఈ పరిస్థితి యిలానేసాగుతే ఇంకో సంవత్సరం తిరిగే సరికల్లా ఫ్యాక్టరీ మూతపడటం ఖాయం అన్న విషయం మాత్రం ఆ మైంది.

ఆ తరువాత చాలాసేపు మానేజర్‌తోమాట్లాడుతూ వుండిపోయేడు.

పదకొండున్నరకి బైటకి వస్తోంటే ఫస్ట్‌షో నుంచి యింటికి వెళ్తొన్న పాతస్నేహితుడు కనబడ్డాడు. కార్లో ఎక్కించుకున్నాడు.

"ఏమిటసలు కనబడటం లేదు?" అడిగేడు అతడు

"చూస్తున్నావుకదా. ఇప్పుడు వెళ్తున్నాను యింటికి.' అన్నాడు రవి.

"కొంచెంసేపు ఎక్కడన్నా కూర్చొందాం. చాలా కాలం అయింది కలిసి-' అన్నాడు స్నేహితుడు.

రవికి కూడ చాలా ఆసటగా అనిపించింది. ప్రొద్దున్నించి చూసిన లెక్కలూ, వాటి పరిణామాలూ....కారుని బార్ కాంపౌండిలో ఆపేడు.

ఇద్దరూ ఓ అరగంట గడిపేరక్కడ.

స్నేహితుడి దగ్గర శలవు పుచ్చుకుని, రవి యింటికొచ్చేసరికి దాదాపు పదకొండున్నర అయింది. అతడికి ఆ రోజు చాలాసంతోషంగా వుంది. తనుచేసిన పనిని భార్యకి చెప్పిమెప్పు పొందాలన్న చిన్న ఆశతో కూడిన సంతోషం.

అదే సమయానికి ఇంట్లో కిరణ్మయి అతడికోసంఎదురు చూస్తోంది అమెవళ్ళు మండి పోతోంది. తనేమో యీ విషయాల పట్ల తల బద్దలు కొట్టుకొని ఆలోచిస్తూవుంటే ఈ మహాశయుడు అర్ధరాత్రి వరకూ బజాలర వెంటాబారులవెంటా తిరుగుతున్నాడన్న మాట! ఆమె అరోజు అసంగతి ఆటో యిటోతేల్చేయాలను కొంది అందుకే రవి తలుపు కొట్టగానే ఆమే వచ్చితలుపుతీసింది.

రవి లోపలికి రాగానే—అతడు తాగివచ్చినట్టు పసిగట్టింది. దాంతో ఆమె కోపం అవధులు దాటింది. "నీకు బుద్ధిలేదు రవీ ఇంత బాధ్యతా రహితంగా పుట్టినందుకు నీవు సిగ్గుపడాలి" అంది.

ఆమె అలా మాట్లాడటం కొత్తకాదు. కానీ యింతకు ముందు సంగతి వేరు. ఆరోజు అతడు బాగా శ్రమపడి వున్నాడు. మానసికంగా విశ్రాంతి కోరుకొంటున్నాడు. ఆ పరిస్థితుల్లో ఆమె అలా మాటలోడటం అతడికి చిరాకు తెప్పించింది.

"నోర్మూయ్" అన్నాడు విసురుగా.

ఊహించని ఆమాటలకి ఆమె అదిరిపడినా, వెంటనే సరుకొని, 'ఏం—ఎందుకని' అని రెట్టించింది.

కోపంతో ఆమె మొహం ఎర్రబడింది.

"నేనన్నమాటలలో ఏమాన్నా తప్పుందా. నువ్వు ప్రవర్తిస్తున్న విధానానికి...." రవి తలతిప్పితీక్షణంగా చూడటంతో అర్ధాంతరంగా మాటల్ని ఆపుచేసింది.

రవి క్షణంపాటు సూటిగా ఆమెని చూసేడు. చప్పున ఫోను దగ్గర కెళ్ళి ఆఫీసుకు డయల్ చేసేడు.

'ఎవరూ? వాచ్‌మన్ అ.... నేనే రవిని' అంటూ కిరణ్మయి వైపు తిరిగి 'ఇట్రా' అన్నాడు. అకంఠంలో కనబడిన ఆజ్ఞకి ఆమె అప్రయత్నంగా అడుగు ముందుకేసింది.

అతడు ఫోన్‌లో—'చెప్పువాచ్‌మన్ నేనెంత సేపు 'మీ' ఆఫీసులో వున్నానో, మీ యజమానురాలికి చెప్పు" అని విశ్శ్రేంషగా విలబడ్డ ఆమె చేతిలో రిసీవర్ విసురుగా పెట్టిమేడ మీదకు వెళ్ళిపోయాడు.

తలుపు ధఢేలున వేసి పక్కమీదకు వాలి పోయేడు.

అతడిని ఒక్కసారిగా భరించలేనంత విస్పృహ ఆవరించింది.. చాలా ఏకాకినన్న భావం

కిరణ్మయి ఫోన్ పెట్టేసి, తొందరతొందరగా వచ్చేసరికి అతడి తలుపు వేసివుంది. పక్కకిటికిలోంచి చూసింది.

గదంతా నిశ్శబ్దంగా వుంది గడియారం చప్పుడు తప్పమరేమీ వినబడటంలేదు చెయినుదుటి మీద అడ్డంగా పెటుకుని అస్తవ్యస్తంగా పడుకొని వున్నాడు అతడు.

అతడి కంటి నుంచి ఒక నీటిచుక్క చెక్కిలి మీదుగా తలదిండు మీదికి జారుతోంది.

ఆమె కిటికీ వూచని పట్టుకుని చాలా సేపు అలానే నిలబడి పోయింది.

తల్లికీ, చెల్లికీ ఇవ్వకుండా దాచుకొన్న ప్రేమని భార్యకి అర్పిద్దా మనుకొన్న సున్నిత హృదయుడు— ఆమె స్వీకరించలేకపోతే ప్రపంచంలోకెల్లా దురదృష్టవంతుడు.

ప్రేమ డబ్బుతో వస్తుందా ?

o o o

చీమ చిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దంగా వుంది అక్కడ.

చైతన్య కూర్చొని వున్నాడు.

అతడి ఎదురుగా కొంతమంది కూర్చొని వున్నారు. కొంతమంది చేతులు కట్టుకొని నిలబడి వున్నారు.

అందరి కళ్ళల్లోనూ ఏదో వూహించనిది విన్న ఆశ్చర్యం, కొందరి కళ్ళల్లో సంభ్రమం. మరి కొందరిలో సంశయం.

చైతన్య లేచేడు. "ఆలోచించుకోండి. తొందరలేదు. కానీ ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం పెట్టుకోండి ఒక్కసారి నిర్ణయం తీసుకున్నాక వెనక్కి వెళ్ళడటం ప్రసక్తి లేదు "

అతడు యింటికొచ్చేక శారద నవ్వుతూ అడిగింది— "ఏమిటి? స్ట్రయిక్ చేయిస్తున్నారుట ?"

"అంతంత పెద్ద మాటలెందుకు" అన్నాడు చైతన్య. "ధర— డిమాండు, సప్లయ్‌ల మధ్య నిర్ణయింపబడుతున్న చిన్న సత్యం తెలియని స్థితిలో వున్నారు జాలర్లు. నేను చేస్తున్నదల్లా సప్లయ్‌ని కృత్రిమంగా తగ్గించడమే."

"కానీ అవతలి వైపున్నవాళ్ళు చాలా శక్తివంతులు. బాగా డబ్బున్నవాళ్ళు—"

"ఈ జాలర్ల వెనుక నున్నవాడు కూడా అంత తీసివేయదగ్గవాడు కాదు." అన్నాడు చైతన్య. "వీళ్ళు కొద్దిగా మాట మీద నిలబడితే చాలు. చిన్న ఆట ఆడిస్తాను"

ఆ మరునటి రోజు వరకూ ఆగనవసరం లేకపోయింది. ఆరాత్రి దాదాపు పదకొండు అవుతూ వుండగా చంద్రయ్య మరి నలుగుర్ని తీసుకొని యింటికి వచ్చేడు.

"అందరం కలిసే ఆలోచించేం బాబూ— ఒక మాట మీదకొచ్చేసినం. మీరు చెప్పింది సేస్తం."

చైతన్య వెంటనే వప్పుకోలేదు. "బాగా ఆలోచించండి. కొంత మంది పడిపోయినా మొత్తం నష్టపోవలసి వస్తుంది."

చంద్రయ్యతో వచ్చిన నలుగుర్లో ఒకడు ముందుకొచ్చేడు. "లేదు పెద్దోరా. గంగమ్మ తల్లి దగ్గర ఒక్కరొక్కర్నీ ప్రమాణం చేయిస్తాం. ఒక్కసారి చేసినారంటే మళ్ళీ మాట తిరిగిపోరు...."

చైతన్య తలూపేడు.

....... మరునటి రోజు నావలు సముద్రం మీదకు వెళ్ళి తెచ్చిన రొయ్యల్ని అమ్మకానికి పెట్టేరు జాలర్లు.

"ఎంత ?"

"డెబ్బై రూపాయలు"

బ్రోకరు ఉలిక్కిపడి, అంతలోనే సర్దుకొని "ఈ ఒడ్డున ఏరోజైనా యాభై దాటిందట్రా ధర ? నీ యిన్నేళ్ళ జీవితంలో చూసేవా ?" అడిగేడు.

"సూడ్లేదు. కానీ బ్రతికుండగానే సూడాలనుకొంటున్నాం" ఒక యువకుడు నిశ్చలంగా సమాధానం యిచ్చేడు.

"పోనీ యాభై అయిదేసుకోండి—"

"పైస తగ్గేది లేదు"

"ఇంకో వంద పడవలు వస్తయి. ధర నలభై అవుద్ది"

"రానీ—"

వచ్చినయ్. వంద పడవలూ వచ్చినయ్. కానీ అంతా ఒకే ధర—డెబ్బై రూపాయలు.

"కొనకుంటే ఏం చేస్తారుట ?" తుపుక్కున చుట్ట వుమ్మేస్తూ అడిగేడు గంగరాజు. ఆయనే అందరికన్నా పెద్ద కొనుగోలుదారు. చేతిక్రింద నాలుగు పెద్ద పీలింగ్ యూనిట్లున్నాయి.

బ్రోకరు నవ్వేడు. "మళ్ళీ సముద్రంలో పారేస్తారేమో సూద్దామండి" అన్నాడు.

రొయ్యలు సముద్రంలో పడలేదు. ఒక లారీ వచ్చి తీసుకుపోయింది.

"ఎక్కడికి పెళ్ళేయిరా అవి ?"— గంగరాజు అడిగేడు.

"కోల్డ్ స్టొరేజికండి—"

గంగరాజు కళ్ళు ఆశ్చర్యంతో టపాటపా కొట్టుకొన్నాయి. అంతలో సర్దుకొని నవ్వేడు. "ఎన్నాళ్ళుంచుతారంట స్టొరేజిలో ? అద్దె వాళ్ళ బాబు కడతాడా ?"

అదే సమయానికి చైతన్య కోల్డ్ స్టొరేజి యజమాన్లతో మాట్లాడుతున్నాడు.

"మా దగ్గర డబ్బులేదు. కానీ సరుకుంది. ఇప్పటి రేటు పట్టి వెల కట్టండి. మీ అద్దె—యీ వెలా సమానం అయినరోజు సరుకంతా మీరే తీసుకోండి. అలా అని అగ్రిమెంటు రాసుకొందాం. ఇప్పుడు మాత్రం అద్దె అడక్కండి—"

స్టోరేజి యజమాన్లకి ఇందులో నష్టం ఏమీ కనబడలేదు. ఒప్పుకున్నారు.

అగ్రిమెంటు సైన్ అయ్యాక లేస్తూ చైతన్య అన్నాడు. "కొంత మంది జీవన్మరణ సమస్య యిది. దీనికి మీరు చేయూత యిచ్చినందుకు కృతజ్ఞతలు. ఇదే మానవతా వాదంతో ఇంకో చిన్న సాయం చెయ్యండి. దయచేసి మన అగ్రిమెంటు సంగతి మూడో కంటికి తెలియనివ్వకండి— అదే మేము కోరే సహాయం."

దీనికీ వాళ్ళు ఒప్పుకొన్నారు.

.... .... ....

"ఎక్కణ్ణుంచి తెచ్చి కడుతున్నార్రా డబ్బు?" గంగరాజు అడిగేడు.

"తెలీదు బాబూ—"

"చూద్దాం ఎన్నాళ్ళు బింకంగా వుంటారో?— రేయ్ — పక్కూర్లో రేటు కనుక్కొని దొరికిన సరుకంతా కొనెయ్—"

అయిదు నిముషాల్లో వాడు మొహం వేలాదేసుకొచ్చేడు. "పక్కూర్లో ధర అరవై రూపాయలైందట దొరా. మనూరి రాజుగారు వున్నదంతా అప్పుడే కొనేసేరంట. అంతే కాదు బాబూ— అల్లు కూడా రేపట్నించీ డెబ్భైకి పైన తక్కువయితే అమ్మరంట—"

తీర ప్రాంతం అంతా దావానలంలా వ్యాపించిపోయిందీ వార్త. అప్పటివరకూ కొన్ని సిద్ధాంతాల మధ్య కంట్రోలు చెయ్యబడుతున్న

ధరలో ఈ కుదుపుకి అకస్మాత్తుగా ఎత్తు పల్లాలొచ్చినయ్. కొంతమంది అరవైకి అమ్ముతుంటే మరి కొంతమంది ఎనభై వరకు వెళ్ళేరు.

"ఇది స్ట్రయిక్ కాదు. సరుకుంది. కావల్సిన వాళ్ళు కొనుక్కో వచ్చు. ధర దెబ్బే ... ఇంకొన్ని రోజులుపోతే కోల్డ్ స్టోరేజి అద్దెతో కలుపుకొని ఎనబయి చేయాల్సి వస్తుంది" ప్రకటించేడు చైతన్య

పీలర్లు దిగి రాలేదు.

దిగిరారని తెలుసు. అది అంతసులభంకాదు. ఇంక ఎన్నాళ్ళో తను స్టాకు ఆపుజెయ్యలేడు. కానీ ఈ సమయంలోనే బింకంగావుండాలి.

పక్కకేంద్రాలవాళ్ళు ఈ చర్యతో తాత్కాలిక లాభం పొందు తున్నారు. ధర కొద్దిగా పెరిగింది. ఆ కొద్దిపెరుగుదలతోనే వాళ్ళు సం తృప్తి పడుతున్నారు. సరకు అమ్మేస్తున్నారు. అదే దెబ్బతీస్తోంది. కనీసం కొన్నిమైళ్ళ తీర ప్రాంతంలో అయినా ఈసరుకుని కంట్రోల్ చేయగలి గితే బావుణ్ను కానీ ఎలా?

చైతన్య మనసు పాడయింది.
ముఖ్యంగా తన మాట నమ్మి యిందులో దిగిన చంద్రయ్య పరి స్థితి చూస్తోంటే! అతడు చాలా యిరకాటంలో పడిపోయేడు.

తీర ప్రాంతంలో పడవలు కదలటం లేదు.
కానీ ఎన్నాళ్ళు కదలకుండా వుంచగలరు?
కొంతలో కొంత నయం! వీళ్ళకి, పని చెయ్యకపోతే తిండి ఎలా అన్న సమస్య లేదు. నాలుగు చేపలు పడితే కడుపు నిండుతుంది.

మిగతా ప్రాంతాలవాళ్ళు తమ సరుకు కొద్దిగా హెచ్చు ధరకి అమ్మేస్తూనే, వీళ్ళని గమనించిసాగేరు. వీళ్ళుగాని తమ పంతం నెగ్గిం

చుకొని, ధరని ఇంకా పెంచగలిగితే వాళ్ళు ఆ ధరకే అమ్ముతారు లేక పోతే నష్టపోయేది వీళ్ళే. అంతేగాని. వీళ్ళ చర్యకి తోడ్పాటుగా వాళ్ళేమీ సహాయం చేయరు.

ఈ జాలర్ల జీవితం విచిత్రమైంది. భవిష్యత్తుగురించి ఆలోచన అవలులేదు. మామూలప్పుడు ఎంత నికృష్టమైన జీవితం గడుపుతారో- అదృష్టంబావుంది మంచి రొయ్య దొరికి, అయిదారువేలు ఒకరోజు చేతిలోపడితే అకస్మాత్తుగా ధనవంతులు అయిపోతారు.

ఆ నీలి ఎరుపు (ప్రభుత్వ నిబంధనల ప్రకారం ధరించవలసిన) దుస్తుల్లోనే స్టార్ హోటల్స్‌లోకి వెళ్తారు. రెండ్రోజులలో అంతా ఖర్చు పెట్టేస్తారు. తరువాత మళ్ళీ మామూలే_ బీదతనం! చెల్లెళ్ళనీ భార్యల్నీ బ్రోకర్ల కప్పగించే బీదతనం_ ఆ బీదతనంతో ఆడుకొనే మనీ లెండర్లు. మళ్ళీ చర్విత చరణం ...

తాడూబొంగరంలేని యిలాటివాళ్ళని తమమాటమీద కట్టుబడి వుండేట్టు చెయ్యటానికి చైతన్య కష్టపడవలసవచ్చింది. కానీఅవతలివ్యక్తులు సామాన్యులువారు. గంగరాజులాటివాళ్ళ వ్యాన్లునిండా ఐస్‌నింపుకొని దూర ప్రాంతాలకి వెళ్ళి రొయ్యల్ని తెస్తున్నాయి. వ్యాపారం సాగిపోతోంది, ఆ ప్రాంతీయజాలర్లు నిస్సహాయంగా చూస్తూ వూరుకోవలసివస్తోంది.

"కరెంటు తీగల్ని కలుపుదామయ్యా" అన్నాడు చంద్రయ్య.

"ఏమవుతుంది?" అడిగేడు చైతన్య.

"కరెంటుపోతే ఐస్ తయారవదు. దూరంనుంచి సరుకు తెచ్చే వీలుండదు"

ఒప్పుకోలేదు చైతన్య. అలా జరిగినవెంటనే పోలీసులు రంగం లోకివస్తారు

పొలిటీషియన్ పోలీసుల్ని రంగంలోకి అహ్వానిస్తారు, బిజినెస్ మాన్ వాళ్ళకి దూరంగావుండటానికి ప్రయత్నిస్తారు.

"మరెలా ... ఏం సేద్దామిప్పుడు?" చంద్రయ్య అడిగాడు.

చైతన్య ఆలోచించాడు. కానీ అతడికేమీ పాలుబోవటంలేదు. సమస్య సముద్రం అంతపెద్దది,

అందరూ అతడి సలహాకోసం చూస్తున్నారు.

"నాకు రేపటివరకూ టైమివ్వండి" అన్నాడుచైతన్య. ఆలోచించి చెబుతాను."

అందరూ మౌనంగా అక్కడ్నుంచి వెళ్ళిపోయారు.

ఆ మౌనమే అతణ్ని బాధపెడుతోంది. ఏదో చెయ్యాలి!

మరొనాసటిరోజువరకూ టైముంది.

కానీ ఏదయినా అద్భుతం జరిగితేతప్ప- ఈలోపులో పరిష్కారం దొంకదు.

చికాకుగా యింటికి బయలుదేరాడు.

ఆనవసరంగా ఇందులో వేలుపెట్టానా అని అతడు ఎప్పుడూఅను కోలేదు. కానీ ఏ మూలనుంచి తనాశించిన సపోర్టు రాకపోవటంతో ఆం దోళన చెందుతున్నాడు.

అతనింటికి వచ్చేసరికి రాత్రిఎనిమిదయింది.

కాంపౌండు క్రలగేటు తెరుచుకొని లోపలికి ప్రవేశించాడు. వెన్నెలలో బంతిపూలు మరింత అందంగావున్నాయి.

లోపలికి వెళ్ళబోతున్నవాడల్లా ఆగిపోయేడు. లోపల శారదసాధన చేస్తున్నట్లుంది. నాదం గాలిలో అలలు అలలుగా తేలివస్తోంది

అతణ్నిచూసి ఆమె లేవబోయింది. సైగతోనే వద్దని వారించి, కిటికీ పక్కగా కుర్చీలో కూర్చున్నారు.

ఆమె సన్నటివేళ్ళు తీవెలమీద అలవోకగా గదులుతున్నాయి. తరం గాలు తరంగాలుగా వస్తున్న ఆ నాదం మనసును సేదతీరుస్తోంది.

వెనక్కువాలి కళ్ళుమూసుకొన్నాడు.

పదినిముషాలపాటు అతడు ప్రపంచంలోని సర్వబాధల్నీ, తనని వేధిస్తున్న సమస్యలన్నీ మర్చిపోయేడు.

ఆమె ఆపుచెయ్యగానే "ఆనంద భైరవికదూ?" అని అడిగేడు.

శారద చిరునవ్వుతో "కాదు.... నీలాంబరిలో శృంగారలహరి" అంది.

అతడు కళ్ళుతెరచి- "నాకంతగాతెలీదు రాగాలసంగతి" అన్నాడు

ఆమె వీణ పక్కగాపెట్టి లోపలికి వెళ్ళింది.

అతడు కిటికీలోంచి బయటకు చూసేడు. సన్నటి వెలుగు రేఖలు చెట్ల సందుల్లోంచి భూమ్మీదపడి, విశ్లేషణం చెందుతున్నాయి, చిన్నమబ్బు తునక నెమ్మదిగా ఉత్తరదిక్కువైపు సాగిపోతోంది.

అతడికెందుకో రిలాక్సయినట్టు అనిపించింది. ఏంతో శ్రమపడ్డాక ఎన్నో ఆలోచనలతో మనసు వేగిపోయేక అంత చిన్నపర్ణశాలలో అంత సులభంగా రిలాక్సయ్యే సాధనం కనిపించటం అతడికి ఆశ్చర్యంగా అనిపించలేదు

o o o

"రిలాక్స్" అన్నాడు రవి. కిరణ్మయి మాట్లాడలేదు.

"నువ్వు నన్ను తిట్టకు. అర్ధంచేసుకో. ఎంతో అలసిపోతాం పొద్దున్నుంచీ. సాయంత్రం అయ్యేసరికి ఒక చిన్న పెగ్‌తీసుకొంటే ఆ అలసట పోతుంది. ఎంతో రిలాక్సింగ్‌గా వుంటుంది"

"ముందొక పెగ్గే తరువాత ఒక సీసాఅవుతుంది"

"నీకు తెలీదు కిరణ్- ఈ బిజినెస్ వ్యవహారాలు...." అంటూ

ముందుకువంగి వచ్చిజెప్పబోతున్నట్టు ఏదో అనబోయేడు.

ఆమె తన సహజస్వరంతో అతడి మాటల్ని ఖండిస్తూ అంది. "ఏమిటి నువ్వుచూస్తున్న బిజినెస్ వ్యవహారాలు? ఈవేళ ఐదో తారీఖు. ఇంతవరకూ నువ్వు, జీతాలే ఇవ్వలేదట"

అతడు ఆ రెండో వాక్యం వినలేదు. "ఈవేళ ఐదో తారీఖా" అంటూ చివ్వున కుర్చీలోంచి లేచి ఫోన్‌దగ్గరకి వడవడిగిత్తాడు.

అవతలివేపు మానేజర్ కంఠం వినబడగానే "మానేజర్‌గారూ" అని అరిచేడు. "ఈవేళ ఐదో తారీఖు. ఇరవయ్యో తారీఖులోగా షిప్

"ఇరవయ్యో తారీఖా?.... నాకు తెలీదే" అవతల్నుంచి మానేజర్ అన్నాడు.

మెంట్ జరిగిపోవాలి. మర్చిపోయేరా-"

ఆ కాగితం తన డ్రాయర్లోనే వుందన్న విషయం జ్ఞాపకంవచ్చి నాలుక్కర్చుకొని అంతలోనే ఆ విషయం కిరణ్మయి గమనిస్తుందని భయపడి సర్దుకొంటూ "సర్లెండి- వ్యాన్లన్నిటినీ పంపించండి. ఎక్కడ ఎంత దొరుకుతే అంతవరకూ ఏ ధరకయినాసరే కొనెయ్యమనండి" అన్నాడు.

"ఏ ధరకయినానా?...." సంశయిస్తూ అడిగాడు మానేజర్.

"లేకపోతే కాంట్రాక్టు ఎలాపూర్తిచేస్తారండీ?" ఫోన్ బ్రద్దలయ్యేలాఅరిచాడు రవి.

ఇక్కడ రవి తీసుకొన్న యీ నిర్ణయం, సరయిన సమయంలో అక్కడ చైతన్యకి సాయపడింది. ఆ రోజు సాయంత్రమే ఒక వ్యాన్ వచ్చి ఆ ప్రాంతంలోవున్న సరుకునంతా డెబ్బైరూపాయల చొప్పున కొనుక్కువెళ్ళిపోయింది.

ఈ చిన్న సంఘటన ఆ తీరప్రాంతాల పరిస్థితిని మొత్తం మార్చేసింది.

తన సరకుని తను చెప్పిన దరక ఎవరో కొనటానికి సిద్ధపడ్డారని తెలియగానే చైతన్య ఆశ్చర్యపోయినా కొద్ది ప్రయత్నంతో ఆశ్చర్యాన్ని నొక్కిపట్టి అది తనకు తెలిసినట్లే ప్రవర్తించేడు. అతడి ప్రవర్తపని చాలా క్లోజ్‌గా పరిశీలిస్తున్న బ్రోకర్లు- ఇది అర్థంకాక తలలు బద్దలుకొట్టు కొంటున్నారు.

ఇంతలో యునైటెడ్ స్టేట్స్‌కి సంబంధించిన ఎగుమతిదారు పద కొండు డాలర్లు ఇవ్వటానికి సిద్ధపడ్డాడనీ- అందుకే సరుకుఅలాఅమ్ముడు పోయిందనీ ఓ రూమరు పుట్టించి. దీన్ని పుట్టించింది చైతన్య.

చైతన్య మాటవిని సరుకుని అప్పటివరకూ దాచిన జాలర్ల ఆనం దం పట్టశక్యంకాలేదు. వారి ఆనందాన్ని మరింత ప్రతిబింబించటానికి కావల్సిన చర్యలన్నీ తీసుకొన్నాడు చైతన్య.

అమాయకత్వంకూడా ఒక్కోసారి మంచికే దారితీస్తుంది.

రెండురోజులు సరుకు ఆపి, కేజీకి ఇరవై రూపాయల లాభం పొందొచ్చని వాళ్ళ కళ్ళముందు ప్రత్యక్షంగా కనబడుతూవుంటే తక్కువ ధరకి అమ్మటానికి ఎవరూ ముందుకురాలేదు.

ఒకర్నిచూసి ఒకరు- వాళ్ళనిచూసి ఇంకొకరు ఇలా అందరూ సరుకు బిగదీసేసరికి పరిస్థితి గందరగోళమైపోయింది.

ధర ఎనభై తొంభై మధ్యకి వెళ్ళింది.

దీంతో బ్రోకర్లు గింగిర్లాడిపోయేరు.

ఎగుమతిదార్లు ఏంచెయ్యాలో తెలియక తల్లబద్దలుకొట్టు కొంటున్నారు.

చైతన్య పరిస్థితిని గమనించసాగేడు. తాడు తెగేవరకూ లాక్కో డదని అతన్కి తెలుసు. జపాన్‌లో ప్రాన్స్ కన్స్యూమర్స్ సొసైటీ (రొయ్యలు తినేవాళ్ళ సంఘం) ఏర్పడిందనీ, ఒకధరకు మించి కొనకూ డదని నిర్ణయించిందనీ అతడు క్రితంరోజు పేపర్లోచదివేడు.

కానీ ఇంకా తాడుతెగేస్థితి రాలేదు.

ఇంతలో ప్రాన్స్ ఎక్స్‌పోర్టర్ల అసోసియేషన్ నుంచి అతడికీ సంప్రదింపులకి పిలుపొచ్చింది.

అన్ని బలగాలూ సరిగ్గా వున్నాయో లేవో నిర్ధారణచేసుకొని, మంత్రిని జరిపి 'షా' చెప్పే సమయం వచ్చింది,



విశాలమయిన ఎయిర్ కండిషన్డ్ రూమ్ మధ్య వెడల్పాటిటేబిల్ టేబిల్మీద తెల్లటిగుడ్డ, మూడు యాష్ ట్రేలు, చిన్న ప్లవర్ వేజ్.

ప్రతి మెంబర్ముందూ రైటింగ్ ప్యాడ్ పెన్సిల్ గాజుగ్లాసుతో నీళ్ళు....

టేబిల్ చెరోవేవునామెంబర్లు కూర్చొనివున్నారు. ఒకవేపుచైర్మన్ భైరవమూర్తి కూర్చొన్నాడు. ఇవతలివేపు కుర్చీ జాలర్ల తరపు ప్రతినిధి కోసం కేటాయించబడింది, గదిలో నిశ్శబ్దం తాండవిస్తున్నది.

కుడివేపు రెండో కుర్చీలో గంగరాజు కూర్చొనివున్నాడు. అతడు రాసుకొన్న సెంటు పరిమళం గాలిలో కలిపి గదంతా వ్యాపిస్తున్నది' దాన్ని గొంపటంకోసం చుట్టని వెలిగించేడు.

పది అవటానికి ఇంకా రెండు నిముషాలుంది.

గంగరాజు విసుకుగా కుర్చీలోంచి కదిలి "ఊరూపేరూలేని జాలరి కోసం ఏమిటీ హంగంతా?'' అన్నాడు.

భైరవమూర్తి మాట్లాడలేదు. నవ్వి వూరుకొన్నాడు.
ఆ నవ్వులో చాలా అర్థాలున్నాయి.

ఆ వాతావరణాన్నీ, అంతమంది మనుష్యుల గాంభీర్యాన్నిచూస్తే ఆవతలివ్యక్తికి అదోలాంటి జంకుకలగటం సహజం. భైరవమూర్తికి కావలసింది అదే. వస్తున్నవాడు లేమికి ప్రాతినిధ్యం ఇచ్చేవాడు!! ఒక్కసారి ఎయిర్ -ండిషన్డు రూమ్లోకి రాగానే సగం ధైర్యంపోతుంది.

అందమైన చైనీస్ పింగాణీ ప్లేటులో జీడిపప్పుతింటూ వాళ్ళ

ప్రోబ్లమ్స్ వచ్చేస్తాయి. అద్భుతమైన భాష— ఎనిమిదిమంది ఒక్కడ్ని కన్విన్స్ చేసినవిధానం— ఆ ప్రతిపత్తిని ఉక్కిరిబిక్కిరి చేస్తాయి. దేని కయినా వప్పుకొంటాడు. ఆ మత్తు బయటకొచ్చిన తరువాత విడిపో తుంది. కానీ అప్పటికే అంతా అయిపోతుంది.

ఇదీ ట్రిక్- భయిరవమూర్తి ఉపయోగించదల్చుకొన్నది.

ఇది మామూలు కార్మిక నాయకులకి వర్తించదు. కానీ ఇప్పుడు. చర్చలకి వస్తోంది అధమాధమ వర్గానికి చెందిన ప్రతినిధి చాలా సుల భంగా బుట్టలో పడెయ్యొచ్చు.

"ఈళ్ళకి టైమ్‌విలువకూడా తెలియదు" అన్నాడు గంగరాజు కుర్చీలో మళ్ళీ అసహనంగా కదిలి.

"ఇంకా పనవలేదుగా" అంటూవుండగానే గడియారం పదికొట్ట డం తలుపు నెమ్మదిగా తెరుచుకోవడం ఒకేసారి జరిగినయ్.

అందిరిదృష్టీ అటుమరలింది.

చైతన్య లోపలికి వచ్చేడు చాలా సాదాదుస్తులలో వున్నాడతడు. కానీ అతడికళ్ళలో తీక్షణనీ చురుకునీ భయిరవమూర్తి ఒక్కడే కనిపెట్ట గలిగేడు?

ఎవరికీ అతడ్ని విష్‌చెయ్యాలన్న భావనకూడా రాలేదు. ఏదో తప్పనిసరి అయితే ఈ సమావేశానికి ఒప్పుకొన్నట్టు వున్నారందరూ. అతడీ విషయాన్ని మొదటిచూపులోనే గుర్తించేడు.

"నీపేరు?" భయిరవమూర్తి అడిగాడు.

"చైతన్య. కృష్ణ చైతన్య"

"చూడు చైతన్యా" సమావేశాన్ని ప్రారంభిస్తూ అన్నాడు భయిరవమూర్తి. "ఈ ప్రాంతపు చరిత్ర చాలా గొప్పది. ఎవరికి ఎంత

కావల్సివచ్చినా లేదనకుండా సప్లయిచేసే శక్తి ఒక్క మనజాలర్లకేంవు దని ప్రతీతి. అటువంటి పేరు చెడగొట్టుకోవటం మనకి మంచిదికాదు.

''మధ్యలో ఆపుచేస్తున్నందుకు క్షమించాలి.'' అన్నాడువినయంగా చైతన్య. "మా జాలర్లు ఎవరికన్నా సరుకులేదన్నారా? నాకింతవరకూ యీ సంగతి తెలియదే? యీ విషయాన్ని ఇప్పుడే కనుక్కొంటాను. ఎవరికెంత సరుకు కావాలో చెబితే మావాళ్ళని రాత్రి పగలు అవికూడా చూడకుండా వెళ్ళి తెమ్మని చెబుతాను ఇన్నాళ్ళనుంచీ నిలబెట్టుకొంటూ వస్తున్న ఖ్యాతిని యీ రోజు మావాళ్ళు పాడుచెస్తారని నేను అనుకోను"

చుట్టూ అందంగా పూలుకట్టబడిన వాడిబాణం గుచ్చుకొన్నట్టు అయి అక్కడున్న ఎనిమిదిమందికీ నిముషంపాటు ఏంమాట్లాడాలో తెలియలేదు.

భయిరవమూర్తే ముందు తేరుకొన్నాడు. "నిజమే! కాని ఈ ధర" అన్నాడు. మీ ధరా మా ధరా ఒకటే అయితే మరి మాఖర్చులూలాభాల సంగతి?"

"మీరు చెప్పింది విజమే" అన్నాడు చైతన్య. "ఇక్కడన్నీ ఒక టన్ను- రెండుటన్నుల మిషన్లు. చిన్నరొయ్యలే లాభదాయకం మనకి అయిదుటన్నుల మిషనయితే పెద్దరొయ్యలకి లాభదాయకం. ఎవరియినా పెట్టదల్చుకొంటే ఎంత లాభంవస్తుందో లెక్కలుకట్టి బ్యాంకులకి ప్రభు త్వానికీ చెబుదాం. మీరేమో ప్రక్కప్రాంతంనుంచి చిన్నవి తెప్పించుకో వచ్చు. మేం ఆ పెద్ద మిషనుకి సప్లయి చేస్తాం. దాంతో మన జాలరుల ఖ్యాతి మరింత ఇనుమడిస్తుంది. మీకూ సమస్య ఉండదు."

గంగరాజు మెదడుకి అతడు చెబుతున్నదిఏమీఅర్థంకాలేదు. కాని రక్తం ఇంకిపోయిన భయిరవమూర్తి మొహంచూసి ఏదో పెద్ద తిరకాసు వుందని గ్రహించేడు. దాంతో మామూలు మర్యాదలు మర్చిపోయికుర్చీ లోంచి లేచి బిగ్గరగా అరిచేడు.

"రాత్రికి రాత్రి నావలు తెప్పించెయ్యగల్ను జాగ్రత్త. అంత పరపతి లేదనుకొన్నావా ఏం?"

చైతన్య ముందుకు వంగి "ఎలాగూ మీ పరపతి ఉపయోగించవలసి రావచ్చు మేం పెద్ద ప్లాంట్‌కి సప్లయి చేస్తే మరి మీకు సప్లయ్ చేసేవాళ్ళుండాలి కదా అయితే ఒక చిక్కుంది ఇందులో. మేం డెబ్బయ్ రూపాయలికి అమ్ముతుంటే వాళ్ళు యాభయికి మీకు అమ్మాలి. అమ్ముతారులెండి వాళ్ళు మీ వాళ్ళేకదా–" అన్నాడు తాపీగా.

దాన్నే మామూలు భాషలో చెప్పాలంటే 'ఒరే వెధవ నువ్వెవర్ని తెప్పించినా కొంతకాలానికి మమ్మల్నిచూసి వాళ్ళుకూడా రేటు పెంచుతారు జాగ్రత్త" అని.

గంగరాజు కోపంగా ఏదో అనబోతూవుంటే భయిరవమూర్తి వారించి "ఇలాంటి వాదనవలన ఫలితంవుండదు" అన్నాడు చైతన్యవేపు తిరిగి చైతన్య మాట్లాడలేదు. తలూపి వూరుకొన్నాడు.

భైరవమూర్తి అన్నాడు. "మీరు అడిగిన రేటు మేం యిస్తే— సర్వం నష్టపోవల్సి వస్తుంది"

"మీకు తొంబై యిస్తున్నారు కదా వాళ్ళు — ఇందులో నష్టం ఏముంది ?" చైతన్య అడిగేడు.

"జపాన్ కరెన్సీ సంగతి నీకు తెలీదు. ఏ రోజు ఏరేటుంటుందో ఎవరూ వూహించలేరు మేం చేస్తున్నది నిజంగా కత్తిమీద సాము. 'ఎన్' విలువ రోజూ మారుతూనే వుంటుంది."

"క్షమించాలి. అన్ని దేశాలకన్నా మంచి ఆర్థిక వ్యవస్థ వున్నది జపాన్‌కే అని మీకూ తెలుసు నా వుద్దేశ్యం మీరు 'అమెరికన్ డాలర్' అని వుపయోగించబోయి, పొరబాటున 'జపనీస్ యెన్' అని వుంటారని" అన్నాడు చైతన్య.

ముందున్న గ్లాసులో నీళ్ళు గటగటా తాగేడు భైరవమూర్తి. తన ముందు కూర్చున్నది సామాన్యుడు కాదని అతడికి తెలిసింది.

నిజానికి యీ సమావేశం సఫలమవుతుందని అతడికి నమ్మకం లేదు ఇంతకాలం వాళ్ళని మోసం చేసేరు. వాళ్ళ అజ్ఞానం మీదా, బల హీనతల మీదా ఆడుకొన్నారు వాళ్ళకి రావల్సిందేమిటో ఇప్పుడు వాళ్ళు అడుగుతున్నారు. కప్పుకోత చేసేదేముంది?

భయిరవమూర్తి యీ ఆలోచనల్లో వుండగానే, గంగరాజు జేబు లోంచి నోట్లకట్ట తీసేడు. "ఇది తీసుకొని యిక మాట్లాడకు" అంటూ ముందుకు తోసేడు.

క్షణంపాటు చైతన్యకి అర్థం కాలేదు. అర్థం అవగానే మొహం ఎర్రబడింది. విసురుగా కుర్చీ వెనక్కి తోసి లేచి నిలబడి, "అది లోప లికి పెట్టండి" అన్నాడు.

"పిల్చి పిల్లనిస్తానంటే" అని ఏదో అనబోతున్న గంగరాజు, "ముందది లోపల పెట్టు" అన్న గర్జనతో, మాట మధ్యలో ఆపుచేసి చప్పున డబ్బు లోపల పెట్టేసేడు కానీ అంతలో సర్దుకొని— క్షణంలో తన సహజ దర్పాన్ని తెచ్చుకొని మిగతా వాళ్ళతో— "డోంట్ వర్రీ— మై పీపుల్ విల్ హ్యాండిల్ హిమ్" అన్నాడు.

దాంతో చైతన్యకి సహనం నశించింది. "యూ ఆనరబుల్ మెంబర్స్ ఆఫ్ ది బార్బేరియన్ సొసైటీ — డోన్ట్ యూ థింక్ వుయ్ హావ్ మొరేల్స్...." జీవితంలో ఎప్పుడూ రానంత కోపం వచ్చింది అతడికి. జుగుప్స, అసహ్యం, కోపం మిళితమైన స్వరంతో — మనిషి అస్తిత్వం గురించి అతడు చెబుతున్న రెండు నిముషాలపాటూ అందరూ కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయారు. అంత స్వచ్ఛమైన ఇంగ్లీషుని అంత ఏకధాటిగా మాట్లాడుతూ వుండగా వినటం అక్కడ చాలామందికి

అదే మొదటిసారి. "నన్ను హ్యాండిల్ చేస్తారా మీరు ?" అతని కంఠం ప్రతిధ్వనించింది. "మా జాలర్ల హాండిల్స్ సంగతి మీకు తెలీదు. తుపానులో— భయంకరమైన సముద్రం మధ్యలోన పడవని నడపడానికి ఉపయోగపడే తెడ్లవి. మీరు కిరాయికి తెప్పించే రౌడీలకన్నా మా జాలర్లు పెద్ద రౌడీలు. మీకన్నా ముందు నేనే యీ పరిస్థితిని యింకోలా హేండిల్ చెయ్యాలనుకొని వుంటే మీ పిల్లలు యీపాటికే అనాధలై వుండేవాళ్ళు."....

అందులోని నత్యం అక్కడున్న వాళ్ళందరికీ తెలుసు. రోజూ సముద్రంలో పోరాటం సాగించే జాలర్లు సహజంగా బలిష్టులు. దానికి తోడు కొంచెం తాగిస్తే— ఇక మనుష్యుల్లో ఉండరు. అలాటివాళ్ళని కూడగట్టుకొని, పరిస్థితిని ఇంతవరకూ ఇంత శాంతియుతంగా తీసుకొచ్చిన చైతన్య అంటే— తాత్కాలికమైనా— అందరికి గౌరవం కలిగింది.

భయిరవమూర్తి చప్పున కుర్చీలోంచి లేచి, "అంత మాట అనకండి చైతన్యా. జరిగినదానికి నాకెంతో విచారంగా వుంది. అలా అని క్షమాపణ చెపుతూ వ్రాసి యిమ్మన్నా యిస్తాను." అన్నాడు.

చైతన్య నెమ్మదిగా కుర్చీలో కూర్చుంటూ, "నో—నో ఇట్సాల్ రైట్" అన్నాడు.

గంగరాజు ఏదో పనివున్నవాడిలా లేచి బయటకు వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు రేటు దెబ్బయి చేస్తే — అది వాళ్ళ విజయంగా భావించి— కొంత కాలానికి ఎనబయి అడగరని నమ్మకం ఏమిటి ?" అన్నాడో మెంబరు.

"డిమాండ్ లేకపోతే మీరూ కొనరు" అన్నాడు చైతన్య.

"అప్పుడు ధర అరవైకి దిగుతుంది. నేను కోరేదల్లా— ఇన్‌కంటాక్స్ కట్టే బదులు ఆ డబ్బుని జాలర్లకిమ్మని—"

"ఆ హామీ మీరు తీసుకోవాలి" ఎవరో అన్నారు.

"తప్పకుండా—"

సమావేశం ముగిసింది.

ఒక్కరొక్కరే లేచేరు.

అందరికన్నా వెనుక భయిరవమూర్తి చైతన్యతో పాటు నడుస్తూ, "చైతన్యా— మీరు చాలా తెలివైన వారిలా కనబడుతున్నారు. ఈ విషయాలన్నీ బాగా తెలిసిన వారిలా వున్నారు. ఏం చదువుకున్నారు మీరు—?"

"జీవితాన్ని."

o o o

"చాలా గొప్ప విజయం సాధించేరే" అంది శారద — అతను వచ్చేసరికి ఆమె దేముడి కోసం మాల గుచ్చుతోంది.

చైతన్య నవ్వి, "నేను సాధించలేదు. ఇదంతా ఉటోపియా" అన్నాడు.

"అదేమిటి—"

"ఈ నికృష్టమైన జాలర్ల జీవితాల్ని బాగుచెయ్యటం అంతసులభం కాదు. పరిస్థితులు యిలా మారితే ఎంత బావుణ్ను అని కల్పన చేసి అతడు ఒక ఊహాలోకాన్ని— సంఘటన్లని నిర్మించేడు. అంతే కానీ ఇవి మారతాయన్న నమ్మకం 'అతడికి' లేదు."

"అతడెవరు?" ఆశ్చర్యంగా అంది శారద.

"రచయిత. ఈ నవలా రచయిత"

"మిమ్మల్ని సృష్టించినవాడి గురించి మీకేం తెలుసు?

"ఎలియనేట్ చేస్తున్నాను. బ్రెక్ట్ రచనలు ఏమైనా చదివేవా ?"

ఆమె అడ్డంగా తలూపింది లేదన్నట్టూ.

"అవి చదువుతే గానీ ఎలియనేషన్ గురించి అర్థంకాదు."

# 18

"నేనీ బాధని భరించలేను" అంది కిరణ్మయి

"మీకు బాధా" అంది మిసెస్ సింగ్. "అందమైన భర్త, కావల్సినంత డబ్బు...."

అలా అనటంలో ఇంకా తెలుసుకోవాలన్న ఆతృత వుంది.

"మీకు తెలీదు" అంది కిరణ్మయి. "ఆడదానికి కావల్సినవి అవి కావు. అనురాగమూ ఆప్యాయతా—.... సరదాగా షికారు తీసుకెళ్లా మనీ— భార్యతో మనసువిప్పి మాట్లాడదామని లేని భర్తతో వేగడం కష్టం."

"మన భర్తలకి మనతో గడపటంకన్నా డబ్బు సంపాదించడంలో ఆనందం ఎక్కువ". అంది మిసెస్ సింగ్.

"డబ్బు తప్ప ఈ ప్రపంచంలో ఇంకేమి లేదనుకొనే వాళ్ళంటే నా కసహ్యం". అంది కిరణ్మయి.

"నేనూ ముందు మీలా ఆలోచించి బాధపడేదాన్ని. ఇక వీళ్ళ కోసం బాధపడటమే అనవసరం అనితోచి, నా బాధలన్నీ పోగొట్టుకోవటానికిలైట్‌గా డ్రింక్ పుచ్చుకోవటం మొదలెట్టాను. చాలాబాగాపనిచేసింది" అంది మిసెస్ సింగ్.

"బాగా పనిచేస్తుందా ....?"

"ఆహా— ఈ మగవాళ్ళంతా తాగేది ఆ రిలాక్సేషన్‌కోసమే—"

కిరణ్మయి లేచి వెళ్ళి ఫ్రిజ్‌లోంచి రెండు సోడాలూ, బీరువా లోంచి రవి తాలూకు విస్కీ-సీసా తీసుకొచ్చి బల్లమీద పెట్టింది.

మిసెస్‌సింగ్ ఆశ్చర్యంగా, "విస్కీ-యా-" అంది.

"ఏం?" అర్థం కానట్టు అడిగింది కిరణ్మయి.

"సాధారణంగా ముందు జిన్‌తో మొదలు పెడ్తారు ప్రారంభించే వాళ్ళు-ఇది చాలా చేదుగా వుంటుంది."

కిరణ్మయి గ్లాసులో సోడా కలుపుతూ "పర్లేదు ఈ బాధల్ని మర్చి పోవటానికి ఇంతకన్నా చేదైన విషం బాగా పనిచేస్తుందంటే అది తాగ టానికి కూడా సిద్ధమే నేను—చీర్స్."

"చీర్స్—"

అరగంట గడిచేక మిసెస్‌సింగ్ తూలుతూ నిలబడింది- "వెళ్ళొ స్తాను" అంటూ.

"మంచిది" కిరణ్మయి సోఫాలోంచి లేవకుండానే అంది. "థాంక్స్. మంచి మందు చూపెట్టేరు చాలాథాంక్స్. వెళ్ళి పోగలరు కదా—"

"ఆ-పర్లేదు డ్రైవర్ వున్నాడుగా" అంది.

ఆమెవెళ్ళిపోయేక కూడా కిరణ్మయి ఆపుచెయ్యకుండా అలానే త్రాగసాగింది తాగేకొద్దీ ఆమె మనసు దూది పింజేలా తేలిపోవ సాగింది. తమరాకతో చైతన్య అదృశ్యం, చివరికి తోడబుట్టిన చెల్లెలు కూడా వేరు పడటం- భర్తతో అనుకున్నట్టు సుఖసంసారం జరక్కపోవటం-ఇవన్నీ ఆమె మనసుకు సుఖం లేకుండా చేసినయ్, ఇంత కాలానికి ఆమెకీ ఆ బాధల్నుంచి బయట పడటానికి ఓ మార్గం దొరికింది....

—రవి వచ్చే సమయానికి ఆమె సోఫాలో అస్తవ్యస్తంగా పడు కొనివుంది. ముందుటీపాయ్ మీద సీసాలూ గ్లాసులూ చూస్తూంటే అతడికి

మొదట ఏమీ అర్థంకాలేదు. అర్థం అయిన రెండు నిముషాలు కాలు చెయ్యి ఆడలేదు- చివరికి ఎలాగో నోరు పెగుల్చుకొని "ఏమిటిది కిరణ్" అన్నాడు.

ఆ మాటలకు ఆమె కళ్ళువిప్పింది. మూత పడ్తోన్న కళ్ళని అతి బలవంతంమీద తెరచి వుంచటాకి ప్రయత్నంచేస్తూ, ఓ నవ్వు రవీ-గుడ్ ఈ బెనింగ్_గుడీబెనింగ్ రవీంద్రనాథ ఠాక్కూర్" అంది. ఆమె మాటలు ముద్దగా వస్తున్నాయి.

అతడు చప్పున ఆమె దగ్గరికి వచ్చి జబ్బపట్టుకొని. లేపిదీసి కూర్చోబెట్టటానికి ప్రయత్నించేడు. ఆమె మళ్ళీ జారిపోతూ "ఇప్పుడు అర్థమయింది నువ్వెందుకు తాగుతావో-మరి ఇంతకాలం నాకెందుకు చెప్ప లేదు రవీ? ...నేను నీ డియరెస్ట్ లవ్వర్నికదా—" అంది. ముద్దగా

"ఛే కిరణ్" అన్నాడు. అతడిలో సహనం చచ్చిపోతోంది.

"హాయిగా వుంది రవీ. నువ్వూ తాగు— ఫ్యాక్టరీ అమ్మేయ్. అంతా అమ్మేయ్. పూర్తిగా తాగేద్దాం బాధల్ని మర్చి—"

ఆమె చెంప ఛెళ్ళుమంది.

కొద్దిసేపు స్మశాన నిశ్శబ్దం ఆగదిలో తాండవించింది. ముందుగా తేరుకొంది కిరణ్మయే.

"కొట్టేవా రవీ—అంది. "మా నాన్నా అమ్మని కొట్టేవాడు. అయితే అది బీదతనంతో వచ్చిన అసహాయతా_కోపం....అన్నీ కలిసి_ కొట్టేవాడు. మరి డబ్బుండి కూడా నువ్వు....నువ్వు ఎందుకొట్టావ్ రవీ?" మగతగా అడుగుతోంది.

అతడికేం తోచలేదు. చప్పున ఆమెని రెండు చేతుల్తోనూ ఎత్తి బాత్ రూమ్‌వైపు నడవ సాగేడు.

పెద్దగా నవ్వింది కిరణ్మయి "ఇలాగే మా అమ్మని నాన్న ఎత్తు కొన్నాడు రవీ ...భోజనం చేస్తుంటే రాత్రికీ బియ్యంలేవనీ—అదంతా తన ఖర్మనీ అమ్మగొణిగింది తింటున్న కంచం విసిరికొట్టేడు. అమ్మ పడి పోయింది. నుదురు పగిలి అంతా రక్తమే—మేం చిన్నపిల్లలం-నేనూ శారదా—భయంగా చూస్తూనిలబడ్డాం—హాస్పిటల్‌కి తీసుకెళ్ళేలోపులోనే చచ్చిపోయిందమ్మ ...అమ్మా అమ్మా" ఆమె కంఠం రుద్ధమైంది. "నీకు తెలేదు రవీ, బీదతనం ఎంత భయంకరమైందో" ఆమె గొణుకు తోంది.

టబ్‌లో పడుకోబెట్టి షవర్ తిప్పేడు. ఒక్కసారిగా చన్నీళ్ళుమీద పడేసరికి వళ్ళు జలదరించి చిన్నగా అరచింది.

"ఏం చేస్తున్నావ్-ఓ—వాష్‌టబ్—షవర్—రియల్లీ ఎక్స లెంట్ రవీ డబ్బు యింత సుఖానిస్తుందని తెలీదు-కమాన్ నువ్వూ స్నానంచెయ్యి" మెడచుట్టూ చేతులు గొలుసులా వేసింది—"బాత్ రూమ్‌లో రొమాన్స్-" అర్థం లేకుండ నవ్వుతోంది. "బావుంది కదూ రవీ యీ మొజాయిక్ ఫ్లోరింగ్-ఆరే నువ్వూ తడిసిపోయేవే-ఎంత బావున్నావ్ నువ్వు-ఆమె కెందుకో అకస్మాత్తుగా ఏడుపొచ్చింది. "బావుంటం ఎందుకు? రొమాన్సెందుకు??—డబ్బెందుకు—ప్రేమకావాలి. రవీ! నాకివ్వవా చిన్నప్పటినుంచి దానికోసం మొహంవాచి పోయేను రవీ—ప్లీజ్—ప్లీ-జ్" నెమ్మదిగా ఆమెకి మైకం కమ్మేసింది.

o o o o

"ఎన్నాళ్ళనుంచో చీకట్లో పడి కొట్టుకొన్న మా బ్రతుకులకో దారి సూపించేరు. ఇంత కాలంగా మాకీమాత్రం సలహా సెప్పేవారు ఎవరూ లేకపోనారు బాబూ" అన్నాడు చంద్రయ్య.

అతడి వెనుకే కొంతమంది బెస్త యువకులు వున్నారు.

"మన జీవితాల్ని ఎవరో వచ్చి బాగుచెయ్యరు చంద్రయ్యా. మనమే బాగుచేసుకోవాలి సాధించినది నిలబెట్టుకోవాలి. అదేగొప్పదనం"

చంద్రయ్య ఏదో చెప్పబోయి తటపటాయిస్తున్నాడు. అది గమనించి, "ఏమిటి చంద్రయ్యా" అన్నాడు చైతన్య.

"రేటు యాభైనుంచి డెబ్బై అయింది. మేం కలలో కూడా సూడలేని యిసయం బాబూ ఇది" ఆగి, నెమ్మదిగా అన్నాడు. "మీరేమీ అనుకోకండి బాబూ. మీరిప్పించిన లాభంలో సగం ఈ సీజన్ మొత్తం మీకివ్వాలని అనుకొంటున్నాం-ం"

చైతన్యకి ఒక క్షణం అతడు చెబుతున్నది అర్థం కాలేదు. కాగానే మొహం తెల్లగా పాలిపోయింది చప్పున కుర్చీలోంచి లేచి "ఇదేమిటి?" అన్నాడు. "నేనిదంతా ఏదో లాభం ఆశించి చేసేనంటారా?"

"లేదుబాబూ లేదు. మీరొప్పుకోరని తెలుసు. అందుకే గంగమ్మ తల్లి ముందు నిలబడి ప్రమాణంకూడా సేసేం. మీరు తీసుకోవాలి తప్పదు" అన్నాడో యువకుడు.

చైతన్యకి ఓ క్షణం నోటమాట రాలేదు సీటిముందు నిలబడి ప్రమాణం చేసిన బెస్తవాడు ప్రాణం పోయినా మాట తిరగడు.

అతనికి ఏం చెయ్యాలో తోచలేదు.

వాళ్ళ డబ్బు తీసుకొనే ప్రసక్తి మాత్రం లేదు.

చాలా ఇరకాటమైన పరిస్థితి.

"ఒక్క సీజనుకే బాబూ. ఎంతొస్తది—తీసుకోండి" అన్నాడు. చంద్రయ్య.

ఎందుకురాదు?— అంతమంది జాలర్లదీ కలుపుతే చాలా

అతడు ఈ ఆలోచనలో వుండగానే శారద "పోనీవాళ్ళ పేరుమీదే ఓ వ్యాపారం మొదలుపెట్టండి. చైతన్యబాబూ" అంది.

చైతన్య మొహం విప్పారింది. అంతవరకూ వేధిస్తున్నసమస్యకి పరిష్కారం దొరికినట్టయింది.

"అవును. అలాచేద్దాం. మీరందరూ షేర్ హోల్డర్లుగా కంపెనీ ఫ్లోట్ చేస్తాను" అన్నాడు.

ఈ ఆలోచన వాళ్ళకీ నచ్చింది. "కాని మీరూ లాభాలు తీసుకో వాలి.. " అన్నాడు చంద్రయ్య.

"పడిన కష్టానికి తప్పకుండా తీసుకుంటాను."

వెనుకనుంచి ఒక యువకుడు సంచితో ముందుకువచ్చి నేలమీద పోసేడు. నోట్లు, కాసులు.

యాభయ్‌రూపాయలనుంచి డెబ్బయ్‌రూపాయలవరకూ రేట్లుపెరగ టంవల్ల వచ్చిన లాభంఅది. రెండురోజులతాలూకు అమ్మకం.

"ఎంతివి?"

ఇద్దరు ముగ్గురు లెక్కపెట్టసాగేరు.

"యీ సీజను రెండునెలలూ ఇలా తెచ్చిస్తాంబాబూ" అన్నాడు చంద్రయ్య. ఆతడికి చైతన్య నిజాయితీ నచ్చింది. అతడి పథకంకూడా! ఆ అభాగ్యులమీద ఆమాత్రం జాలిచూపించినవాళ్ళు అంతవరకూ ఎవరూలేరు.

"సీజను రెండునెలలూ అంటున్నావు ప్రతిరోజూ దొరకుతుం దేటి రొయ్య?" అన్నారెవరో.

నిజమే దొరకవు. సీజను మొత్తంమీద రెండుమూడుసార్లు దొరుకుతాయి.

అప్పుడొచ్చిందే లాభం మిగతారోజులలో మామూలు భత్యంతో సంతృప్తి పడాల్సిందే.

లెక్కపెట్టడం పూర్తిచేసి "తొమ్మిదొందలా తొంబయ్‌తొమ్మిది. అన్నాడు ఓ యువకుడు.

ఒక క్షణం సూదిపడితే వినబడేంత నిశ్శబ్దం.

తొమ్మిదొందలా తొంబయ్‌తొమ్మిది!

రెండురోజులలాభం!!

"ఇంకో రూపాయి వెయ్యండర్రా ఎయ్యావృద్ధి" అన్నారెవరో.

"నేను వేస్తాను నా పేరుగా—" అన్నాడు చైతన్య. గుప్పెట విప్పితే— అతడి చేతిలో దేవుడి ప్రాంగణంలో దొరికిన రూపాయివుంది.

దానిమీద అతడి తాలూకు రక్తంమరక కూడా అలానేవుంది.

ం ం ం

కిటికీలోంచి వర్షాన్నిచూస్తూ నిలబడ్డాడు చైతన్య. శారద 'టీ' తెచ్చింది.

"ఏమిటి చూస్తున్నారు?"

"వర్షాన్ని"

"చిన్నపిల్లలు చూస్తారు అలా"

"నాకు చిన్నతనంనుంచీ వర్షాన్నిచూస్తే భయం" అన్నాడతను. "ఎందుకో తెలియదు.... నా జీవితంలో విషాదకరమైన సంఘటనలన్నీ వర్షంకురుస్తున్నప్పుడే జరిగేయి"

ఆమె మాట్లాడలేదు.

"ఏమిటాలోచిస్తున్నావు? ఏ విషాదసంఘటనలు జరిగాయనా?"

అతడు బయటకు చూస్తూనేవున్నాడు. వర్షం ధారలుగాకురుస్తోంది.

"ఇలాటి వర్షం కురుస్తున్నరాత్రే సర్వంవదులుకొని బయట కొచ్చేను. ఇలాటివర్షం కురుస్తున్నరాత్రే బాబును స్వయంగా పాతిపెట్టామ

ఆమె చప్పన అతడి చేతిమీద చెయ్యివేసి, "అలామాట్లాడకండి ప్లీజ్" అంది.

"నా కొకటే ఆశ్చర్యం కారదా. బికారిగావున్నప్పుడు ఇవేవీ నన్ను బాధపెట్టలేదు. కానీ మళ్ళీ మనుషుల్లో పడగానే స్మృతులు బాధా కరంఅవుతున్నాయి"

ఆమే మాటమారుస్తూ "ఏమో- ఈ వర్షమే మీకు అదృష్టం తేవ చ్చేమో...." అంది.

అతడు నవ్వి, "మనకి అదృష్టం తెచ్చినా తేకపోయినా—జాలర్లకి మాత్రం తెస్తుంది ఈ వర్షం" అన్నాడు.

వర్షం వస్తే రొయ్యలు పైకివస్తాయి. అగి ఆగి చిన్నచిన్న జల్లు లాపడితే- మరీ. ప్రస్తుతం అలాగే కురుస్తోందివర్షం.

రోజులు గడుస్తున్నాయి.

కుంభవర్షం కురవకపోవటంతో జాలర్లకి ప్రతిరోజూ సముద్రం మీదకువెళ్ళే వీలుచిక్కు—తోంది. సముద్రంనుంచి ఒడ్డుకి కొట్టుకొచ్చే ఒక రకమైన పదార్థంకోసం రొయ్యలు ఎగబడతాయి. దానికోసమే వలన పోతాయికూడా. ఈసారి ఆ పదార్థం ఈ తీరప్రాంతాల్నుంచి కదలలేదు. దాంతో వలవేసినవాడిది ఆలస్యంఅన్నట్టు రొయ్యదొరకసాగింది. దానికి తోడు సన్నజల్లులు ఆగిఆగి కురవటంతో పని మరింత తేలికయింది.

రెండు నెలలపాటు ఉధృతంగావుండే సీజను నాలుగునెలలపాటూ సాగింది.

అవసరాన్ని తట్టుకోవటానికి రెండు ఐస్ ఫ్యాక్టరీలు వెలిసినయ్

పిల్లర్లు రోజుకి ఇరవై నాలుగ్గంటలుచేసినా పని తరగటంలేదు.

ఎక్కడెక్కణ్నుంచో వ్యాళ్లు గ్రద్దల్లా వచ్చి పెరుకుతీసుకుపోతున్నాయి.

పని_ పని - పని-

వాలర్లు మితిమీరిన ఉత్సాహంతో సముద్రాన్ని మధిస్తున్నారు. వాళ్ళు పొదుపుచేసుకొంటున్న మూలధనం అనూహ్యంగా పెరిగిపోతోంది.

o o o

"అలాచేద్దాం" అన్నాడు రవి.

మానేజర్ తలూపి బయటికి వెళ్ళాడు.

టేబిల్‌మీదున్న కాగితాలు చూడసాగేడు రవి, అతడికప్పుడే పనిలో సులువులు అర్థమవుతున్నాయి. ఇన్సూరెన్స్‌విషయాలు....సరకు కొనుగోలూ- అమ్మకం అన్నీ అతడే చూసుకొంటున్నాడు.

ఇంతలో పోస్ట్ వచ్చింది.

ఒక్కో కవరు చింపి చదువుతున్నాడు.

జపాన్‌నుంచి వచ్చిన ఓ కవరులో అతడిని కలవరపర్చే వార్తొకటి వుంది.

అతడిదగ్గరనుంచి రెగ్యులర్‌గా కొనుగోలు చేసే కంపెనీ వ్రాసింది జపాన్‌లో ప్రాన్స్ కన్స్యూమర్స్ సొసైటీ నిశ్చయించిన ధరకన్నా ఎక్కువయిన పక్షంలో తమ భవిష్యత్ కాంట్రాక్టులన్నీ రద్దుచేసుకోవాల్సి వుంటుందని.

అది చదివి చాలాసేపు కుర్చీలో చలనం లేకుండా కూర్చుండి పోయేడు. ఆలోచనలు ఎందుకొచ్చిన బాధ ఇదంతా అన్నవ్మశాన వైరాగ్యం.

సాయంత్రం అయిదవుతుండగా అతనింటికి వెళ్ళేడు.

ఇల్లంతా నిర్మానుష్యంగా వున్నది-మనసులో చింతనలా నిశ్శబ్దంగా,

అతడు తన గదిలోకి వెళ్ళి కోటు విప్పేడు. నిస్త్రాణగా కుర్చీలో కూర్చుండిపోయేడు. వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

కొంచెం సేపటికి గుమ్మం దగ్గర ఆలికిడి అయింది. అతడు కళ్లు తెరవలేదు.

టీ కప్పు చప్పుడయేలా బల్లమీద పెట్టి కిరణ్మయి వెళ్ళిపోయింది. ఆమెకి చాలా కోపంగా వుంది.

తను చేసింది తప్పే కావచ్చు. దానికి తిట్టవచ్చుగా. ఇలా నిర్లిప్తతతో బాధ పెట్టటం దేనికి?

అతడేమాత్రం ఆ విషయం కదిలించినా క్షమాపణ చెప్పుకోవటానికి సిద్ధంగా వుంది ఆమె. కానీ అతడి మౌనం ఆమెని రంపపుకోత కోస్తోంది.

చాలాసేపు బైట తచ్చాడి, స్త్రీ సహజమైన స్వభావంతో మళ్ళీ అతడి గదిలోకివెళ్ళేసరికి, ఆమె పెట్టిన టీ కప్పు అలానే చల్లారిపోయి వుంది.

o o o o

"మళ్ళీ వర్షం వచ్చేటట్టువుంది. ఇప్పుడు వెళ్ళకపోతేనేం?" అంది శారద బయిటకిచూస్తూ.

"లేదు. అనుకొన్నది అనుకున్న సమయానికి జరక్కపోతే దావోదు." అన్నాడు చైతన్య ప్రయాణానికి ఉపక్రమిస్తూ... అయత్తమవుతూ.

బయిట సన్నగా తుంపర పడ్తోంది.

ఈ "వర్షం నాలుగయిదు రోజుల దాకా తెరిపి యిచ్చేటట్టు లేదు" అందామె.

చైతన్య నవ్వేడు. "ఈ వర్షమే నాకు అదృష్టాన్ని తెస్తుందేమో అని నువ్వే అన్నావ్‌గా."

ఆమెకూడా నవ్వి, "నామాట ఎప్పుడూ నిజమవుతుందని నాన అనేవాడు." అంది.

అతడు సూట్‌కేస్ పట్టుకొని మెట్లు దిగేడు.

చీకట్లు నెమ్మదిగా విచ్చుకొంటున్నాయి. తూర్పు ఎర్రబడుతూంది

అతడు మలుపు తిరిగేవరకూ చూస్తూ నిలబడి పోయింది శారద.

పదహారు గంటలు ప్రయాణంచేసి అతడు రాజధాని చేరుకున్నాడు. రాత్రి విశ్రాంతి తీసుకొని ప్రొద్దున్నే పనిమీద బయల్దేరాడు.

అతడికి చాలా టెన్షన్‌గా వుంది.

తను సాధించాలను కున్నది—చిన్న విషయమేమీ కాదని అతడికి తెలుసు.

ఎంత బలహీన వర్గాలకైనా—ఏమీ హామీ లేకుండా అంత పెద్ద ఋణం యివ్వటానికి ఎవరూ ముందుకు రారని అతడికున్న బ్యాంకింగ్ అనుభవం చెబుతోంది.

ఏదో అద్భుతం జరిగితేతప్ప ఇది సాధ్యపడదు.

తను అనవసరంగా ఆకాశానికి నిచ్చెన వేస్తున్నానేమో అనుకొన్నాడు. ఒకవేళ యీ వ్యవహారంలో విఫలమయినా నష్టపోయేది ఏమీ లేదుకదా అన్నభావం ఇంకోవైపు.

ఈ పరస్పర విరుద్ధమైన భావాల్తోనే అతడు విజిటర్స్ స్లిప్‌మీద తనపేరు వ్రాసి లోపలికి పంపేడు.

పదిహేను నిముషాల తర్వాత అతడికి పిలుపొచ్చింది.

అతడి పదేళ్ళ వ్యాపార జీవితంలో ఎప్పుడూ అనుభవించనంత టెన్షన్, అతడు చైర్మన్ చాంబర్స్‌లోకి అడుగుపెడ్తూ వుండగా అనుభవించేడు.

అంత చల్లటి ఎయిర్ కండిషన్ రూమ్‌లోనూ అతడి నుదుటమీద చిరు చెమట పట్టింది.

"చెప్పండి. మీ కోసం ఏం చెయ్యగలను ?" చైర్మన్ అడిగేడు. కొంచెం రిలాక్సవటం కోసం బలంగా ఊపిరి పీల్చుకొని, చైతన్య చెప్పటం మొదలుపెట్టేడు....

—తన ప్రాంతపు జాలర్లు—వాళ్ళ జీవితాల్లో వచ్చిన మార్పు—వాళ్ళు కూడబెట్టుకొన్న డబ్బు వివరాలూ— అంతా వివరంగా చెప్పేడు.

"గుడ్, రియల్లీ ఎక్సలెంట్...." అభినందిస్తున్నట్లు తలూపేడు చైర్మన్. "చెప్పండి. ఇంత కష్టపడి మూలధనాన్ని సంపాదించుకొన్న మీకు మా బ్యాంక్ ఎలా సాయపడగలదు ?"

చైతన్య ముందుకు వంగి "ఓ కోల్డ్ స్టోరేజి పెడదామనుకొంటున్నాము" అన్నాడు.

ఎదురు కుర్చీలో వున్నాయనకి యాభై ఏళ్ళ వయసుంటుంది. అందులో పాతికేళ్ళ బ్యాంకింగ్ అనుభవం వుండి వుంటుంది. తన సర్వీసులో ఎంతో మంది రకరకాల వ్యక్తులని చూసేడు. అనుభవంతో పండిపోయేడు. అంత అనుభవజ్ఞుడు కూడా ఈ మాటలకి అదిరిపడ్డాడు

"ఏమిటీ ?...." తను వింటున్నది నిజమేనా అన్నది నిర్ధారణ చేసుకోవటానికి మళ్ళీ అడిగేడు.

"ఒక కోల్డ్ స్టోరేజి ప్లాంట్ పెట్టి రొయ్యలు ఎగుమతి చెయ్యా లనుకొంటున్నాం. మీరు అప్పు యివ్వాలి...."

"ఎంత ?"

"ప్లాంట్ కి రెండున్నర లక్షలు. వర్కింగ్ కి ఆరు లక్షలు."

"మీ తరపు నుంచి ఎంత పెడ్తారు ....'"

"యాభై వేలు"

తన ముందు కూర్చొన్నవాడు, బయిట వర్షం వస్తోందని. ఏమీ తోచక సరదాగా లోపలికి వచ్చి తనతో హస్కు కొడ్తున్నాడేమో అన్న అనుమానం చైర్మన్ కి వచ్చింది.

యాభయి వేల పెట్టుబడితో ఎనిమిదిన్నర లక్షలు అప్పివ్వమం టారా ? సెక్యూరిటీ ఏమిటి ??"

"శ్రమ !"

బ్యాంకు అధికారి వెనక్కి వాలి, "క్షమించండి. నేనేం చెయ్య లేను" అన్నాడు.

"అంతేనంటారా ?" అన్నాడు "సెక్యూరిటీ లేకుండా అప్పి వ్వరా—"

"అది ముఖ్య సమస్య కాదు. కానీ మీరు సరుకు ఎలా అమ్ము తారు ? ఫ్యాక్టరీ ఎలా నడుపుతారు ?? అన్నీ సమస్యలే—"

ఇంతలో ప్యూన్ ఇంకో విజిటింగ్ కార్డు తెచ్చి బల్లమీద పెట్టేడు. "రమ్మను" అన్నాడాయన.

అంటే తననిక వెళ్ళమని. చైతన్య కుర్చీలోంచి లేచేడు.

"ఐయామ్ సారీ—" అన్నాడాయన.

"ఇట్సాల్‌రైట్ సార్." అతడికి ఈ పని అవుతుందని నమ్మ కంలేదు. ఆయనకి షేక్ హ్యాండిచ్చి బయటకు రాబోతూ వుంటే తపులు తీసుకొని విజిటర్ లోపలికి ప్రవేశించేడు.

చైతన్య తన ఆలోచన్లలో తను వుండి బయటికి వెళ్ళబోతు న్నాడు.

"వర్షంవల్ల ఫ్లయిట్ కాన్సిల్ అయి వుండిపోవల్సి వచ్చింది" తనకి పరిచయమైన గొంతు విని చైతన్య వెనక్కి తిరిగి చూసేడు.

అదే సమయానికి అతన్ని చూసిన హమ షోశోషిమా చీఫ్ సేల్స్ ఎగ్జిక్యూటివ్— "హల్లో చైతన్యా — మీ రిక్కడ వున్నారేమిటి" అన్నాడు.

# 19

ఆమెవైపే చూస్తున్నాడు వృద్ధుడు.

ఆమె బట్టలు పీలికలై దైన్యాన్ని చాటుతున్నాయి. వళ్ళు దుమ్ము కొట్టుకుపోయి వుంది. జుట్టు పాయలు పాయలుగా వేలాడుతోంది,

వృద్ధురాలిలా కనబడ్తూంది.

అనారోగ్యం మొహంమీద ముడతల్ని తెచ్చింది.

బీదతనం వాటిని పెంచింది.

మరో యిద్దరు బిచ్చగాళ్ళు ఆమెవైపే విర్లిప్తంగా చూస్తున్నారు. చావుకీ బ్రతుక్కీ వాళ్ళ దృష్టిలో తేడాలేదు, జీవచ్ఛవాలు.

వృద్ధుడు ఆమె తలని వళ్ళోకి తీసుకొని, మట్టిపాత్రలో నీళ్ళు గొంతులో పోసేడు.

అయిదు నిముషాలు గడిచినయ్.

ఆమె కళ్ళు విప్పడం చూసి వృద్ధుడి మొహం వికసించింది.

ఆమె బలహీనంగా వణుకుతున్న రెండు చేతులూ దగ్గరికి చేర్చి నమస్కారం చేసి, "రక్షించారు బాబుగారూ!" అంది.

అతడు మాట్లాడవద్దన్నట్లు సైగచేసి తన దగ్గరున్న గిన్నెని ముందుకు జరిపేడు. ఇది తిన్నాక ఆమెకి సత్తువ చేకూరినట్టుంది. కృతజ్ఞత నిండిన కళ్ళతో అతడివైపు చూసి, "మీ ఋణం యీ జన్మకి తీర్చుకోలేను బాబుగారూ.... మీ పేరు?" అని అడిగింది,

"నిరంజన్‌దాస్" అన్నాడు వృద్ధుడు. "ఎండలో చాలా దూరం నుంచి వస్తున్నట్టున్నావ్. ఎక్కడి కెళ్ళాలమ్మా?

"ఇంకా చాలా దూరం ప్రయాణం చెయ్యాలి బాబుగారూ. ఇప్పు డక్కడేముందో తెలుసుకోవాలి. కానీ అనుమానంగా వుంది. గమ్యాన్ని చేరకానే లోపులో ఈ ప్రాణం తన గమ్యం పూర్తిచేసుకొంటుందేమో నని."

"ఇంత వేదాంతం మాట్లాడుతున్నావ్ నీ పేరేమిటమ్మా—"

"పేరులో ఏముంది బాబుగారూ—" అందామె. తల అడ్డంగా వూపుతూ— "ఏమిలేదు. ఏమీలేదు."

ఆమె లేచి, "వెళ్ళొస్తాను బాబూ. మీకు మరోసారి కృతజ్ఞతలు" అంది.

"ఇంత ఎండలో ఎక్కడి కెల్తావమ్మా—"

"చాలా దూరం వెళ్ళాలి. నెలలే పట్టొచ్చు సంవత్సరాలే పట్టొకూ కానీ వెళ్ళాలి. వెళ్ళేవరకూ ప్రాణాలు నిలుపుకోవాలి వెళ్ళాలి చుర వెళ్ళాలి—" గొణుక్కుంటూ వెళ్ళిపోతున్న స్త్రీని కనుమరుగయ్యేవ....ర అలానే చూస్తూ వుండిపోయేడు.

o o o

ఏమిటి— మీరింతకాలం ఏమైపోయేరు ?'' అడిగేడు చీప్.
"నేను ఎంక్వయిరీ చేస్తే ఏవో ట్రబుల్స్‌లో వున్నారని తెలిసింది ''

బ్యాంకు అధికారి ఫోనులో మాట్లాడుతున్నాడు.

తనొచ్చిన పని క్లుప్తంగా అతడికి చెప్పేడు.

''మీకు అప్పివ్వటానికి సంశయం ఏమిటి ?-''

"నేను పూర్వపు స్థితిలో లేను'' నవ్వేడు చైతన్య. పరిస్థితి వివరించేడు.

ఫోన్‌లో మాట్లాడటం ముగించిన అధికారివైపు తిరిగేడు చీప్.

''మార్కెట్ ఒకటే కదా మీ అనుమానం—''

''అవును'' అని చైతన్యవైపు తిరిగి, ''ఒక బలహీనవర్గం స్వంతంగా కాళ్ళమీద నిలబడటానికి ప్రయత్నిస్తానూ అంటే మాకూ సంతోషమే. కాని వాస్తవిక పరిస్థితుల్ని కూడా అర్థం చేసుకోవాలి కదా —''

''ఓకే—'' బల్లమీద పేపర్ వెయిట్ తిప్పుతూ అన్నాడు చీప్. మూడు సంవత్సరాల పాటు మీ సరుకు మొత్తం కొంటామని ఎక్స్‌క్లూజివ్ కాంట్రాక్ట్ వ్రాసిస్తాను. ఎల్. సీ. ఓపెన్ చేస్తాం. సరేనా—"

ఇక్కడ ఇలా సంభాషణ జరుగుతున్న సమయంలో అక్కడ రవి తన ఆడిటర్‌తో మాట్లాడుతున్నాడు.

"తప్పు మీరు పెట్టేరా మీ భార్యదా అన్నది ప్రశ్న కాదు. చైతన్య వెళ్ళిపోయేక ఆయన బిజినెస్‌నంత మీరు ఉన్నది వున్నట్లు తీసుకొన్నారు. కాబట్టి ఆ అప్పులన్నిటికీ మీరు బాధ్యులవుతారు."

"కానీ ఆ సరుకంతా పూర్తిగా నాశనమయింది. అయినాసరే

ఆ సరుకు అమ్మిన వాళ్ళందరికీ డబ్బు చెల్లించేను. నా ఉద్దేశ్యమేమిటంటే —ఆ సంఘటన కారణంగా ఫ్యాక్టరీ ఆగి పోకూడదని.... "

"మీరు చెప్పింది నిజమే—" అన్నాడు ఆయన. "కానీ మీరు కొంచెం తెలివిగా ప్రవర్తించి వుండాల్సింది. ఆ ఫ్యాక్టరీ, చైతన్య నుంచి మీ భార్య కొనుక్కొన్నట్టూ అగ్రిమెంటు వ్రాసుకొంటే మీకీ కష్టం వుండేదికాదు. అలా చేసిన పక్షంలో ఆ సంస్థ పూర్వపు లాభాల్తోకానీ నష్టాల్తోకానీ మీకు సంబంధం వుండేదికాదు—"

"అలా చెయ్యలేదు కాబట్టి ఇప్పుడు పూర్వపు లాభంమీద కూడా టాక్స్ కట్టాలంటారు "

కట్టాలి మిస్టర్ రవీ. ఒక సంవత్సరం ఘోరంగా నష్టపోయినా, అంతకుముందు సంవత్సరం వచ్చిన లాభంమీద టాక్స్ కట్టాల్సిందే- అది 'లా' "

"'లా'? అదో గాడిద" అంటూ, అన్నిటికీ సిద్ధపడిన వాడిలా అతడు వెనక్కివాలి. "మొత్తం ఎంత కట్టాలి?" అని అడిగేడు'

ఆయన కొద్దిసేపు లెక్కలు కట్టి "లక్ష డెబ్బైవేలు" అన్నాడు.

రవి మొహం రక్తం ఇంకిపోయినట్టు తెల్లగా పాలిపోయింది. "లక్షడెబ్బైవేలు" గొణిగేడు.

ఎక్కడనుంచి తెస్తాడు.

o o o o

చైతన్యకి ఆశ్చర్యంగా వుంది.

తమ కంపెనీకి జపనీస్ ఫర్మ్ సాయపడటంలో కాదు.

ఆ ఫర్మ్ తరపున ఈదేశపు ప్రతినిధిగా తనను నియమించటంలో

"నేను మీకెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియటం లేదు.

"ఇందులో నేను చేసింది ఏముంది?" అన్నాడు చీఫ్. "మీలాంటి అనుభవజ్ఞుడు లభించటం మా అదృష్టం. మామూలు పరిస్థితులలో అయితే మీరు యింత చిన్నపనికి వప్పుకొనేవారా."

నిజమే. వప్పుకోనెవాడుకాదు. అది వేరే సంగతి. కానీ యీ పని మాత్రం అంత తక్కువ దేమీకాదు. కమీషన్ కూడా ఆకర్షణీయంగా వుంది.

ఇంటికొచ్చేక విషయం అంతా శారదకి చెప్పేడు.

అతనింటి కొచ్చేసరికి ఆమె కూర్చుని తల చిక్కుతీస్తూంది.

విషయం అంతా విని' ఆమె ఆనందంతో "చూసేరా మరి, నా శకునం అంటే ఏమనుకున్నారో—మీరు నాకు మంచి ప్రజంటేషన్ యివ్వాలి" అంది.

అతడి మనసు దూదికన్నా తేలిగ్గా వుంది. "ఏంకావాలి చెప్పు.... అన్నాడు.

ఆమె తల అడ్డంగా వూపుతూ. "ఊహుఁ— ఇప్పుడుకాదు. ఏదైనా కావల్సొచ్చినప్పుడు అడుగుతాను" అందామె.

అతడు నవ్వి "సరే" అని జరిగిందంతా తన వాళ్ళతో చెప్పటానికి లేచాడు.

గూడెంలో యీ వార్త పాకగానే అందర్లోనూ ఉత్సాహం కట్టలు తెగి ప్రవహించింది. అభినందనలు అతడని ఉక్కిరిబిక్కిరి చేసేయి. జాలర్ల ఆనందానికయితే అంతేలేదు.

పదిరోజుల్లో స్థలం నిర్ణయించటం జరిగింది. అ తరువాత రెండు నెలలకల్లా ఫ్యాక్టరీ ప్రారంభం అయింది.

అతడికి పూపిరిసలపని పని. మళ్ళీ బాధ్యతలు.... ఇంటికొచ్చేసరికి తొమ్మిదీ, పదీ అవుతోంది. ఇంకోవైపు - జపనీస్ ఫర్మ్ యిచ్చిన కొత్త బాధ్యత.

ఒక రోజు అతనింటి కొచ్చేసరికి పదకొండయింది.

భోజనం చేస్తూంటే శారద అంది. "ఇలా టైమ్ కూడా చేసుకోకుండా పని చేస్తూవుంటే ఆరోగ్యం ఏమయ్యేను?"

అతడు చెయ్యి కడుక్కొంటూ నవ్వి, "నాకిది అలవాటేగా." అన్నాడు.

ఆమె అతడివెనుకే వెళ్ళి తువ్వాలు అందిస్తూ' "నాకు ఒక అనుమానం. మీరంతా రాత్రింబవళ్ళు పని చేస్తారుకదా- అంత డబ్బు సంపాదించి ఏంచేస్తారు?" అంది.

అలా అడిగిన తర్వాత అతడి మొహంచూసి 'ఎందుకడిగేవా' అని ఆమె అనుకోంది. అతడు దాన్ని తేలిగ్గా తీసుకోలేదు. ఆ ప్రశ్న అతడి గుండెల్లో మారుమూల ఎక్కడో ప్రతిధ్వనించింది. నిజమే. ఎందుకింత సంపాదించటం?

అతడికి సమాధానం వెంటనే దొరికింది.

తనవాళ్ళని సంతోషపెట్టటానికి, స్నేహితులలో తలెత్తుకు తిరగటానికి భవిష్యతు కోసం!! ఆనందంకోసం!! అంతలోనే!! మళ్ళీ అనుమానం. భార్యని సుఖపెట్టడం మనిషి జీవితాశయంకాదే తనని "తన"గా ప్రేమించాలి. భార్య. అలాటి దానికోసం ఏమీ చెయ్యకపోయినా ప్రేమిస్తూనే ఉంటుంది కదు.....

మరి స్నేహితులూ, స్టేటస్సూ వీటికోసమా— ఇవి ప్రతి మనిషికీ వుంటాయే! కార్మికుడికి కార్మికుడి సర్కిల్. గుమాస్తాకి గుమాస్తా

స్నేహితులూ, ఆ మాటకొ స్తే అరిస్టోక్రసీయే స్నేహాని నాశనం చేస్తుంది. భవిష్యత్తు కోసమా?- దానికి శ్రమ ఎందుకు? తరతరాలుగా తిన్నా తరిగిపోనట్లుగా సంపాదించటం ఎందుకు?

ఆనందం కోసమా? ఎయిర్ కండిషన్ రూమ్‌లో నిద్రపట్టక పక్కమీద అటూయిటూ పొర్లే భాగ్యవంతుడికన్నా. కాయకష్టం చేసే వాడు కటిక నేలమీద హాయిగా నిద్రపోతున్నాడే! కావు. ఇవేవీ కావు కారణాలు. ఈ సంపాదించటం అనేది వ్యసనం. ఒకసారి దానికి అల వాటు పడితే_ అందులో వున్న ఆనందం ఇంక దేన్లోనూ దొరకదు. అది చదరంగం ఆటలాటిది. ఆడుతూనే వుండాలి.

కానీ యిన్ని కాంట్రడిక్షన్ల గురించి ఆలోచించే శక్తి అతడి కిప్పుడులేదు. భవాన్ని గురించి ఆలోచించే శక్తి దారుణమైన అను భవం నిర్దాక్షిణ్యంగా చంపేసింది.

ఆ అనుభవంతోనే అతనన్నాడు. "లేదు శారదా- ఈ డబ్బు అనేది చాలా గొప్పది. బంధుత్వాల్ని నిలుపుతుంది. స్నేహాన్ని కలుపు తుంది. మనిషిని కాళ్ళమీద నిలబెడ్తుంది. డబ్బుని మితంలేకుండా సంపా దించాలి. దాన్ని గుప్పిట్లో పెట్టుకొని ఆడించాలి. దాని కోసం ఎంత మానసిక శాంతిని కోల్పోయినాసరే...."

"చైతన్యకి సమాదానంగా శారదఅన్నది.—

ఈ డబ్బుమీద విజయం సాధించాలీ అంటే మితంలేకుండా దాన్ని సంపాదించటం ఒక్కటేనా మార్గం చైతన్యబాబూ? దానివిలువనంతా ఒక్కచిరునవ్వుతో తృణీకరించిన నిరంజన్‌దాస్ దానిమీద విజయంసాధిం చలేదా? అతడిలో ఏ మానసికవ్యధాలేదే...."

చైతన్య మాట్లాడలేదు. అతడు భికారిగా సంచరించిన రోజులలో వున్న నిశ్చింత జ్ఞాపకంవచ్చింది. మరుక్షణంఏమవుతుందో అన్నటెన్షన్

లేదు. అయితే తను ఆ స్థితి చేరుకోగలడా? లేదు.... ఆ విరక్తి తనకురాదు.

అతడికి అప్పటివరకూ ఒకఅనుమానం ఉండేది. నిరంజన్‌దాస్ సర్వాన్నీ వదులుకోవాలని తీసుకొన్న నిర్ణయం అర్థ రహితమేమోనని కానీ ఈ క్షణంఅర్థమైంది. ఎంతగొప్ప దూరాలోచనతో నిశ్చింతకోసం అతడు డబ్బుని వదల.కోగలిగాడో అర్థంచేసుకోగలిగాడుకాబట్టి మరి తను వదులుకోగలడా? లేదు—అర్థంచేసుకోవడంవేరు తనలాంటివాళ్ళకి చింతలోనే దొరుకుతుంది. అనుక్షణమూ చింతలేకపోతే బ్రతకలేడు.

అతడి ఆలోచనలని భంగపరుస్తూ, "ఇక ఆలోచించకండి. మీ ఆలోచనలని రాస్తూరాస్తూ యీ నవలాకారుడుకూడా అయోమయస్థితిలో పడిపోయేలాఉన్నాడు" అంది నవ్వుతు.

అతడు అర్థంకాక "ఏమిటి?" అన్నాడు.

"బ్రెక్టు చదివేరా"

"ఏం?"

"ఏంలేదు ఎలియనేట్ చేస్తున్నాను" అందామె చిరునవ్వుతో.

o o o

తాను కట్టవలసిన టాక్సు విషయం కిరణ్మయికి తెలియటం రవికి ఇష్టంలేకపోయింది.

ఈ బాధ తనకెలాగూతప్పదు అనవసరంగా ఆమెకుచెప్పిఆమెను కూడా బాధపెట్టడం ఎందుకని భావించాడతడు.

అయితే అతడు ఆవిపత్తునుంచి బయటపడటానికి చేసిన ఏ ప్రయత్నమూ ఫలించలేదు.

కట్టవలసిన డబ్బు కట్టకుండా అప్పీలుచేసుకోవటానికి అతడుపెట్టుకున్న దరఖాస్తును కమీషనర్ తిరస్కరించేడు.

దాంతో పరిస్థితి మరింత విషమించింది.

రవి తల్లడిల్లిపోసాగేడు.

అతడి పరిస్థితిని గురించి తొందరలోనే అందరికీ తెలిసిపోయింది యీ వాణిజ్యకాలాల ప్రపంచంలో ఏ చిన్నవార్తయినా ఇట్టేపాకి పోతుంది.

అతడిస్థితి తెలిసినవాళ్ళు అప్పుఇవ్వటం మానేశారు. అప్పటికే ఇచ్చినవాళ్ళు వత్తిడిచేయసాగారు.

ఇలా అన్నివేపులను పరిస్థితులు విషమించటంతో అతడుడీలా పడిపోయేడు. ఇవిఇలా వుండగానే ఒకరోజు అతడికి నోటీసు వచ్చింది.

టాక్సుకట్టని కారణంగా యింటిని వేలంవేయబోతున్నట్లు నోటీసు అది.



కిరణ్మయీ

"నీభర్తగానూ నీ ఆస్థి వ్యవహారాలు చూస్తున్న మానేజర్‌గానూ కూడా నేను నా ఓటమిని ఒప్పుకొంటున్నాను! ఇదంతా నా అసమర్థత వలనే వచ్చిందన్న నిజాన్నికూడా నేను మర్చిపోలేను కిరణ్మయీ! నామీదెంతో నమ్మకంవుంచి ఈ బాధ్యత వప్పగించేవు కానీ నేనేదాన్నిసరిగా నిర్వహించలేకపోయాను.

కొద్దిరోజులలో మన ఆస్థి సర్వస్వం వేలంప్రాటకు రాబోతోంది. దాన్ని నిరోధించటానికి నేనుచేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యేయి.

అన్నయ్య ఏ స్థితిలోబయటకి వెళ్ళిపోయేడో అదేపరిస్థితిలోనేనూ వెళ్ళిపోతున్నాను అయితే వెళ్ళేది యీ లోకంవిడిచి నా అసమర్థతకిఉదాహరణంగా నువ్వుపడే కష్టాలు అనుక్షణం చూస్తూ మానసిక వ్యధఅనుభవించే శక్తి నాకులేదు.

కిరణ్! ఇరవై రెండేళ్ళవరకూ నాకు ప్రేమంటే ఏమిటో తెలీదు. నా జీవితంలో నువ్వు ప్రవేశించావు మనసా, వాచా నిన్ను నేను ప్రేమించాను.

యీ డబ్బుఅనేది మనమధ్య లేకపోయివుంటే, మనవివాహపు తొలిరోజులు ఎంతబాగా గడిచివుండేవి? చదివిన చదువుకి చిన్నవుద్యోగం వచ్చివుండేది చిన్నయిల్లు మనసంసారం ఎంతబావుండేది! నా యీ అసమర్ధతని నిరూపించటానికేనేమో యీ డబ్బుఅనేది వచ్చిపడింది.

అయిపోయింది కిరణ్! ఈరాత్రి తెల్లవారేసరికి నేనువుండను. అద్భుతమైన నీ సౌందర్యాన్ని ఇంకొంచెంసేపు చూస్తూకూర్చోవాలని- నీతో కొంచెంసేపు మాట్లాడాలనీ కొర్కె- గుండెనిండా బలంగా వ్యాపిస్తున్నది. కానీ అణచుకోవాలి ఒకసారి మళ్ళీ ఆ అనుభవంపొందితే ఈ మరణించాలన్న నా నిశ్చయం నెమ్మదిగా సడలిపోవచ్చు.

నామీద నీకేమయినా మంచి అభిప్రాయం ఏ మూలో కొద్దిగా వుంటే ఇక అదీ పోతుందని తెలుసు. డబ్బున్నరోజులలో నాతో అన్నీ అనుభవించేడు- ఆదిపోయేక నన్నువదిలేసి తనదారి తనుచూసుకొన్నాడు అని నువ్వు నన్ను తిట్టుకోవచ్చు. కానీ నేను బ్రతికివుంటే మనభవిష్యత్ ఆ హైన్యం- ఇవన్నీ తల్చుకోవటానికే భయంగావుంది. డబ్బు మన మధ్య సృష్టించిన విభేదాల్ని దారిద్ర్యం మరింత ఎక్కువచేస్తుంది నీ ప్రవర్తనలో నాపట్ల కోపాన్ని ఇంతకాలం చూసేను. ఇంకా బ్రతికివుంటే అసహ్యాన్ని చూడాలి.

అదే నా కిష్టంలేదు. శలవు.

—రవి

ఉత్తరం వ్రాయటం పూర్తిచేసి మడవబోతూ ఏదో అనుమానం వచ్చి వెనక్కి తిరిగేసరికి.... కిరణ్మయి!

ఉత్తరం అంతా చదివినట్లు ఆమె మొహం చూసేనే తెలుస్తోంది. అది గమనించి, "కిరణ్" అన్నాడు అతడు హీనమయిన కంఠంతో. ఆమె మాట్లాడలేదు కాసేపు అతడిని చూస్తూవుండిపోయింది. ఆమెహృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలవుతున్నాయి. అంతవరకూ చూడని రవిని చూస్తోందామె.

అమాయకంగా సరదాగా ప్రతిదానిని తేలికగా తీసుకొనే రవినే చూసింది ఇంతవరకూ. అతడు యీమధ్య పనివట్ల శ్రద్ధచూపిస్తున్నాడని కూడా గమనించి సంతోషించింది.

కాని పరిస్థితి ఇప్పుడు తారుమారయింది.

చిత్రమేమిటంటే- తాము బికారుగా రోడ్డుమీద నిలబడేస్థితి వచ్చిందన్న విషయంకూడా ఆమెకి ఆ వుత్తరంద్వారానే తెలిసింది. అయినా ఆ విషయం ఆమెని అంతగా బాధించటంలేదు. యీ డబ్బు అనే జ్వరం ఎంతతొందరగా వదిలిపోతే అంతబావుణ్ను అని ఆమె భావిస్తోంది.

రవిని చూస్తుంటే అమెలో స్త్రీ సహజమయిన కరుణ పొంగిపొరలింది. దాంతోపాటు దుఃఖంకూడా ఎంతో వున్నతమయిన వంశంలో పుట్టి కేవలం జాలితో అభిమానంతో తనను వివాహమాడిన యీ యువకుడు కేవలం తనవలనే మనశ్శాంతిని కోల్పోయేడన్న నిజం ఆమె గుండెని బ్రద్దలుచేస్తోంది. పరస్పర విరుద్ధంకాని యీ రెండుభావాలతో ఆమె వక్కనే కూలబడి అతడి కాళ్ళమీదతలవంచి వెక్కి వెక్కి ఏడవసాగింది

రవి ఆమె తలమీద చేయివేసి "కిరణ్" అని గొణిగేడు.

చాలాసేపు ఇద్దరూ ఆ అచేతనమయిన పరిస్థితిలో అలానేవుండిపోయేరు. ముందు కిరణ్మయే తేరుకొన్నది. పైటచెంగుతో కళ్ళుతుడుచుకొంటూ, "నన్ను క్షమించు రవీ నిన్ను చాలా చాలా బాధపెట్టాను" అంది

"లేదు కిరణ్ నువ్వే నన్ను క్షమించాలి. ఇన్ని లక్షరరూపాయలు ఇంతకొద్ది కాలంలో కరిగిపోతూవుంటే ఏమీ చెయ్యలేకపోయేను'' అన్నాడు. ఆమె తలెత్తిచూసింది.

ఆమె కళ్ళలోకి నెమ్మదిగా వెలుగొచ్చింది.

"ఇదేనా.... ఈ ఒక్క కారణమేనా రవీ నిన్నింతగా బాధ పెడ్తోంది" అందామె ఆతృత—కొద్దిగా ఆనందం మిళితమైన స్వరంతో, "నా మీద ఏ కోపమూ లేదా? నా ప్రవర్తనపట్ల అసహ్యం లేదా??"

రవి అయోమయంగా, "కోపమూ—అసహ్యమూనా....ఎందుకు?" అన్నాడు.

"నిన్ను కష్టపెట్టినందుకు— ప్రీనన్న విషయం మర్చిపోయి...." ఆమె ఏదో చెప్పబోతూ వుంటే నోటిని చేత్తో మూసి, "నువ్వు కాబట్టి నన్ను సహించగలిగేవ్ కిరణ్" అన్నాడు.

ఆమె అలాగే అతడి చేతిని తన చెక్కిలికి ఆన్చుకొని, "యింకా చర్చవద్దు రవీ—" పెళ్ళయిన కొత్తలో భార్యాభర్తల మధ్య వుండా ల్సిన ప్రేమనీ, అనురాగాన్నీ మనమధ్య లేకుండా చేసింది డబ్బు. ఒక ర్నొకరు కళ్ళలో పెట్టుకొని కాలం తెలియకుండా గడపాల్సిన అపూర్వ క్షణాల్ని— ఈ డబ్బుని కాపాడటం కోసం వృధా చేసేం. ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు రవీ— ఈ పాడు డబ్బు మనకి శాశ్వతంగా వీడ్కోలు చెప్పబోతూ వుంది. అది వెళ్ళిపోయాక హాయిగా మనిద్ద రమే— రవీ! బీదతనం నాకు అలవాటే— నీకొక్కద్దిగా మొదట్లో కష్టంగా వుంటుందనుకో— అయినా దాన్ని గురించి భయం అక్క ర్లేదు— నీకో చిన్న ఉద్యోగం వస్తుంది— సాయంత్రం అలసిపోయి యింటికి వస్తావ్— కుక్కూ, గిక్కూ వుండరుగా— నేనే కాఫీకాచి తెచ్చి

స్తాను. మన చిన్న ప్రపంచంలోకి తొందర్లో ఓ పాప కూడా వస్తుంది—
ఇక అంతా సుఖమే—"

రవి ఒక అపూర్వమైన అనుభవాన్ని పొందుతున్నట్టు ఆమె మాటలు వినసాగేడు. అతడు మొదటిసారిగా కొత్త కిరణ్మయిని చూస్తున్నాడు.

ఆమె ఆ యింటికి వచ్చిన కొత్తలో ఆమె కళ్ళల్లో ఒక అనూహ్యమైన వేదన కనబడ్తూ వుండేది. అది పూర్తిగా వేదనా కాదు; కసి— ఉహుం ఆ సున్నితమైన భావానికి అంత కర్కశమైన పదం అనవసరం. చాలా బీదస్థితిలోంచి వచ్చిన కారణంగా ఒక్కసారిగా ఈ వాతావరణాన్ని అన్వయించుకోలేక— పూర్వపు అవహ్యాకరమైన పరిస్థితుల్ని— ఆ కొత్త వాతావరణంతో పోల్చుకొని— ఒక రకమైన కాంప్లెక్స్ పెంచుకొన్న స్థితి ఆ తరువాత విధి ఆడిన ఒక చిన్న చదరంగపు ఆటతో అమెకి అంతులేని సంపద వచ్చిపడి ఉక్కిరిబిక్కిరి అయ్యేట్టు చేసింది. తుఫాను వచ్చి వెళ్ళిన తరువాత పరిస్థితి యిప్పుడు.
కానీ అది కల్గించిన నష్టం కంటే ఆమెకి అది తగ్గిపోయిందన్న భారమే ఎక్కువ హాయిని కలిగిస్తోంది.

ఆ సంతృప్తితోనే అమె భర్త వడిలో తలపెట్టుకొని హాయిగా నిద్రపోగలిగింది—

అంతా ప్రశాంతంగా వుంది.

కిటికీలోంచి వస్తున్న పిల్లగాలికి ఆమె చెవి క్రింద ముంగురుల పాయ నెమ్మదిగా వూగుతోంది. ఒక వెన్నెల కిరణం ఆమె చెక్కిలిమీద వడి ప్రతిబింబిస్తోంది. ఆమె నిశ్చలమైన కనురెప్పల మధ్య గాఢమైన విశ్శబ్దం అలుముకొంది.

స్నిగ్ధమూ, అపురూపమూ అయిన ఆ ప్రశాంతికి విచలితుడైన రవి— ఆమె నిద్రకి భంగం కలిగించకుండా నెమ్మదిగా వంగి, బల్ల మీదున్న చిన్న సీసాని కిటికీలోంచి బైటకి విసిరేశాడు.

o o o

పెద్ద హడావిడేమీలేదు.

కొద్దిమంది జనం వున్నారు. నాలుగైదు కార్లున్నాయి.

ఇన్‌కంటాక్స్ డిపార్టుమెంటుకి సంబంధించిన ఇద్దరాఫీసర్లు ఏదో నోట్ చేసుకుంటున్నారు.

రోడ్డుమీద ఇద్దరు వ్యక్తులు ఆయింటివైపు చూస్తూ ఏదోమాట్లాడుకొంటూ వెళ్తున్నారు. రోడ్డు కిరువైపులా వున్న క్రోటన్స్ మొక్కలు సరిఅయిన పోషణలేక వాడిపోయి వున్నాయి.

దూరంగా పన్నెండు కొట్టింది.

దాహంతో దూరంగా కాకి అరుస్తోంది.

దూరంగా నిలబెడి వున్నారు రవీ, కిరణ్మయి.

ఆమె చెయ్యి ఆతడి చేతులో వుంది. వాళ్ళిద్దరూ మౌనంగా చూస్తున్నారు.

జరిగేదాంతో సంబంధంలేని ప్రేక్షకుల్లా వున్నారు.

పాట మొదలైంది.

"డెబ్బై అయిదు వేలు"

లక్ష పాతిక వేలు చేసే బిల్డింగ్‌ని చౌకగా కొట్టేద్దామని ఎవరో ఆశపడ్డారు.

రెండు గొంతులు వెంటనే "ఎనబై వేలు" అన్నాయి.

"........ తొంభై వేలు"

కొద్ది నిశ్శబ్దం
"........లక్ష" అన్నాడు నానక్ రామ్.
"లక్షా పదివేలు"

"లక్షా పదిహేనువేలు" ఒక మూల నుంచి రామయ్య సెట్టి అరిచాడు. నానక్‌రామ్ అతడివైపు చూచి తలాడించేడు. అతడి గుమాస్తా వంగి, "చాలుసాబ్. ఇంకా అనవసరం" అన్నాడు. నానక్‌రామ్ ఆలోచిస్తున్నాడు.

చాలా సేపు మౌనం....

"లక్షా ఇరవై వేలు" చివరికి అన్నాడు.
రామయ్య సెట్టి ధైర్యంగా, "లక్షా పాతిక వేలు" అన్నాడు.

రవికిది ఆశ్చర్యంగా వుంది. వీళ్ళంతా తన స్నేహితులు! ఇప్పుడు తనని గమనించనట్టే ప్రవర్తిస్తున్నారు.

తోటి పక్షి చచ్చిపోతూంటే, తమ తోటిదే అనైనా ఆలోచించకుండా పీక్కుతినే రాబందులు గుర్తొచ్చేయి. అంత అర్ధరాత్రి సర్వం వదిలిపెట్టి అన్నయ్య ఎందుకు వెళ్ళిపోయేడో అర్థమయింది.

పాట పోటీలమీద సాగుతూనే వుంది.
లక్షా యాభయ్‌వేలు" అన్నాడు భగవాన్‌దాస్.

ఆ యింటికి అంతకన్నా ఎక్కువరాదు. కానీ నానకురామ్‌ది పక్కయిల్లే. కొనుక్కుంటే తనదాంట్లో కలిపేసుకోవచ్చని ఆశ. కొంచెం తటపటాయించి'లక్షా డెబ్బయ్‌వేలు' అన్నాడు ఒక్కసారిగా ఇరవై వేలుపెంచి.

దాంతో ఇంకెవరూ మాట్లాడలేదు.
"ఒకటోసారి...."

చీమ చిటుక్కుమంటే వినబడేటంత నిశ్శబ్దం!

అది లక్షదబ్బాయివేలకి అమ్ముడుపోతే తమకి ఎంతవస్తుందో.... తామింకా ఎంత ఇవ్వాలేలతామో లెక్కకడుతున్నాడు రవి.

కిరణ్మయి ఆఖరిసారిగా బంగ్లావేపు చూసింది.

ఎంత కాదనుకున్నా దుఃఖం లోపల్నుంచి పొంగివస్తూంది.

ఓ అర్ధరాత్రి నిస్సహాయమయిన స్థితిలో తాము మొదటిసారి ఆ యింటికి కట్టుబట్టలతో రావటం— చైతన్య అభిమానం— అంతా జ్ఞాపకం వచ్చింది. విధి వైపరీత్యంవల్ల ఆతడు ఈయింటిని వదులుకొన్నాడు ఈ రోజు తాముకూడా దాన్ని నిలుపుకోలేకపోతున్నారు—

ఆమె ఈ ఆలోచనలో వుండగానే రామయ్య "పెట్టిలక్ష దెబ్బాయి వేలు" అన్నాడు అదే ఆఖరిబెట్ అన్నట్టు.

అందరూ నానకు వేపు చూశారు— పోటీగా పాడతాడేమోనని. కానీ ఆవేశంతో నష్టపోకుండా హెచ్చరించే వ్యాపారలక్షణం అతనిరక్తంలో జీర్ణించుకుపోయివుంది.

ఇక ఇష్టంలేనట్టు తల పక్కకి తిప్పుకొన్నాడు.

"లక్షదెబ్బయ్ అయిదు వేలు ... మొదటిసారి"

ఎవరూ మాట్లాడలేదు.

"రెండోసారి—"

ఇంకా నిశ్శబ్దంగానే వుంది.

డీల్ ముగియబోతున్నట్టు బల్లమీదకొట్టి 'మూడోసారి అనబోతు వుండగా "రెండులక్షలు" అని అప్పుడే వచ్చినవ్యక్తి కంఠంవినబడింది

రవి చప్పున తలెత్తాడు.

అందరూ అటు తిరిగేరు.

అక్కడ చైతన్య నిలబడివున్నాడు.

రవికి ఒక్కక్షణం నోట మాటరాలేదు. అడుగు తడబడింది. చప్పున అటు పరుగెత్తబోయాడు. ఆత్మీయుడ్ని చూసిన సంతోషం-కష్టం గట్టెక్కుతోందన ధైర్యం ఉమ్మడిగా ఒక్కసారిగా పెనవేసుకొన్నాయ్ కిరణ్మయి ..డా అదేస్థితిలోవుంది.

రవి చైతన్యని చేరుకొన్నాడు. రెండుచేతులూ పట్టుకొని గట్టిగా వూపేస్తూ— "అన్నయ్యా" అనబోయేడు. చిన్నపిల్లాడిలా ఏడుపొచ్చింది. గొంతులో ఏదో అడ్డుపడింది. మాటరాలెదు.

చైతన్య చెయ్యిచాచి దగ్గరకు తీసుకొని అనునయిస్తున్నట్టు "డోన్టు బి ఎగ్జయిటెడ్" అన్నాడు చిరునవ్వుతో గుసగుసగా.

# 21

ఆస్థి వ్యవహారాలన్నీ ఒక కొలిక్కి తేవటానికి మూడునెలలు పట్టింది.

ఇన్స్యూర్ చెయ్యని కారణంగా వచ్చిన నష్టాన్ని, ఆ తరువాత జపనీస్ కంపెనీ ఏజెంట్‌గా అర్జించిన లాభానికి సరిపుచ్చటానికి ఇన్ కంటాక్స్ వాళ్ళు వప్పుకోవటంతో రెండు సంవత్సరాల లాభంమీద పన్నుకట్టే అవసరం లేకపోయింది.

అతడి పూర్వపు వ్యాపార దక్షతకి తెలిసిన వాళ్ళు మళ్ళీ అతడికి అప్పివ్వటానికి ముందు కొచ్చేరు. అదీకాక అతడికి తీర ప్రాంతంలో ప్రస్తుతం చాలా మంచి సంబంధాలున్నాయి. అది అతడికి చాలా లాభించింది.

శారద కూడా వచ్చేసింది.

ఇంట్లో పూర్వపు వాతావరణం మళ్ళీ చోటు చేసుకొంది.

వాడిపోయిన చెట్లు మళ్ళీ తలెత్తాయి. మొక్కలు క్రొత్తచివుళ్ళు పుంజుకొన్నాయి. గేటుముందు మళ్ళీ గూర్ఖావచ్చాడు.-

ఆరోజు సాయంత్రం చైతన్య బాల్కనీలో నిలబడివున్నాడు. ఆకాశం నిర్మలంగావుంది.

కొంగలు బారులుగా ఇళ్ళవేపు సాగిపోతున్నాయి.

ఎందుకో దృష్టి క్రిందికి మరల్చిన చైతన్య భృకుటి క్షణంపాటు ముడిపడింది.

ఒక వృద్ధురాలు—వయసు వండకపోయినా, అనుభవాలు పండించి నది, కొద్దిదా కుంటుతూ ఆ యింటివైపు వస్తున్నది.

ఆమె బట్టలు శిధిలమై వున్నాయి. జుట్టు తైల సంస్కారంలేక పీచులా వ్రేలాడుతోంది. శరీరం శుష్కించింది. అడుగులు బలహీనంగా పడుతున్నాయి.

ఆ యింటివైపే పరీక్షగా చూస్తూ వస్తోంది.

ఆమె గాజుకళ్ళల్లో ఎక్కడో అంతర్లీనంగా కుతూహలం వుంది బలహీనతా దాన్ని చంపేస్తోంది. అయినా పట్టుదలగా ఆమె నడుస్తూనే వుంది.

ఆమె కడుపు వీపుకి అంటుకుపోయివుంది. కాళ్ళ క్రిందికి జారిన చీరపీలిక రోడ్డుమీద దుమ్ములో జీరాడుతోంది.

ఇంటిముందుకొచ్చి తలెత్తి చూసింది.

కొత్తగా రంగులు వేసిన యిల్లు సాయంత్రపు నీరెండలో మెరుస్తోంది. ముందున్న అశోక వృక్షాలు ఠీవిగా గాలికి వూగుతున్నాయి. బాట కిరువైపులా పాతిన తెల్లటి సున్నపురాళ్ళు కొత్త అందాన్ని సంతరించు

కొని వున్నాయి అప్పుడే విచ్చుకొన్న గులాబిమొగ్గ తన హొయలు చూసుకొని మురుస్తున్న స్త్రీలా వుంది. ఒకప్పటి పాపాలు శరీరంలోంచి ఉబికి వచ్చినట్టుగా ఫౌంటెన్‌లోంచి నీరు జివ్వున పైకొస్తోంది. పందిరి మీదకి వంగిన మల్లెతీవె పశ్చాత్తాపం పొందిన మనిషిలా వుంది. అర్థం లేని ఉపమానాలు, అర్థంకాని జీవిత సత్యాలు—

"హేయ్ వెళ్ళు—వెళ్ళు" అక్కడే నిలబడి పరిశీలనగా చూస్తున్న భిక్షకుని అదిలించేడు గూర్ఖా.

ఆమె కదల్లేదు "ఎవరుబాబూ ఇప్పుడిందులో వుంటున్నది?" అని అడిగింది.

"నీకెందుకు ఫో" కసిరేడు. యజమానిచూస్తే కొత్తగా వచ్చిన తన ఉద్యోగం పోతుందేమో అని వాడిభయం.

ఆమె యింకో అడుగు ముందుకేసింది.

మాటలో చెబితే పోదని, బెదిరించటానికి కర్ర ఎత్తేడు, ఇంతలో లోపల్నుంచి నౌఖరు రావటం కనిపించింది.

ఆమె ఆశగా చూసింది.

నౌఖరు దగ్గరగావచ్చి, "ఇదిగో-ఇదితీసుకో" అంటూ చేతిలో పెట్టాడు.

"పో. ఇకపో" అన్నాడు. గూర్ఖా.

ఆమె పిడికిలి విప్పింది.

వందరూపాయలనోటు...

గూర్ఖా కూడా దాన్ని చూసేడు, తలమునకలయ్యే ఆశ్చర్యంతో "ఏమిటిది?" అడిగేడు నౌఖర్ని "ఏమోమరి. ఎప్పుడొచ్చినా దీనికిలా ఇవ్వమన్నారు. అయ్యగారు" నౌఖరు అంటున్నాడు.

ఆమె ఆశ్చర్యంగా తలెత్తి ఆ భవనంవైపు చూసింది.

బాల్కనీ ఖాళీగావుంది.

ఆమె కళ్ళల్లో క్షణంపాటు నిరాశ....

ఆ బాల్కనీ వెనుకే బెడ్ రూం కిటికీ దగ్గర నిలబడి చైతన్య చూస్తున్నాడని ఆమెకి తెలీదు. అతడి పిడికిలో కర్టెన్ బలంగా నలుగుతోంది. నిశ్చలంగా నిలబడివుండటానికి సర్వశక్తులూ కూడగట్టుకొంటున్నాడు.

"ఎవరుబాబూ ఇడిచ్చింది?"

"బాబుగారు—చైతన్య బాబుగారు"

ఆమె ముఖంలో క్షణంపాటు ఉజ్వలమైన వెలుగ కనబడింది. క్షణంపాటే....మళ్ళీ చీకటి ఆమెను ఇక్కడివరకూ త్రోసిన అదృశ్య శక్తి—తన ఉనికిని నిరూపించుకొంది. అనత్యంకాని క్షణం. ఆకాశం కృంగలేదు భూమి చలనం అగలేదు. సముద్రం ఉప్పొంగలేదు.

ఆమె తలెత్తిచూసింది.

తోట ఖాళీగావుంది. క్రింద వరండా ఖాళీగావుంది. పక్క కారిడార్ ఖాళీగావుంది. మనసు ఖాళీగావుంది.

ఆమె నెమ్మదిగా వెనుదిరిగింది.

చేతిలోవున్నది ప్రీతిదత్తమా? లేక అదివేదనికమా?

''బాబుగారి దయవడింది. అదృష్టవంతురాలు" వెనుకనుంచి నౌకరు అంటున్న మాటలు వినబడ్డాయి.

'అదృష్టవంతురాలు' ఆమెకి పెద్దపెట్టున నవ్వొచ్చింది. దానితో పాటు ఏడుపూ వచ్చింది. ఆ తర్వాత ఆ రెంటికీఅందని ఆలోచన వచ్చింది.

ఎందుకొచ్చింది ఇంతదూరం?
ఏమీ వుండదని తెలుసు.
ఏముందో తెలుసుకోవాలని ఆశా?

ఏడు అడుగులు వడిచిన అనుబంధాన్ని క్షణంలో త్రుంచివేయ గలిగిన మనసు ఏడు సంవత్సరాలు నివసించిన భవనాన్ని చూడాలనిఎందుకింత బలవంతపెట్టింది? ఇక్కడ అతడుకనబడటం యాదృచ్ఛికమేగా అతడు తన పూర్వపు నెలవు కోరుకోవటంలో ఆశ్చర్యంలేదు.తను రావటమే ఆశ్చర్యం!

ఆమెచేతిలో వందరూపాయలనోటు నలుగుతోంది. దాంపత్యం ఖరీదు వందా?

మరి ప్రేమఖరీదు? చమన్‌లాల్ కారుకాదా?....

అయితేమాత్రం ఇంత పెద్దశిక్షా?
ఇందులో శిక్షేముంది? వచ్చినప్పుడల్లా వందదొరుకుతుంది కదా! ఆయిదునిముషాలకోసారి వెళితే పదిరోజులలో లక్షాధికారి అవ్వొచ్చు. కాడిలాకు కారు కొనుక్కోవచ్చు. కాడిలాకులో తిప్పితే తిరిగి చైతన్య ప్రేమిస్తాడా!

ఆమెకి మళ్ళీ నవ్వొచ్చింది.
ఏమాశించి వచ్చింది తను? చూసి వెళ్ళిపోవాలని— మనసెంత విచిత్రమయింది! కొంచెం ఆధారం దొరికేసరికి ఇంకొంచెం ఆశించటం మొదలెట్టింది. ఏమిటా ఆశ?

''పరిస్థితుల ప్రాబల్యంతో నువ్విలా అయ్యేవు. నీ తప్పులేదు. శరీరం అపవిత్రమయినా మనసుమాత్రం అపవి—

కాదు మనసూ అపవిత్రమయిపోయిందే. ఇప్పుడంటే రోగం శరీరాన్ని కాల్చేసేక మనసు పునీతమయింది కానీ లేకపోతే పశ్చాత్తాపం అనేదివుందా—

అతడు చేయిసాచి అహ్వానిస్తే మాత్రం వెళ్ళగలుగుతుందా ఆహ్వానించటానికి అతడి జీవితం కథాకాదు. కధలోలా అతడు ధీరోత్తు డూకాదు. మనసులో మానవత వుందికాబట్టే ఈ మాత్రమయినా దయచూపించ గలిగాడు. తమ మానవతావాదం కాదుగదా తమ సాంప్రదాయాన్ని కూడా గౌరవించలేకపోయింది. మళ్ళీ కాంట్రడిక్షన్.

ఏది సాంప్రదాయం?

ఋషులలోకెల్లా మాన్యతముడవైన ఓ మనువా! నువ్వుచెప్పు. ఏదిసాంప్రదాయం?

వివాహసంబధమెప్పటికి విలేయము కాదన్నావు. అయినాద్వితీయ కళత్రాని కనుమతిచ్చేవు. స్త్రీలు పూజింపబడేచోట ఐశ్వర్యంనెలకొంటుం దన్నావు. మళ్ళీ స్త్రీలు స్వాతంత్ర్యానికి అర్హులుకారని నువ్వే అన్నావు. సాధు ప్రవర్తన కలవారు సాధువులవుతారని దుశ్చరితులు దురాత్ములవు తారని బృహదారణ్యకంలో చెప్పిన మంత్రమువిజమయితే మనకర్మలు విష్ణురకారణత నియమ శృంఖలా బద్ధములా అయితే స్వచ్ఛందతకు చోటేది?

కర్మసంచితము కావొచ్చు. ప్రారబ్ధము కావొచ్చు. ఆగామి కావొచ్చు. మిగతా రెండువిషయాల్లో మనిషి స్వేచ్ఛాజీవిఅయితేకావొచ్చు

కానీ ప్రారబ్ధానికి సంబంధించినంతవరకు మనిషికి స్వాతంత్ర్యములేదు.

మనువుచెప్పినా మార్క్స్ చెప్పినా ధర్మశాస్త్ర ప్రవర్తనాసూత్రముల విధి నిషేధాలగురించేకాని విధ్యనుసరణంకన్నా ఎక్కువ ప్రాధాన్యత గలది మనిషి జీవితంలో ఇంకొకటివుందని మనుస్మృతే వప్పుకొంది.

అది— బ్రతుకుతో ముడిపడివున్న కర్తవ్యతానమస్య!

———

ఆమె పెదవులమీద చిరునవ్వు వెలిసింది.

ఆకలికి చెత్తకుండీదగ్గర నిలబడి ఎంగిలాకులు ఏరుకోబోతున్న క్షణం మనిషి బలహీనత అర్థమయి చైతన్య ఆమెని ఎలా క్షమించగలిగేదో ఈ క్షణం ఆమె అతడిని క్షమించగలిగింది.

ఆరోజు రాత్రి లోకం సమస్తం నిద్రించినవేళ నిర్మానుష్యమైన స్మశానంలో ఆహ్వానించే సమాధులమధ్య.... కాలే చితులమధ్య ఒక ప్రాణి తనవంటికి నిప్పంటించుకొని దగ్ధమయింది.

భర్తయిచ్చిన వందలో రెండురూపాయలు మాత్రం కిర్సనాయిలుకుఖర్చవగా, మిగతాది ఆమెతోపాటే మసి అయింది.

దట్టమైన అడవిలో ఓ గడ్డిపూవు రాలిపోతే ఎవరికి తెలుస్తుంది?

అదే సమయానికి తనగదిలో చైతన్య కూర్చొనివున్నాడు.

బెడ్‌లైట్ మసక వెలుతురు చీకటిని పూర్తిగా పారద్రోలలేకపోతోంది.

అతడిముందు బల్లమీద, ఆ రోజు వచ్చిన పోస్టువుంది.

అందులో ఒకటి శుభలేఖ దీపక్‌ది.

దాన్ని చేతిలో పట్టుకొని అలాగే చూస్తూ కూర్చుండిపోయేడు. అతడి మనసంతా శూన్యంగావుంది. ఒకటి చెల్లి జ్ఞాపకంవచ్చి, రెండు వచ్చివెళ్ళిపోయిన భార్యగురించి.

చిత్రంగావుంటుంది. అయినా ఏమూలో ఆశవుంది. చెల్లిచేసిన తప్పేమిటి.... వసే భార్యగా ఆమె ఎందుకు ఆదరింపబడకూడదు? శరీరంతోపాటు మనసు మలినంఅవదని నమ్మితే చాలు. తన స్వవిషయం వేరు. అక్కడ మలినం అయింది మనసు.

అయితే తనకు మనసెంత ముఖ్యమో, పక్కవాడికి శరీరం అంత ముఖ్యంకావొచ్చు. తనలాగే పక్కవాళ్లూ ఆలోచించాలనుకోవటం పొరపాటు.

ఆలోచన మెదడుని రాసిపెట్టే సంఘర్షణని సృష్టించితే తప్ప-ఇంకేవిధంగానూ లాభించదు.

ఒకసారి ఇదిస్ఫురించాక అతడు శుభలేఖని డ్రాయరు సొరుగు లోకి, ఆలోచనలని మనసుని అడుగుపొరలలోకి తోసేసాడు.

అనవసరమైనదాని గురించి ఆలోచించకుండా వుండటాన్నిఅతడు మనసుకి ఎప్పుడో నేర్పేడు.

పక్కమీదవాలి పదినిముషాలలో నిద్రపోయాడు.
ఆ మరునటిరోజు క్రిస్టమస్!

ఆరోజున చైతన్య యింట్లో పార్టీ ఏర్పాటుచేయబడింది. దానికి వెనకున్నది శారదే. పాత సాంప్రదాయాన్ని వదిలిపెట్టడం ఆమెకిష్ట

లేదు. అదీకాక 'ఆరోజు' చైతన్యని పాతఆలోచనలనుంచి రక్షించేటందుకు ఏదో వ్యాపకం వుండాలని తలచింది.

ఆమె ఆలోచనని రవీ, కిరణ్మయి సమర్థించటంతో చైతన్యకి కూడా ఒప్పుకోక తప్పలేదు పార్టీ జరుగుతూవుండగా శారద ఎంతమంచి ఆలోచనతో ఈ ఏర్పాటుచేసిందో అతడికి అర్థమయింది.

చాలాకాలంతర్వాత మళ్ళీ అందరూ అతనింట్లో కలుసుకోవటం_

చైతన్య చాలా వుత్సాహంగా అటూఇటూ తిరిగుతూ అందర్నీ పలకరించసాగేడు.

శారద లోపలుండి అన్నీ సరిగ్గా అందుతున్నాయోలేదో చూస్తోంది.

ఎవరితోనో మాట్లాడుతున్న రవిని దూరంనుంచి గమనించింది కిరణ్మయి ఎంతో బాధ్యతనుంచి రిలీఫ్‌పొందినట్లు తేలిగ్గా వున్నాడు

చైతన్య లోపలికి వెళ్ళాడు.

చీరకొంగు నడుములోకిదోపి, ఏర్పాటులను పరిశీలిస్తోంది శారద. తలరేగింది. నుదుటిమీద చెమటపట్టింది. అతడిని చూసి చిరునవ్వుతో "ఇలా వచ్చారేమిటి" అంది.

అతడు దానికి సమాధానమివ్వకుండా ఆమెని పరిశీలనగాచూస్తూ

"నీకెందుకుయిదంతా. పనివాళ్ళు అంతమంది వుండగా" అన్నాడు

వాళ్ళు చేసే మనం స్వయంగా చూసుకొన్నంత బాగావుంటుందా" అందామె.

"మన్వా రాకూడదూ అందరికి పరిచయంచేస్తాను"

"ఏమనిచేస్తారు——?" అతనేదో అనబోయేటంతలో నౌకరువచ్చి కాఫీగిన్నె బల్లమీదపెట్టి వెళ్ళిపోయాడు.

బల్లకి అవతలివేపున ఆమెచేతిలోనుంచి డిషెస్‌వున్న గిన్నె తీసుకొని పక్కనేవున్న నౌకరుకి అందించుతూ నువ్వు పదిమందిలోకిరావాలి ఇక. మునపట్లాకాదు" అన్నాడు.

"మునపట్లా ఏంకాదు?"

"మళ్ళీ ఈ ప్రపంచంలోకి వచ్చేశాంగా"

"ఈ ప్రపంచం అంటే పదిమందిలోకి రావటమా?" అంది అర్థం కానట్టు.

అతడీ ప్రశ్నకు తికమకపడి ఏం జవాబుచెప్పాలో తెలియక "నే వెళతాను అన్నాడు.

ఆమె నవ్వి, "వెళ్ళండి హోస్టు ఎమయ్యాడా అని బయట కంగారుపడుతుంటారు" అంది.

అతడు మళ్ళీ బయటకు వచ్చాడు.

దక్షిణంవేపునుంచి ఆకాశం నెమ్మదిగా మేఘావృతమవుతోంది. చల్లటిగాలి వీస్తున్నది.

డిన్నర్ పూర్తయింది నౌకర్లు ఫ్రూట్‌సలాడ్ సర్వ్‌చేస్తున్నారు.

"గుడ్‌యీవెనింగ్ రవీ అన్నాడు వానకురామ్.

"గుడ్ యీవినింగ్" పొడిగా అన్నాడు రవి. ఎంతదాచుకొన్నా అతడిమొహంలో అసహ్యం కనబడుతోంది. తాను నిస్సహాయస్థితిలో

వుంచే దాన్ని తనకోసం వుపయోగించదల్చి కొన్నవాడు ఇప్పుడు ఏమీ జరగనట్టు తనని విష్ చేస్తున్నాడు.

"ఈయన యశస్వి, ప్రొడ్యూసరు." ప్రక్కనున్న అతిథిని ఇంట్రడ్యూస్ చేసేడు నానక్‌రామ్. పంచా లాల్చీలో హుందాగా వున్నాడు. ఆయన రవికి షేక్‌హేండిస్తూ, "మనం కలుసుకోలేదు. మీ అన్నయ్య బాగా తెలుసు నాకు" అన్నాడు.

"ఏమిటి మీ కొత్త పిక్చరు—" సంభాషణ కలుపుతూ రవి అడిగేడు.

ఇంతలో చైతన్య అక్కడికి వచ్చేడు. "హలో యశస్వీ—" చేయి అందిస్తూ అన్నాడు.

"హలో చైతన్యా! ఎలా వుంది వ్యాపారం?"
"దేముడి దయవల్ల బాగానే వుంది."

నానకురామ్ ఆశ్చర్యంగా "మీరు దేముణ్ణి నమ్ముతున్నారా?" అన్నాడు. అంతకు ముందు అలా అనటం వినకపోవటంవల్ల.

ఆ ప్రశ్నకి వెంటనే సమాధానం చెప్పలేదు చైతన్య. కొంచెం ఆగేడు. "దేముడున్నాడో లేదో నాకు తెలీదు. కానీ సకల చరాచరాల్నీ ఆడిస్తున్న శక్తి ఒకటున్నదని నమ్ముతున్నాను."

యశస్వి నవ్వి, "చాలా నిజాయితీతో చెబుతున్నారే" అన్నాడు.
చైతన్య నవ్వలేదు. "ఔను" అన్నాడు.
యశస్వి జేబులోంచి రూపాయికాసు తీసేడు.

"పందెం కట్టండి. ఇది బొమ్మ పడుతుందో— బొరుసు పడుతుందో. బొరుసు పడితే నేను దేముడున్నాడని నమ్ముతాను. బొమ్మ పడితే—"

చైతన్య మాట్లాడలేదు. ఆయన చేతిలో వున్న రూపాయికాసు వైపే తదేకంగా చూసి— నెమ్మదిగా అన్నాడు. "నేను నా నమ్మకాన్ని ఉపసంహరించుకొంటాను."

ఆయన నవ్వి. "అదేం పందెం? ఇంకేదన్నా పెద్దది కాయండి" అన్నాడు.

అప్పటికే అది అందర్నీ ఆకర్షించింది. చుట్టూ చేరేరు. అందర్లోనూ కుతూహలం.

చూపుడు వేలిక్రింద బొటన వేలు పెట్టి, దానిమీదున్న రూపాయి కాసుని ఎగరవేయబోతూ "చెప్పండి" అన్నాడు.

అదే గంభీరమైన గొంతుతో చైతన్య నెమ్మదిగా స్పష్టంగా అన్నాడు. "బొమ్మపడితే నా ఆస్తి సర్వస్వం మీకు వదులుకొంటాను".

అక్కడి గాలి స్థంభించింది.

ఆయన చప్పున చెయ్యి వెనక్కి తీసుకొని, "ఏమిటీ" అన్నాడు— తను సరీగ్గా వినలేదేమోనని.

చైతన్య మళ్ళీ చెప్పేడు. ఎవరో అతన్ని వారించబోయేరు.

యశ్వసి భార్య చైతన్యవైపు జాలిగా చూసింది. తన భర్తకి ఈ బొమ్మా బొరుసూ ఆడటం సరదా అని ఆమెకు తెలుసు. ఈ రూపాయి కాసు ఆయన తీసిన సినిమాలోది. రెండు వైపులా బొమ్మ వున్నది.

పరిచయస్తుల్ని దాంతో ఏడిపించటం ఆయన అలవాటు.

అతడి ఆస్థి ఆయన తీసుకోకపోవచ్చు. కానీ చైతన్య మాత్రం అందర్లోనూ అవమానం పొందటం నిశ్చయం. అదీ దేముడి పానికి విషయంలో. ఆమె భయం అదే.

అప్పటివరకూ నవ్వుతూన్న రవిమొహం టెన్షన్‌తో ఎర్రబడింది. చైతన్య యీ మాటల్ని నవ్వుతూ అనలేదని అతడికి తెలుసు.

కిరణ్మయి జరుగుతున్నదంతా ప్రేక్షకురాలిలా చూస్తోంది.

"బాగా ఆలోచించే యీ పందెం కాస్తున్నారా?" అడిగేడు ఆయన. చైతన్య తలూపేడు.

ఆయన చేతిలో కాసు గాలిలోకి ఎగిరింది.

అందరూ వూపిరి బిగపట్టారు.

అది క్రింద పడగానే ఇద్దరు ముగ్గురు చప్పున ఆత్రుతగా వంగి చూసేరు.

బొరుసు!

ఎంతో కాన్ఫిడెంట్‌గా— నమ్మకంగా వున్న ఆయన మొహం, నమ్మశక్యం కానిది చూస్తున్నట్టు విస్తుపోయింది.

ఆయన భార్య కూడు క్షణం ఆశ్చర్యపోయింది. కానీ అంతలోనే తేరుకొంది. ఏదో అర్థమైనట్టు ఆమె పెదవుల మీద చిరునవ్వు వెలిసింది.

భర్తవైపు తిరిగి, "టాక్సీవాడు రెండు రూపాయి కాసులు యిచ్చేడుకదండీ! మీ 'సినిమా' రూపాయి వాటితో కలిసిపోయినట్టుంది" అంది.

అప్పటివరకూ అయోమయంగా చూస్తున్న ఆయనకి ఏదో ఆధా రం దొరికినట్టయింది. పప్పున జేబులో చెయ్యిపెట్టి ఇంకో రెండు రూపా యలు తీసేడు. అందులో ఒకటి తను ప్రొడ్యూస్ చేసిన సినిమాలోది.

రెండువైపులా బొమ్మ వున్నది.

అందరూ తేలిగ్గా వూపిరి పీల్చుకొన్నారు. ఒకరిద్దరు చప్పట్లు కొట్టారు కూడా.

"దేముడున్నాడని నమ్ముతున్నారా ఇప్పుడన్నా ?" వానకురామ్ అడిగేడు. యశస్వి ఏదో చెప్పబోయేంతలో చైతన్య కల్పించుకొని అన్నాడు.

"నేను చెప్పింది దేముడి గురించి కాదు. మనల్ని ఆడిస్తూన్న అదృశ్య హస్తం గురించి ... దేముడున్నాడో లేదో నాకు తెలీదు."

ఒప్పుకుంటున్నట్టు యశస్వి తలూపేడు.

తరువాత టాపికు అతీత శక్తులమీదకీ, సిక్త్సెన్స్ మీదకీ వెళ్ళింది.

"మీకున్న సిక్త్సెన్స్ ఉపయోగించి ముందేం జరగబోతుందో ఏదైనా ఒక విషయం చెప్పగలరా ?"

"చెప్పగలను" అన్నాడు చైతన్య.

"ఏమిటి చెప్పండి ?"

"ఇంకొంచెం సేపట్లో బ్రహ్మాండమైన వర్షం రాబోతోంది."

మళ్ళీ పెద్దపెట్టున నవ్వులు చెలరేగేయి.

ఆకాశంలో పూర్వంకన్నా ఎక్కువగా మబ్బులు ముసురుకొంటు న్నాయి.

ఒకరొకరే శలవు తీసుకొని వెళ్ళిపోసాగారు. అందరూ వెళ్ళేక లోపలికి వస్తోంటే కిరణ్మయి అడిగింది. "ఏం ధైర్యంతో అంత పెద్ద పందెం కాసేరు ?"

''నన్ను నేను పరీక్షించుకోవాలనిపించింది."

"అయితే మాత్రం అంత పెద్ద పందెమా ?"

''పెద్దది— వాళ్ళ దృష్టిలో .... అని అతడు తన గదిలోకి వెళ్ళేడు.

దూరంగా తొమ్మిది కొట్టింది.

బాగా అలసిపోవటంవల్ల మాగన్నుగా నిద్రపట్టింది. కాపీ ఎక్కువ సమయం గడవక ముందే దూరంగా ఎక్కడో గట్టిగా ఉరమటం వల మెలకువ వచ్చింది.

బయట కుంభపోతగా వర్షం కురుస్తోంది.

మెరిసినప్పుడల్లా కారిడార్ వెలుగుతో నిండిపోతోంది.

అతడి కెందుకో వర్షాన్ని చూస్తూ కూర్చోవాలనిపించింది. గది తలుపులు తీసుకొని, వరండాలోకి వచ్చేడు. కారిడార్ చివర అద్దాల కిటికీ దగ్గర పడక కుర్చీలో కూర్చొన్నాడు.

దూరంగా ఓ పాక. పర్ణశాలలా వుంది. ఇంత చలిలో అదులోలి వాళ్ళెలా వుంటారో అనుకొన్నాడు. ఎయిర్ కండిషనర్ చల్లగాలిని

కండిషన్ చేసి చల్లగాలిని లోపలికి పంపుతోంది.

లేచి వెళ్ళి దాన్ని ఆపుచేసి, కిటికీ తెరిచేడు.

పెద్దపెద్ద కొమ్మలు గాలికి అటూయిటూ వూగుతూ మరింత శబ్దాన్ని సృష్టిస్తున్నాయి. అతడు విశ్చలంగా చూస్తున్నాడు.

దూరంగా ఎక్కడో పిడుగుపడింది. కొంచెం సేపటికి తలుపు తీసిన చప్పుడు.

వెనుక అలికిడి వినిపించి, "ఎవరదీ" అన్నాడు.

చీకట్లో అతడు కనబడకపోయినా, కంఠం గుర్తించి "నేను" అంది శారద. "కరెంటు పోయినట్టుంది.

"ఔను" అన్నాడు అతడు.

"ఏం చేస్తున్నారు చీకట్లో?"

"వర్షాన్ని చూస్తున్నాను."

ఆమె పక్కగావచ్చి "వర్షాన్ని చూస్తే మీకు భయం అన్నాడు అతడు.

ఇప్పుడుకాదు. ఒకప్పుడు అన్నాడు చైతన్య. "కొన్ని సంవత్సరాల క్రితం ఇదే క్రిస్మస్ రోజు రాత్రి వచ్చిన వర్షం నాకు కలిగించగలిగినంత నష్టాన్ని కలిగించి వెళ్ళి పోయింది. దానితో పాటే అదంటే నాకు భయం పోయింది." అంటూ కుర్చీలో కుర్చొన్నాడు. చాలాసేపు మౌనంగా వుంది. "— ఈ రోజు బాబు పుట్టినరోజు" అన్నాడు. అలా అన్నప్పుడు అతడి కంఠం వణికింది.

ఆమె తలెత్తి చూసింది. ఏ జ్ఞాపకాలు అతని ఈ రోజు చుట్టి ముట్టకుండా ఈ ఏర్పాట్లన్నీ చేసిందో- ఆ విషాద ఛాయలు అతని మొహం మీద ప్రతిబింబించటం చూసి కలవర పడింది.

మాట మారుస్తూ, "మీకు వర్షాన్ని చూస్తూ కూర్చోవాలనిపిస్తోంది, నాకైతే ఇంకో కోర్కె కలుగుతోంది." అంది- ప్రక్కనే క్రింద కూర్చుంటూ.

"ఏమిటీ?"

"చేతనైతే ఓ కుంచెతో ఈ ప్రకృతి అందాన్ని ఫ్రేములో బిగించడం—"

ఆదే సమయానికి హరికెన్ లాంతరు వెలిగించటానికి వచ్చిన కిరణ్మయి, బైట్నుంచి పడ్తూన్న మసక వెల్తుర్లో ఏదో అపురూపమైన దృశ్యం చూస్తున్నట్టు నిలబడిపోయింది.

చెల్లెలు మోకాళ్ళమీద కూర్చొని వేలితో నేలమీద గీతలు గీస్తోంది అతడు వెనక్కివాలి కళ్ళు మూసికొని వున్నాడు.

అలికిడికి కళ్ళు తెరచి. "రా కిరణ్మయీ! అలా నిల్చుండి పోయావేమిటీ?" అన్నాడు.

అమె లోపలికి వస్తూ! "ఇదిగో-హరికెన్ లాంతరు వెలిగిద్దామని ...." అంది! శారదలేస్తూ, నేను తీసుకొస్తాను. అని లోపలికి వెళ్ళింది.

కిరణ్మయి వచ్చి కుర్చీలో కూర్చొంది.

చాలా సేపు మౌనం.

"ఏమిటీ ఆలోచిస్తున్నావ్?"

ఆమె ఉలిక్కిపడి "ఏమీ లేదు" అంది.

అతడు నవ్వి. "ఏమీ లేకుండా ఎలా వుంటుంది?" అన్నాడు.

"చెప్పమంటారా?"

ఆమె చాలాసేపు మౌనంగా వుండి, తనలో తనే మాట్లాడుకొంటున్నట్లు అంది. "చాలా రోజుల వెనుక.... కొన్ని సంవత్సరాల క్రితం.... ఈ కారిడార్‌లోనే నేనొక అపూర్వ దృశ్యం చూసేను చైతన్యబాబూ ఒక భర్తకి భార్య తమలపాకులు అందిచడం— చాలా మామూలు దృశ్యం అది. కానీ నా మనస్సులో ఎందుకో సూటిగా హత్తుకుపోయింది. నాకనిపించింది అప్పుడు—'డబ్బుంటేనే ఆప్యాయతలూ మమతలూ వస్తాయని' ఆ మాటే మీతో అంటే— "డబ్బుకీ అనురాగానికి సంబంధం లేదని" మీరన్నారు అప్పుడు. జ్ఞావకం వుందా?" అని ఆమె ఆగింది."— మీ మాటే నిజం అని యిప్పుడు అనిపిస్తోంది. నా అభిప్రాయం తప్పు"

"అప్పటి అభిప్రాయమే నిజం కిరణ్మయీ. ఈ ఆప్యాయతలూ డబ్బువల్లే వస్తాయని నా అనుభవం నాకు చెప్పింది. డబ్బులేకపోతే" అంటూ అగి నెమ్మదిగా "మనిషిని మనిషిగా చూడరు.... భార్య భర్తని చూడదు. నా అభిప్రాయాన్ని మార్చుకొంటున్నాను" అన్నాడు.

"అదేమిటి? నేను నా 'అప్పటి' అభిప్రాయాన్ని మార్చుకొని మీతో ఏకీభవించబోతూ వుంటే, మీరు మీది మార్చుకోవడం ఏమిటి? ఎంత డబ్బున్నా అనురాగాన్ని అది పుటించదు. నేను అనుభవ పూర్వ

కంగా తెలుసుకొన్నది అది.... డబ్బు భార్యభర్తల మధ్య విద్వేషాల్ని సృష్టించటానికి తప్ప ఇంక దేనికి వుంయోగపడదు.

"అలా ఎందుకనుకోవాలి? డబ్బులేకపోతే డాక్టరు తోటి మనిషిని చూడరు! తనకున్న చదువూ సంస్కారం స్త్రీని ఏ విధంగానూ రక్షించ లేదు" అన్నాడు. భర్త సర్వస్వం వదలి వర్ణశాలకి వెళ్ళే ఏ భార్య ఈ రోజుల్లో అనుసరించదు.''

"మీకు తెలియదా- యీ డబ్బుచేసే మాయ గురించి!'' అంది కిరణ్మయి.



''డబ్బు చేసేది మాయ అని నువ్వే అన్నావు కదా! డబ్బు ప్రేమని సృష్టిస్తుంది. ఆమాయే లేకపోతే.... ఏదో అనబోతున్న చైతన్య అపుచేసేడు.

గుమ్మందగ్గర నిలబడి వాళ్ళ సంభాషణ వింటూన్న శారద చైతన్య తలెత్తేనరికి చప్పున నవ్వు ఆపేసింది. అయినా అది అతని కంట బడింది.



తెగిన ఆలోచన_ఆలోచిస్తే దొరికే సమాధానం _ సమాధానం కోసం ప్రయత్నం-ప్రయత్నిస్తే జ్ఞాపకాలు_జ్ఞాపకాల పూసల పేరు-దండ గుచ్చితే ఆకృతి-అకృతి అనుభవం, చెప్పలేని నిజం.

ప్రియమైన పాఠకుడా. శారద ఎందుకు నవ్వింది!

— సమాప్తం —